# చిరంజీవులు

ప్రసిద్ధ వ్యక్తులపై
ఆంధ్రజ్యోతి సంపాదకీయాల సంకలనం

**1963 – 1986**




## నండూరి రామమోహనరావు

# వ్యాసానుక్రమణిక


| | |
|---|---|
| ఉపోద్ఘాతం | 5 |
| స్వామి వివేకానంద | 9 |
| రాజర్షి | 11 |
| దారుణ హత్య | 13 |
| మన నెహ్రూ మరిలేడు | 16 |
| నెహ్రూ సోషలిజం | 19 |
| నెహ్రూ వీలునామా | 22 |
| ఫిడేలు నాయుడుగారు | 24 |
| చరిత్రలో చర్చిల్ | 26 |
| సంస్మరణ | 28 |
| ఆంధ్రరత్న | 30 |
| నోబెల్ సాహిత్య బహుమతి | 32 |
| కథాకథన చక్రవర్తి | 34 |
| టాగోర్‌పై విషేధం | 36 |
| చౌడయ్య | 38 |

నేతాజీ స్మృతి 39

గాంధీజీ వర్ధంతి 41

బూర్గం 43

శివరామశాస్త్రిగారు 45

గాంధి జయంతి 46

డాక్టర్ భాభా 48

విప్లవకర దేశభక్తుడు 50

వాల్ట్ డిస్నీ 53

మాళవ దృక్పథం 55

గోర్కీ శతజయంతి 59

హెలెన్ కెల్లర్ 61

మహాకవి స్మృతికి అపచారం 63

అపర భగీరథుడు 65

కారుణ్యమూర్తి 69

సత్యమూర్తి 71

ధర్మమూర్తి 74

శాంతమూర్తి 76

స్వాతంత్ర్యమూర్తి 79

షా, షేక్స్పియర్ 82

కీర్తిశేషుడు బందా 85

ముందు చూపు 87

అన్నాదురై 90

మహాకవి గాలిబ్ 93

ఐసెన్‌హోవర్ 95

గాంధి శతకం 97

శక్తిపూజ 99

డాక్టర్ మకర్ట్ 102

మహానాయకుని మరణం 104

జనరల్ డిగోల్ 108
ఆంధ్ర పితామహుడు 111
సి. వి. రామన్ 113
సాహిత్యంలో అశ్లీలం 116
నోబెల్ సాహిత్య బహుమతి 119
మధుర గాయకుడు 122
మహాశాస్త్రవేత్త 123
నవ్యాంధ్ర నిర్మాత 124
హెయిలీ సెలాసీ 126
కృష్ణమీనన్ 129
డి సికా 131
పెరియార్ 132
పి. జి. వుడ్‌హౌస్ 134
ఒక స్వర్ణోత్సవం 136
గోరా 139
చక్రపాణి 141
అసాధారణ వ్యక్తి 142
చరిత్రకు భాష్యకారుడు 144
చార్లీ చాప్లిన్ 147
చౌఎన్‌లై 149
విప్లవ కవి 151
అంతమైన లాంగ్‌మార్చ్ 154
విశ్వనాథ 156
శివశంకరస్వామి 158
ఉదయశంకర్ 160
నాయని 161
ఆదర్శమూర్తి 162

తాళ్ళపల్లి వారు 164

అబ్బూరి 165

అసాధారణ రచయిత 167

లోక్ నాయక్ 170

మహాకవి అస్తమయం 173

మానవతావాది సార్త్రె 176

వి. వి. గిరి 178

మధుర గాయకుడు రఫీ 180

రాఘవ శతజయంతి 182

కొడవటిగంటి 185

బహుముఖ ప్రజ్ఞాశాలి 187

పోతన పంచశతి 190

"రమ్యాలోకి" రాయప్రోలు 193

మారేశ్వాడు 194

పులి పంజా 197

[illegible] ఉత్సవాలు 199

ఇద్దరు మహనీయులు 203

యుగకర్త నిర్యాణం 206

వచన కవితా పితామహుడు 209

నేలకొరిగిన గులాబి 212

ఇందిరా అమర్ రహే 215

మానవతావాది కవి 219

[illegible] 221

[illegible] శతజయంతి 224

[illegible] దూరబంధువు 226

గురువుగారి గురువు 230

ప్రతిభాశాలి 234

ధన్యజీవి 236

# ఉపోద్ఘాతం

**ఈ** సంపుటంలోని వ్యాసాలన్నీ 'ఆంధ్రజ్యోతి' లో నేను 1963 - 1986 సంవత్సరాల మధ్యకాలంలో వ్రాసిన సంపాదకీయాలు. నేను వ్రాసిన వందలు, వేల సంపాదకీయాలనుంచి ఎంచి తీసి, వీటిని ఇక్కడ సంకలించడం జరిగింది.

తక్కిన నా సంపాదకీయాలన్నీ ఒక ఎత్తు. ఇవి ఒక ఎత్తు. మిగిలిన వాటి తీరు వేరు, వీటి తీరు వేరు. వీటిలో ఎక్కువభాగం వివిధరంగాలలో సుప్రసిద్ధులైన వ్యక్తులు మరణించినప్పుడు వారి స్మృతికి శ్రద్ధాంజలి ఘటిస్తూ వ్రాసినవి. మరికొన్ని చిరస్మరణీయులైన చారిత్రక మహనీయుల శతజయంతి సందర్భంలోనో, మరొక సందర్భంలోనో వారిని సంస్మరిస్తూ వ్రాసినవి. మొత్తంపై ఈ సంపాదకీయాలన్నీ మరువదగని, మరుపురాని, మహావ్యక్తులపై—చరిత్రలో చిరకాలం నిలిచిపోయే యశశ్శరీరులపై—జోహార్ల రూపంలో వ్రాసినవే. అందుకే ఈ సంపుటానికి "చిరంజీవులు" అని నామకరణం చేయడం జరిగింది.

ఆంధ్రజ్యోతిలో నేను సంపాదకీయాలు వ్రాయడం మొదలు పెట్టింది 1962 ఆగస్టు ప్రాంతాలలో. అంతకు ముందు పది పదిహేనేళ్ళ జర్నలిస్టు జీవితంలో ఎన్నో వ్యాసాలు వ్రాయకపోలేదు కాని, సంపాదకీయ వ్యాసాలు వ్రాయడం శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారి సంపాదకత్వాన 'ఆంధ్రజ్యోతి'లో వారి సహాయ సంపాదకుడుగా ఉద్యోగ విధినిర్వహణలో భాగంగానే జరిగింది. సాధారణ వ్యాసాలకు, సంపాదకీయ వ్యాసాలకు స్వభావతః తేడావున్నదని, వుండాలని, అది నాకు మించిన పని అని భావించి, నార్లవారు అప్పుడప్పుడు అడిగినా, నా అశక్తతను తెలియజేసేవాడిని. చివరికి ఒక రోజున ఆయన నాతో "నేను ఎన్నాళ్ళని ఊరు విడిచి వెళ్ళకుండా కూర్చునేది? ఇక నుంచి మీరు వ్రాయక తప్పదు" అని అర్థాంతరంగా ఆ బాధ్యత నాకు అప్పగించి రాజ్యసభ సమావేశానికి ఢిల్లీ వెళ్ళిపోయారు. ఆ మర్నాటినుంచి నేను విధిగా సంపాదకీయాలు వ్రాయవలసి వచ్చింది. ఈత రానివాడిని నీళ్ళలో పడేస్తే కాళ్ళు, చేతులు

తవతవ కొట్టుకుంటూ, తప్పనిసరిగా ఈత నేర్చుకున్నట్టు, సంపాదకీయ రచన మొదలు పెట్టాను. ఆ తర్వాత శ్రీ నార్ల విజయవాడలో వున్నప్పుడు, లేనప్పుడు కూడా ఉద్యోగ ధర్మంగా వందలాదిగా సంపాదకీయాలు వ్రాయడం జరిగింది.

నాకు మోడల్ నార్లవారి సంపాదకీయాలే. నా దృష్టిలో తెలుగులో సంపాద కీయ రచయితగా ఆయనది ప్రథమస్థానం. అదీకాక, సంపాదకీయం ఆయన వ్రాసి నట్టుగానే వుండాలని, ఆయన ఒరవడినే అనుసరించాను. సహాయ సంపాదకుడుగా ఎటూ నేను ఆయన పాలిసీని అనుసరించక తప్పదు. కాగా మొదట్లో శైలిని కూడా అనుకరించాను. అందుచేత నేను వ్రాసిన వాటిని కూడా ఆయన వ్రాసినవిగానే పలువురు పాఠకులు భావించడం జరిగింది. ఉదాహరణకు, ఈ సంపుటంలోని ప్రథమ సంపాద కీయం "స్వామి వివేకానంద" శతజయంతి సందర్భంగా వ్రాసిన శ్రద్ధాంజలి వ్యాసం. అది శ్రీ నార్ల వ్రాసినదని భావించి ఆయన మిత్రులు కీర్తిశేషులు శ్రీ జాస్తి వెంకట నరసయ్యగారు "నార్ల" (మే, 1963) అనే పేరుతో చిన్న గ్రంథం ప్రచురిస్తూ అందులో శ్రీ నార్ల సంపాదకీయ రచనకు ఒకే ఒక మచ్చుతునకగా "స్వామి వివేకానంద" పై వ్రాసినదాన్ని ఎంచి చేర్చారు. పుస్తకం అచ్చు అయిన తర్వాత ఒక ప్రతిని తెచ్చి శ్రీ నార్లకు ఇవ్వగా, ఆయన పేజీలు తిరగవేస్తూ చివరలో "స్వామి వివేకానంద" సంపాదకీయం చూసి చాలా చిరాకుపడ్డారు. "ఇది నేను రాసింది కాదు పిచ్చి....అదుగో అతగాడు...." అని ఎదురుగా కూర్చున్న నన్ను చూపించారు. అయితే, అప్పటికే పుస్తకాలన్నీ అచ్చయిపోయినందున చేసేది లేక వూరుకున్నారు.

అలాగే ద్వారం వెంకటస్వామి నాయుడుగారి నిర్యాణ సందర్భంలో నేను వ్రాసిన సంపాదకీయం చదివి ఒక పాఠకుడు శ్రీ నార్లకు ఇంగ్లీషులో సుదీర్ఘ ప్రశంసా లేఖ— ముఖ్యంగా భాషను మెచ్చుకుంటూ— వ్రాశారు. ఆ ఉత్తరం ఆయన నాకిచ్చి "ఇదుగో, మీరు రాసినదాన్ని ఎవరో మెచ్చుకుంటూ రాశారు" అన్నారు.

మరొకసారి గాంధి శతజయంతి ఉత్సవాలప్పుడు శ్రీ నార్ల మొదటిరోజు సంపాదకీయం తాను వ్రాసి, ఆ పిదప వరసగా అయిదు రోజులు గాంధీజీపై సంపాద కీయాలు నాచేత వ్రాయించారు. వాటిని శ్రీ నార్ల పేరుతో ఒక చిన్న పుస్తకంగా అచ్చువేయడానికి, ఒకరు ఆయన అనుమతికోసం వచ్చారు. ఆయన "అవి నేను రాయలేదు. నా సహాయ సంపాదకుడు వ్రాసినవి" అని వారితో చెప్పారు. దానితో, ఆ వచ్చిన వారికి ఆసక్తి తగ్గిందో ఏమో, ఆ పిదప అవి పుస్తక రూపంలో వచ్చినట్టు లేదు.

ఇదంతా ఎందుకు వ్రాయవలసి వచ్చిందంటే నా సంపాదకీయాలకు ఒరవడి శ్రీ నార్లది. అయినా, జాగ్రత్తగా చదివితే వాక్య విన్యాసంలో, భావాభివ్యక్తిలో నార్లవారి సంపాదకీయాలకు, నా రచనకు తేడా కనిపెట్టడం కష్టం కాదు.

ఈ సంపుటిలోవివి జీవితచరిత్ర వ్యాసాలు కావు. వీటి పరిధి పరిమితమైనది. ఇవి కేవలం శ్రద్ధాంజలిగా ఉద్దేశించినవి. అయినా, వీటిలో ఎంతో కొంత జీవితచరిత్ర రాకుండా వుండదు. దినపత్రికలో సంపాదకీయ రచన అర్జంటు వ్యవహారం. ఆనాటి పొద్దుటి పత్రికలలోవి ముఖ్య వార్తపైనో, లేదా అప్పటికప్పుడు జరిగిన ముఖ్య సంఘటనపైనో అవ్యవధిగా సంపాదకీయ రచయిత వ్యాఖ్యానించవలసి వుంటుంది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, తదితర విషయాలపై నా తక్కిన సంపాదకీయాలవలె ఈ సంపుటంలోవివి కూడా అలా అర్జంటుగా, అవ్యవధిగా వ్రాసినవే. ముఖ్యంగా నెహ్రూ నిర్యాణంపై సంపాదకీయం వ్రాయడం నాకు బాగా గుర్తు. ఆయన మృతి వార్త మధ్యాహ్నం రెండున్నర ప్రాంతాలలో హఠాత్తుగా— **bolt from the blue** లాగా వచ్చింది. అప్పటికి మామూలుగా ఆరోజు సంపాదకీయం వ్రాయడం అయి పోతుంది, అయిపోయిందేమో కూడా. ఇంతలో పిడుగుపాటువలె ఈ వార్త వచ్చింది. శ్రీ నార్ల ఆ క్రిందటి రోజునే ఢిల్లీ బయలుదేరి వెళ్ళారు. నాకు కాలూ, చేయీ ఆడలేదు. ఒకవైపు టెలిప్రింటరులో వచ్చే నెహ్రూ మృతి వార్తా విశేషాలు చూస్తూ, మరొకవైపు నెహ్రూ పాత ఫొటోలు వెదికి తీస్తూ, అయిదు గంటలకల్లా మార్కెట్ లోకి పేపరు వెళ్ళాలనే ఆదుర్దాతో, ఆ సంపాదకీయం వ్రాయవలసి వచ్చింది.

ఆ తర్వాత ఒకసారి నా చిరకాల మిత్రులు, కవి, కీర్తిశేషులు దేవరకొండ బాలగంగాధర తిలక్ "నెహ్రూపై సంపాదకీయం మీరు రాసిందే కదూ?" అని అడిగారు. "మీరెలా ఊహించారు?" అని అడిగాను. "కొన్ని పదబంధాలు, పద ప్రయోగాలనుబట్టి అలా అనుకున్నాను...." అన్నారు.

నెహ్రూపై వలె అంత అవ్యవధానంగా, దాదాపు వార్త వచ్చీరాగానే, లేదా ఒకటి, రెండు గంటల వ్యవధిలోనే వ్రాసిన సంపాదకీయాలు ఇందులో చాలా వున్నాయి. నా అభిమాన రచయిత సోమర్‌సెట్ మామ్‌పై సంపాదకీయం అలా వ్రాసిందే. ఈ వార్త వచ్చిన ఒక అరగంటలోపునే వ్రాసి అచ్చుకివ్వడం జరిగింది.

అయితే, సాధారణ వ్యాసాలకు, దినపత్రిక సంపాదకీయాలకు తేడా వుంది. "మూడు దశాబ్దాలు" పేరుతో వెలువడిన తన సంపాదకీయ సంకలనం పీఠికలో శ్రీ నార్ల వ్రాసినట్టు "అప్పుడే వండి, వార్చి, వడ్డించిన అన్నంవంటిది దినపత్రికలోవి సంపాదకీయం." బాగా వ్రాస్తే అప్పటికప్పుడు రుచిగా వున్నా తరుచుగా అది "మర్నాటి పొద్దుటికి చద్దివాసన కొడుతుంది."

ఈ సంపుటంలోవి సంపాదకీయాలు ఎంతవరకు చద్దివాసన ప్రమాదంనుంచి తప్పించుకున్నాయో నిర్ణయించవలసింది పాఠక మహాశయులు. అయితే, తక్కిన నా సంపాదకీయాలపై లేని మక్కువ ఏదో వీటిపై నాకున్నది. నా వృత్తి జీవితమంతా

జర్నలిజంలోనే గడిచింది. అదొక నిరంతర, నిర్విరామ వ్యాపకం. అది నా ఇతర రచనా వ్యాసంగాలకు, సాహిత్యస్వప్నాలకు అడ్డు నిలిచింది. అందరికీ అలా జరుగుతుందని చెప్పలేను గాని, నా విషయంలో ఇంతే జరిగింది. కాగా, నా జర్నలిస్టు జీవితాన్ని జల్లెడపట్టి రచనాపరంగా నేను మిగుల్చుకున్న కొద్దిపాటి సంపదలో ఒకభాగం ఇదుగో ఈ కోవకు చెందిన సంపాదకీయాలు. మరికొన్ని రకాల సంపాదకీయాలు కూడా మరికొంత కాలంపాటు చదవదగినవి వుండవచ్చు. కాని, వాటిని ఎంచి సేకరించే కోరికవున్నా తీరిక, ఓపిక, ఓరిమి నాకు లేవు. కనుక ప్రస్తుతానికి, ముఖ్యంగా వస్త్వైక్యం కలవాటిని ఏరి, గ్రంథస్థం చేస్తే దాదాపు ఒక జీవిత కాలపు కృషిలో ఒక భాగానికి చిహ్నంగా మిగులుతాయేమోనన్న పేరాసతోనే వీటిని ప్రచురిస్తున్నాను. శ్రీ నార్ల తన "మూడు దశాబ్దాలు" సంకలనాన్ని సిద్ధంచేస్తూ "మీరు కూడా చాలా సంపాదకీయాలు రాశారుకదా ? వాటిలో కొన్నిటిని ఏరి పుస్తకంగా వేసుకోండి" అని సూచించారు. ఆ సలహామేరకు ఉత్సాహంపుట్టి మొదటగా "ఆంధ్రజ్యోతి"లో నేను రాజకీయేతర విషయాలపై వ్రాసిన లఘు సంపాదకీయాలను "అనుపల్లవి" పేరుతో ఒక సంకలనంగా 1978లో ప్రచురించాను. అలాగే ప్రసిద్ధ వ్యక్తులపై వ్రాసిన వాటినికూడా గ్రంథస్థం చేయదలచినా, వాటిని పాత ఫైల్సు నుంచి వెదికితీసి ఎత్తి వ్రాసి, చేర్చి కూర్చడానికి చాలాకాలం పట్టింది, చాలా శ్రమ అయింది. ఇప్పటికి ఆ పని పూర్తి అయి, అవి పుస్తకంగా వెలువడుతున్నాయి.

ఈ సంపుటీకరణకు మరొక ముఖ్య కారణం— ఇవి వివిధరంగాలలో ప్రసిద్ధులైన వారిని గురించి, మహావ్యక్తులను గురించి, వారి జీవితాలపై ఒక వ్యాఖ్యగా' వారి చారిత్రక ప్రాధాన్యంపై ఒక అంచనాగా, వారి చిరస్మరణీయతకు నిరూపణగా, నివాళిగా ఉద్దేశించి వ్రాసినవి. వారిని గురించి ఈనాటి యువతరం పాఠకులు తెలుసుకోవడానికి, ఒక అభిప్రాయం ఏర్పరచుకోవడానికి ఈ సంకలనం ఉపయోగపడగలదనే ఆశ ఈ పుస్తక ప్రచురణకు ఒక ప్రేరణ. నా ఆశ నెరవేరితే నాకు అంతకు మించి కావలసింది లేదు.

"ఆంధ్రజ్యోతి" యాజమాన్యం సౌజన్యంతో ఈ సంకలనం జరిగింది. వారికి నా ప్రప్రథమ కృతజ్ఞత.

నా లఘు సంపాదకీయాల సంకలనం "అనుపల్లవి"కి వలె, ఈ "చిరంజీవులు" ప్రచురణకు కూడా నా యువమిత్రుడు, ప్రముఖ రచయిత శ్రీరమణ ప్రోద్బలం, సహకారం వున్నాయి. అయనకు నా బాకీ తీరేది కాదు.

విజయవాడ,
22-12-1988.

నండూరి రామమోహనరావు
ఎడిటర్, ఆంధ్రజ్యోతి

# స్వామి వివేకానంద

ఆయనది ఆర్షవాణి. ఆయన సందేశం నిత్యనూతనమైంది; నిత్యజీవన మైంది. ఆయన తాత్త్విక దృష్టి ఎంత ప్రాచీనమైనదో అంత ఆధునికమైంది; అంత హేతుబద్ధమైంది. అందులో దుర్బలతకు, నిరాశకు, మూఢవిశ్వాసానికి, సంకుచి తత్వానికి తావులేదు.

ఉత్తర దిగంతంనుంచి కారుమేఘాలు క్రమ్ముకుని వస్తూ, భారత జాతి స్వాతంత్ర్యాన్ని, ఆత్మగౌరవాన్ని సవాలు చేస్తున్న తరుణంలో స్వామి వివేకానంద శతజయంతిని మనం జరుపుకొంటున్నాము. చైనా దురాక్రమణ కారణంగా దేశం నిద్రమత్తును వదలించుకుని పున శ్చైతన్యవంత మవుతున్న సమయంలో ఈ ఉత్స వాలు నేటినుంచి యావద్భారతంలో ప్రారంభ మవుతున్నాయి. భారతదేశం ఒక కొత్త సందేశం కోసం, ఒక కొత్త విశ్వాసంకోసం అన్వేషిస్తున్న సమయమిది. ఆ సందేశం, ఆ విశ్వాసం స్వామి వివేకానంద జీవితంలో, ఉపదేశాలలో మనకు లభించ గలదు.

రాష్ట్రపతి రాధాకృష్ణన్ మద్రాసు రామకృష్ణ మఠం వారికిచ్చిన సందేశంలో తెలిపినట్లు వివేకానంద వ్యక్తిత్వంలో హైందవ సనాతన ధర్మం సంఘ సంస్కర ణోత్సాహం, దేశభక్తి—ఈ మూడు ప్రధాన లక్షణాలు కానవస్తాయి. ఆయన హిందూ మతాన్ని గ్రుడ్డిగా ఆరాధించలేదు. అందులో దైహిక, మానసిక దౌర్బల్యానికి దారి తీసే దుర్లక్షణా లన్నింటిని తిరస్కరించాడు. హిందూ సంఘ పతనానికి కారణమైన వర్ణ వ్యవస్థను, అస్పృశ్యతను, ఇతర మూఢాచారాలను త్రోసివేశాడు. హిందూ మతంలో ఏది సజీవమైనదో, ఏది చైతన్యవంతమైనదో దాన్నే ఆయన స్వీక రించాడు. అది ఆయనకు ఉపనిషత్తులలో, భగవద్గీతలో లభించింది. శంకరుడు తన కాలానికి జరిగిన సాంఘిక, తాత్త్విక చరిత్ర పరిణామాన్నంతటిని దృష్టిలో పెట్టుకుని వేదాంత దృక్పథాన్ని సంస్కరించినట్టే, వివేకానంద తన కాలానికి జరిగిన మార్పుల

దృష్ట్యా ఉపనిషత్తులకు నూతన భాష్యం చెప్పాడు. జ్ఞానయోగంపై ఆయన ఉపన్యాసాలు ఆయనకు అపరశంకరుడనే బిరుదు ప్రసాదించాయి. న్యూటన్, డార్విన్ వంటి శాస్త్రజ్ఞుల సిద్ధాంతాలను వేదాంతానికి అన్వయించడానికి జరిగిన బృహత్ప్రయత్నం వానిలో కనిపిస్తుంది.

ఆయన కేవలం జ్ఞానయోగి మాత్రమే కాదు. కర్మయోగి కూడా. నిజమైన జ్ఞానం నిష్కామ కర్మలో పర్యవసిస్తుందని ఆయన నమ్మకం. ఈ నమ్మకంతో ఆయన పతనమై, నిద్రాణమై, వున్న భారతదేశాన్ని మేల్కొలిపి, పునరుద్ధరించడానికి నిర్విరామ కృషి చేశాడు. సంఘసేవకు, మానవసేవకు మించిన మతంలేదని ఉద్బోధించాడు. సర్వమానవ సమానత్వాన్ని ప్రబోధించాడు. తాను సోషలిస్టునని ఒకానొక సందర్భంలో ఆయనే చెప్పుకున్నాడు. సంఘానికి అట్టడుగున పడివున్న జనబాహుళ్యాన్ని వెలుగులోకి, వికాసంలోకి తీసుకురావడానికిగల సాధనాలలో సోషలిజమే మెరుగైనదని ఆయన విశ్వసించాడు.

రాజకీయాల జోలికి ఆయన అంతగా వెళ్ళకపోయినా, జాతి పునర్నిర్మాణానికి స్వాతంత్ర్య సాధన అవసరమని ఆయన భావించక పోలేదు. ముందుగా శక్తిని సంతరించుకోవాలని ఆయన బోధించాడు. దైహిక, మానసిక దార్ఢ్యం, నిర్భయత్వం - ఈ రెండు ఆయన తాత్త్విక చింతనకు మూలసూత్రాలు.

అమెరికా, యూరప్‌లలో ఆయన జరిపిన విస్తృత పర్యటనల కారణంగా ఆ దేశాల జీవన విధాన ప్రభావం ఆయనపై విశేషంగా పడింది. భౌతికాభివృద్ధిని లక్ష్యం చేసిన దేశం పారభౌతికాభివృద్ధిని సయితం సాధించలేదని, పాశ్చాత్య దేశాలవలె తాను కూడా భౌతిక సమృద్ధిని సాధించిననాడే భారతవర్షం నైతిక పునరుజ్జీవనం పొందగలదని ఆయన విశ్వసించాడు.

ఆయన జీవితం నలభై వసంతాలైనా పూర్తిగా చూడకుండా ముగిసిపోయినా, ఆ స్వల్పకాలంలో ఆయన ఎవ్వరు చేయలేని మహత్కార్యాలనేకం సంకల్పించి సాధించాడు. ఆసేతు శీతాచలం ఎన్నోసార్లు పర్యటించి తన దివ్యవాణిని వినిపించాడు. ఆర్తజన సేవకు అంకితమైన రామకృష్ణమిషన్ ఆయన సృష్టి. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః" అనే ఆర్షోక్తికి ఆయన జీవితం పరమోదాహరణం. ప్రధాని నెహ్రూ మాటలలో ఆయనవలె భారత జాతిని ప్రభావితం చేసిన వ్యక్తులు బహు కొద్దిమంది. ఆ కారణంచేతనే ఆయన అమృతుడు.

(జనవరి 18, 1963)

# రాజర్షి

దేశభక్తులలో దేశభక్తుడు, సజ్జనులలో సజ్జనుడు, యోధులలో యోధుడు, గాంధీజీ అనుచరులలో అగ్రగణ్యుడు, భారత ప్రథమ రాష్ట్రపతి డాక్టర్ రాజేంద్ర ప్రసాద్ మనకిక లేరు.

సుమారు అరవై సంవత్సరాలుగా భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో

నేమి, స్వాతంత్ర్య సిద్ధి తరువాత పదిహేను సంవత్సరాల పునర్నిర్మాణ చరిత్రలో నేమి ప్రముఖ పాత్ర వహించిన ప్రియతమ నాయకుడు మనకికలేరు.

డబ్బయ్యేనిమిదేళ్ళ వయోవృద్ధులే కావచ్చు; దైనందిన రాజకీయాల నుంచి, అధికార పదవి నుంచి తప్పుకొని, ప్రశాంత జీవనం గడుపుతూ వుండి వుండవచ్చు; కాని, ఆయన లేని లోటు భారతదేశానికి ఎన్నటికి తీరదు. ప్రశాంత గంభీరమైన ఆయన వదనం ఇక మనకు కనబడదు; మార్గదర్శకమైన ఆయన వాణి మన కిక విన బడదు.

ఆయన ఎంత నిరాడంబరులో, ఎంత సజ్జనులో అంత సాహసి, అంత కర్మదీక్షా పరాయణులు. గాంధీజీ తరువాత గాంధీ తత్వాన్ని అంతగా తమలో జీర్ణింప జేసుకున్నవారు అరుదు. దేశంలోని పదవులలోకెల్లా అగ్రపదవిని అధిష్ఠించినా, భోగ భాగ్యాలకు ఆలవాలమైన పైప్రాయి భవనంలో పదవీ కారణంగా నివసించవలసి వచ్చినా ఆయన నిరాడంబరంగానే జీవితం గడిపారు. పూర్వకాలపు రాజర్షులవలె, గీతాకారుడు ఉపదేశించిన అనాసక్తయోగాన్నే మనోవాక్కర్మలలో అనుష్ఠించారు.

మహాత్ముని అనుచరగణంలో ఆయనకు అత్యంత సన్నిహితంగా వచ్చిన ఒకే వ్యక్తి బహుశా డాక్టర్ రాజేంద్రప్రసాద్. "నేను విషపాత్రను చేతి కందించినప్పుడు దాన్ని నిస్సంకోచంగా ఆస్వాదించగలిగిన వారు కనీసం ఒక్కరైనా వుండాలి. అట్టి వ్యక్తి రాజేంద్రప్రసాద్ ఒక్కరే" అని గాంధీజీ ఒక సందర్భంలో అన్నారు. "జీసస్‌కు జాన్ ఎటువంటి వాడో గాంధీజీకి రాజేన్‌బాబు అటువంటి వాడు" అని శ్రీమతి సరోజినీ నాయుడు ఒకసారి ప్రస్తుతించారు. గాంధీజీ పట్ల రాజేన్‌బాబు విధేయత నిస్సందేహంగా అటువంటిదే.

ఆయన పరిపూర్ణ పురుషుడు. మహోదాత్తం, ప్రతిభాన్వితం అయిన ఆయన వ్యక్తిత్వం ఎన్నటికీ మరపురానిది. శ్రీమతి సరోజినీ నాయుడే మరొక సందర్భంలో పేర్కొన్నట్లు "స్వర్ణ లేఖిని మధు మషీపాత్రలో ముంచి వ్రాయవలసినంత గొప్పది డాక్టర్ రాజేంద్రప్రసాద్ వ్యక్తిత్వం." ఈ మహా నాయకుని మృతికి నేడు యావద్భారత జాతి దుఃఖిస్తున్నది. ఆయన స్మృతికి శ్రద్ధాంజలి సమర్పిస్తున్నది.

(మార్చి 2, 1963)

# దారుణ హత్య

ఇది వ్రాయడానికి కూడా చేతులు రావంత దుర్వార్త; నమ్మడానికి శక్యం కావంత ఘోర సంఘటన. గత రాత్రి భారత కాలమానం ప్రకారం పన్నెండున్నర ప్రాంతంలో జరిగిన ప్రెసిడెంట్ కెనెడీ దారుణ హత్య మొత్తం ప్రపంచాన్నే ఆశ్చర్య చకితం చేసింది; సంతాప సంచలితం చేసింది.

శ్రీ కెనెడీ హత్యను పోల్చవలసింది అబ్రహాం లింకన్ హత్యతోనే, మహాత్మా గాంధి హత్యతోనే. ప్రార్ధన సమావేశానికి వెడుతుండగా గాంధీజీని ఒక గాడ్సే, థియేటర్‌లో కూర్చుని వుండగా లింకన్‌ని ఒక జాన్ విల్క్స్ బూత్ తుపాకి గుండ్లకు ఎరచేశారు. ప్రెసిడెంట్ కెనెడీ డాలస్ నగరంలో ఒక సమావేశంలో ఉపన్యసించడానికి వెడుతుండగా—ఎవడైతేనేం ఒక హంతకుడు తుపాకి ప్రేల్చి హత్యచేశాడు.

లింకన్, గాంధీజీల వలెనే కెనెడీ తాను ధర్మమని విశ్వసించిన ఆదర్శం కోసం తన ప్రాణాలను బలిదానం చేశారు. హత్యకు కారణాలు ఇదమిత్థంగా తేలక పోయినా, జాతీయ, అంతర్జాతీయ రంగాలలో ఆయన అనుసరిస్తున్న లిబరల్ విధానాల పట్ల అసహనంతోనే ఎవరో ఉన్మాది ఈ కిరాతక కృత్యం చేశాడనడంలో సందేహం లేదు.

అమెరికన్ చరిత్రలో మొట్టమొదటిసారిగా కెనెడీ వంటి చిన్న వయస్కుని రోమన్ కాథలిక్ మతస్థుని ప్రజలెన్నుకొనడం ఆయన ఉదార భావాల పట్ల, యువకోత్సాహం పట్ల అభిమానంతోనే; సెనేటర్‌గా ఆయన చూపిన కార్యదక్షత, ధైర్య సాహసాలపట్ల ప్రశంసాభావంతోనే. 1961 లో ఆయన ప్రెసిడెంట్ పదవిని స్వీకరించి నప్పుడు, అమెరికా చరిత్ర, దానిద్వారా ప్రపంచ చరిత్ర మరొక మలుపు—అది ఎంత చిన్నదైనా కావచ్చుండి - తిరగగలదని చెక్కుమంది ఆశించారు. ఈ ఆశలను సఫలం చేయడానికే కెనెడీ గడచిన మూడేళ్ళ స్వల్ప వ్యవధిలో యత్నించారు.

ఏ క్షణంలోనైనా ప్రపంచం అణ్వస్త్ర ప్రళయానికి ఆహుతి కాగలదని మానవజాతి భయపడుతున్న రోజులలో ఆయన అమెరికా ప్రెసిడెంట్ అయ్యారు. ఆ భీతి ఈనాడు చాలావరకు తొలగి పోయినదంటే ప్రాక్పశ్చిమ రాజ్య కూటాలమధ్య ప్రచ్ఛన్న యుద్ధం నామమాత్రావశిష్టమైన దంటే, దానికి ప్రెసిడెంట్ కెనెడీ కృషి ఒక ముఖ్య కారణం. క్యూబా విషయంలోనే కాదు, అణ్వస్త్ర పరీక్షల పాక్షిక నిషేధం లోనే కాదు. మరెన్నో ప్రపంచ సమస్యల పట్ల ఆయన ప్రదర్శించిన దూరదృష్టి, వివేకంతో కూడిన పట్టుదల సత్ఫలితాల నిచ్చింది.

రాజకీయ నాయకునికి ముఖ్యంగా ఉండవలసిన లక్షణం నైతిక ధైర్యమని కెనెడీ విశ్వాసం. ఆయన సెనేటర్‌గా వుండగా రచించిన "ప్రొఫైల్స్ ఇన్ కరేజ్" అనే గ్రంథంలో ఈ విశ్వాసాన్నే ఆయన శక్తిమంతంగా ప్రతిపాదించారు. అమెరికన్ చరిత్రలో ప్రసిద్ధులైన ఎనిమిదిమంది సెనేటర్ల జీవిత చరిత్రలను తీసుకొని, ఏనాడైన రేయే సందర్భాలలో ఎట్టి నైతిక ధైర్యాన్ని ప్రదర్శించారో ఆయన వివరించారు. ఆ ఎనిమిదిమంది తాము సత్యమని నమ్మినది ఆనాటి ప్రజాభిప్రాయానికి విరుద్ధమైనదైనా దాన్ని విడనాడక, దానికోసం తమ రాజకీయ భవిష్యత్తును త్యాగం చేశారు. వారిని, వారి నైతిక ధైర్యాన్ని ఆదర్శంగా గైకొన్న కెనెడీ తన రాజకీయ భవిష్యత్తునేకాదు-తన ప్రాణాలనే త్యాగం చేశారు.

స్వదేశంలో నీగ్రో సమస్యను ఆయన ఎదుర్కొన్న విధానంలో ఈ నైతిక ధైర్యమే ప్రస్ఫుట మవుతుంది. దక్షిణ రాష్ట్రాలలో తన పలుకుబడి తగ్గిపోగల దని తెలిసికూడా నీగ్రోలకు చట్టరీత్యా సంక్రమించిన హక్కుల రక్షణకు ఆయన పూనుకున్నారు. మిసిసిపీ, అలబామాలలో అవసరమైనప్పుడు ఫెడరల్ సైన్యాలను కూడా పిలిపించి నీగ్రోలకు విద్యాలయాలలో ఆయన ప్రవేశం కల్పించడం బహుశా అమెరికన్ చరిత్రలోనే అపూర్వమైనది. ఈ సంఘటనల తర్వాత నీగ్రోలకు అన్ని జీవిత రంగాలలోను శ్వేతజాతీయులతో సమానమైన హక్కులను కల్పించడానికి గాను, ఆయన పౌరస్వత్వాల బిల్లును కాంగ్రెస్‌లో ప్రవేశపెట్టారు. నూరేళ్ళ క్రిందట లింకన్ వలెనే కెనెడీ కూడా "ఏ జాతి సగం బానిసగా, సగం స్వేచ్ఛగా మనలే" దని విశ్వసించారు. ఈ విశ్వాసంతోనే లింకన్ ప్రారంభించిన నీగ్రో విమోచ నోద్యమ సమరాన్ని శాంతియుతమైన, చట్టబద్ధమైన పద్ధతులలో ముగించడానికి ఆయన యత్నించారు. బహుశా ఆయన హత్యకు ఇదే కారణమై వుండవచ్చునేమో.

ప్రెసిడెంట్ థియొడోర్ రూజ్‌వెల్ట్ కాలంలో "ఫెయిర్ డీల్" వలె, ప్రెసిడెంట్ ఫ్రాంక్లిన్ రూజ్‌వెల్ట్ కాలంలో "న్యూ డీల్" వలె, కెనెడీ ప్రెసిడెన్సీ కాలంలో "న్యూ ఫ్రాంటియర్" (కొత్త సరిహద్దు) అనే పదం కొత్తగా చెలామణీ లోకి వచ్చింది. నైతిక మైన కొత్త సరిహద్దులపై విజయం అనే ఆదర్శాన్ని ఆయన అమెరికన్ ప్రజలముందు వుంచారు. ఈ ఆదర్శాని కనుగుణంగానే ఆయన స్వదేశంలో అనేక సంస్కరణలనే కాక, వెనుక బడిన దేశాలకు ఆర్థిక సహాయం, శాంతి దళం స్థాపన మొదలైన చర్యలెన్నో గైకొన్నారు.

ఆయన మరణం అత్యంత హృదయ విదారకమైన పరిస్థితులలో జరిగింది. వాల్ట్ విట్మన్ వంటి కవి మరొకసారి *"ఓ క్యాప్టెన్ మై క్యాప్టెన్" అని ఆలపించ వలసిన విషాద పరిస్థితులలో జరిగింది. ఆయన మరణంతో యునైటెడ్ స్టేట్స్ తన ప్రియతమ నాయకుడినే కాదు, ప్రపంచం ఒక గొప్ప రాజనీతిజ్ఞుడిని, శాంతి కాముకుడిని కోల్పోయింది.

(నవంబరు 24, 1963)

---

*అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ తుపాకి గుండ్ల కు గురియై మరణించినప్పుడు మహాకవి వాల్ట్ విట్మన్ వ్రాసిన విలాపగీతం—

# మన నెహ్రూ మరి లేడు

కన్నీళ్లు తెరలు తెరలుగా కళ్ళను కమ్మివేస్తున్నది. హృదయం రోదిస్తున్నది. మెదడు స్తంభిస్తున్నది. దుఃఖావేశంలో చేతులాడడంలేదు. నిర్మేఘమైన నీలాకాశం నుంచి అశనిపాతం వలె వచ్చిన ఈ దుర్వార్త నెలా భరించడం?

ఇది నమ్మగలిగిన వార్తేనా! ఒక అర్ధ శతాబ్దం పాటు భారత జాతికి హృదయంగా, భారతీయులంత ప్రాణంలో ప్రాణంగా, సుఖంతో, దుఃఖంలో

అభ్యుదయంలో, పతనంలో, మన నీడగా, మనకు తోడుగా మన మధ్య మసలిన మహావ్యక్తి మన నెహ్రూ మన కిక లేడా?

ఆయన నలభై అయిదు కోట్ల భారతీయులకు మాత్రమేనా నాయకుడు? సమస్త మానవ కోటికే నాయకుడు కాడా? శాంతి, అభ్యుదయం, ఆశావాదం, సామరస్యం, సహనం, ప్రజాస్వామ్యం మొదలయిన ఎన్నో మహోన్నతాదర్శాలకు ప్రతినిధి కాడా?

నేడాయన ఆకస్మిక నిర్యాణానికి పరితపిస్తున్న వారు భారతీయులు మాత్రమే కారు. ప్రపంచ శాంతిని ప్రేమించే వారు, మానవ నాగరికత సుస్థిరత్వానికై పాటు పడేవారు, స్వాతంత్ర్యాన్ని, సౌభ్రాత్రాన్ని ఆరాధించేవారు, మనిషికి మనిషికి, జాతికి జాతికి మధ్య అడ్డు గోడలను పడగొట్టడానికి శ్రమించేవారు- ఆసియా, ఆఫ్రికా, అమెరికా, యూరప్, ఖండ ఖండాంతరాలలో ఎక్కడెక్కడ వున్నా - అందరూ దుఃఖిస్తున్నారు. ఆయన ప్రపంచ పౌరుడు; జగత్కుటుంబి, విశ్వ మానవుడు. ఆయన నిష్క్రమించిన లోటు భారతదేశానిదే కాదు: అన్ని దేశాలది, అన్ని జాతులది.

ఆయన మరణించినాడంటే విశ్వసించడం ఎలా? సాధారణ మానవులకు సామాన్యమైన జరామరణాలకు అతీతమనిపించే వ్యక్తిత్వం ఆయనది. ఆయన వయస్సు 74 సంవత్సరాలంటే నమ్మడం కష్టం. నిత్య దరహాస సుందరమైన వదనం, ఝరీ పరీవాహం వలె తుళ్ళింతలాడే నిత్య నూతనోత్సాహం, క్షణం సేపు, గడియ సేపు కాలు నిలువక ఎప్పుడూ ఏదో పని పెట్టుకుని మొత్తం భారతదేశమే తానుగా, సర్వాంతర్యామిగా సంచరించే కార్యవ్యగ్రత ఆయన వయస్సును మన కెప్పుడూ జ్ఞాపకం చేయలేదు. ఆయన చిరంజీవిగానే మనకు దర్శన మిచ్చేవాడు. మృత్యుంజయుడుగానే, నిత్య త్రిదశుడుగానే మనకు గోచరించేవాడు.

విశ్వకవి రవీంద్రు డొకసారి జవహర్లాల్ నెహ్రూను "ఋతురాజ్ ఆఫ్ ఇండియా" అని అభివర్ణించాడు. ఎంత అర్థవంతమైనదా మాట! ఆయనది అక్షరాలా వసంత శోభను, నిత్య యౌవనాన్ని, అనంతమయిన ఆశావాదాన్ని జ్ఞప్తికి తెచ్చే వ్యక్తిత్వం. దుఃఖంలో, ఓటమిలో ఆయన దృష్టి ఎప్పుడూ సుందర భవిష్యత్తు వైపే ప్రసరించేది. ఆయనకు ఆత్మ విశ్వాసాన్ని, దార్ఢ్యాన్ని ఇచ్చింది వర్తమాన పరిస్థితుల

పరిపూర్ణావగాహనం, దాని నుంచి జనించిన ఆశావాదం; ఆయనది కేవలం పదవితో వచ్చిన ప్రాభవం కాదు; ప్రజా బలమే ఆయన బలం: ప్రజల అనురాగమే ఆయన శక్తి.

ఆయన మనందు దుఃఖసాగరంలో ముంచి వెళ్ళిపోయారు. అనేక సమస్యలు-రాజకీయమైనవి, ఆర్థికమైనవి ఎన్నో మనలను చుట్టుముట్టి చీకాకు పరుస్తున్న విషమ తరుణంలో ఇంటిలో ఎక్కడి వక్కడ వదిలిపెట్టి ఇల్లు ఖాళీ చేసి వెళ్ళిపోయిన ఇంటి పెద్దవలె ఆయన వెళ్ళిపోయారు. మరి కొంతకాలం మనకాయన నాయకత్వం, మార్గదర్శకత్వం అవసరమైన సమయంలో వెళ్ళిపోయారు. ఆయన లేని వెలితి ఎన్నేళ్ళకు తీరును?

నెహ్రూ భారతజాతి ఐకమత్యానికి చిహ్నం. గాంధీజీ నిర్యాణానంతరం కోట్లాది ప్రజలను — ఏ మతానికి, భాషకు, రాష్ట్రానికి, పార్టీకి చెందినవారైనా-ఒక్క త్రాటిపై నడిపించిన ఘనత ఆయనదే: ఇరుగు పొరుగున అనేక దేశాలు రకరకాల నియంతృత్వాలకు లోబడిపోతుండగా, భారతదేశంలో మాత్రం ప్రజాస్వామ్య జ్యోతిని ఆరకుండా రక్షించిన ఘనత ఆయనదే. ఆర్థికాభివృద్ధిలేని స్వాతంత్ర్యం ఎంతోకాలం మనజాలదని, దాని రక్షణకై ఎంతటి మూల్యమైనా చెల్లించవలసిందేనని, నిత్య జాగరూకతే దానికి మార్గమని చాటి చెప్పిన ఘనత ఆయనదే. ఆయన లేని లోటు ఎంతకాలానికి మనకు తీరును?

మొన్న మొన్నటి పత్రికా గోష్ఠిలోనే ఆయన తన జీవితం ఇప్పుడప్పుడే ముగియబోవడం లేదని పేర్కొన్నారు. ఆయన ఆశావాదానికింతకంటె నిదర్శన మేమి కావాలి? ఆయన చెప్పింది నిజమే కావాలని యావద్భారతం మనసారా కోరుకుంటున్న సమయంలో ఆయన మాట ఈ విధంగా వక్రించడం విధి వక్రత కాక మరేమిటి?

అయినా ఆయన తన జీవిత కాలంలో వలెనే తన మృత్యువులో సయితం అజేయుడే: అమరుడే: ఆయన ఆదర్శాలు మానవాళికి ఆశాజ్యోతులవలె నిలిచి వున్నంత కాలం, ఆయన వాక్కులు భారతీయుల హృదయాలలో మారు మ్రోగుతూ కార్యోన్ముఖులను చేస్తున్నంత కాలం ఆయనకు చావు లేదు. ఆయన మృత్యుంజయుడు.

(మే 28, 1964)

# నెహ్రూ సోషలిజం

నెహ్రూ జీవిత వేదాంతానికి పునాది మానవ వాదం. అది ఆయన దృష్టిని యౌవన దశలోనే సోషలిజం వైపు మళ్ళించింది.

ఇంగ్లండులో పెక్కేళ్ళు విద్యాభ్యాసం చేసిన కారణంగా ఆయన తొలిరోజులలో సహజంగానే షా, వెల్స్, వెబ్స్, రూపొందించిన ఫేబియన్ భావాల ప్రభావానికి లోనయ్యారు. కాని, ఆయనకు సోషలిజం గురించి స్పష్టమైన, శాస్త్రీయమైన దృక్పథాన్ని కలిగించింది మార్క్స్ సిద్ధాంతాలే.

క్యాపిటలిజం తరువాత మానవ సమాజం ఎదగవలసింది సోషలిజం లోనికే నని ఆయన విశ్వసించినప్పటికి, మార్క్స్, ఎంగెల్స్‌ల చారిత్రక వాదాన్ని ఆయన అభిమానించినప్పటికి, వారి ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలను ఆయన పూర్తిగా ఎప్పుడూ ఆమోదించలేదు. తన సందేహాలు పెక్కింటిని అవి తీర్చలేక పోయినవని ఆయనే చెప్పుకున్నారు. ముఖ్యంగా గాంధీజీ ప్రభావంలోనికి వచ్చిన తరువాత "లక్ష్యాలు, సాధనాల" ఏకత్వంపై ఆయనకు ప్రబల విశ్వాసం కుదిరి మార్క్సిస్ట్ సిద్ధాంతాలలో చాలా వాటిని ఆయన నిరాకరించారు.

అయినప్పటికీ, కాంగ్రెస్ రాజకీయాలలో ప్రవేశించిన తరువాత నెహ్రూ "లెఫ్టిస్ట్" గానే ప్రసిద్ధి కెక్కారు. మితవాదుల నాయకత్వాన వున్న కాంగ్రెస్‌ను సోషలిస్టు భావాలవైపు మొగ్గేట్టు చేయడానికి ఆయన తీవ్రంగా యత్నించారు. ఈ విషయంలో ఆయనకు ఇతర నాయకులతో గాఢమయిన అభిప్రాయ భేదాలు కూడా ఏర్పడ్డాయి. కాంగ్రెస్‌లో ఐకమత్యానికి, స్వాతంత్ర్య సముపార్జనకు ఆయన ప్రథమ ప్రాధాన్యమివ్వడం మూలంగా ఆయన అభిప్రాయాలకు పెద్దగా విజయం లభించ లేదు. కాని, కాంగ్రెస్‌లోనే సోషలిస్ట్ భావాలు గల ఒక ప్రబలమైన యువకవర్గం ఏర్పడడానికి ఆయన కారకులయ్యారు.

స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత, నెహ్రూ ప్రధాన మంత్రిత్వం వహించిన తరువాత తన సోషలిస్టు భావాలను ఆచరణలోకి తీసుకు రావడానికి ఆయనకు చక్కని అవకాశం కలిగింది. 1919 వ సంవత్సరానికి ముందు కొన్ని విద్యాధిక వర్గాలకు మాత్రమే పరిమితమై వున్న కాంగ్రెసును విశాల ప్రజోద్యమంగా గ్రామ గ్రామానికి వ్యాప్తం చేసిన ఘనత గాంధీజీది కాగా, 1947 తరవాత కాంగ్రెసును ఒక సోషలిస్టు ఉద్యమంగా మార్చివేసిన ఘనత పూర్తిగా నెహ్రూదే.

నెహ్రూకు సోషలిజం మార్పులేని, ఎదుగు, బొదుగులేని నిర్జీవ మూఢ సిద్ధాంతం కాదు. అది ప్రగతిశీలమైనది. దానిలో మార్క్సిజం, బోల్షివిజం, ఫేబియనిజం, లాస్కీయిజం వంటి ఎన్నిటి ప్రభావమో వున్నమాట నిజమే. కాని వీటన్నిటిలోని మంచిని మాత్రమే స్వీకరించి, మన దేశానికి, మన కాలానికి, పరిస్థితులకు అనుగుణమైన విధంగా వాటిని మలచి సోషలిజానికి ఆయన ఒక క్రొత్త రూపం యిచ్చారు.

సంపదను ఉత్పత్తి చేసే సాధనాలన్నిటిని జాతీయం చేయడం సోషలిజంలోని మౌలిక సూత్రం కాగా, ఈ సూత్రాన్ని నెహ్రూ గుడ్డిగా అనుసరించలేదు. ఉత్పత్తి సాధనాలే అరుదైన దేశంలో వాటిని జాతీయం చేసే ప్రసక్తి ఎక్కడ? ముందు దృఢమయిన పునాది ఏర్పరచాలి, ఆ తరువాతనే దానిపై సోషలిస్టు సౌధ నిర్మాణం. ఈ దృష్టితోనే ఆయన ప్రభుత్వ రంగంతో పాటు ప్రయివేటు రంగం కూడా చాలా వరకు కొనసాగాలని ప్రతిపాదించారు. మిశ్రమ ఆర్థిక వ్యవస్థను రూపొందించారు. అయితే క్యాపిటలిస్టు వ్యవస్థలోని లోపాలను సరిదిద్దడానికి సహకార రంగాన్ని కూడా ఆయన నిర్మించారు.

నెహ్రూ నాయకత్వాన భారతదేశంలో ఎన్నెన్ని మహత్తర పరిణామాలు జరిగాయో, వాటి ఫలితా లెట్టివో, చరిత్రపై వాటి ప్రభావం ఎంత గాఢమైనదో, ఆయన కింతగా సమకాలికులమైన మనం నిర్వచించడం కష్టమే. అది భావి చరిత్ర కారులకే వదలివేయవలసిన పని. కాని, ఆయన ఆధ్వర్యంలో రూపొందిన పంచ వర్ష ప్రణాళికలు, సమాజాభివృద్ధి పథకాలు, పంచాయతీ రాజ్య విధానం, నిర్మించ బడిన ప్రాజెక్టులు, భారీ పరిశ్రమలు-ఇంకా ఎన్నో-మన చరిత్ర గతినే మార్చివేయ గలవనడంలో సందేహం లేదు.

ఈ మార్పులను ప్రజల సహకారంతో, విశ్వాసంతో, ప్రజాస్వామిక మార్గంలో తీసుకు రావడమే ఆయన సోషలిజం లోని విశిష్టత. ఇండియా వంటి వెనుక బడిన దేశాలు సత్వరంగా ఆర్థికాభివృద్ధిని సాధించడానికి సోషలిజం వినా మరొక మార్గం లేదని, అయితే అది హింసాత్మకంగా కాక, ప్రజాస్వామికంగా జరగాలని ప్రబోధించడమే ఆయన ఘనత. ఈ విషయంలో ఆయన పెక్కు ఆఫ్రో - ఆసి యన్ దేశాలకు నయితం మార్గదర్శకు లయ్యారు.

నెహ్రూ మన ఆర్థిక వ్యవస్థలో, జీవిత విధానంలో ఒకానొక శాంతి యుత విప్లవాన్ని ప్రారంభించారు. దాన్ని విజయవంతంగా, ఆయన బంగరు కలలు సఫలమయ్యే వరకు కొనసాగించడమే మన విధి. దేశ నాయకత్వ భారాన్ని ఎవరు వహించినా, ఈ పవిత్ర విధి నిర్వహణ భారాన్ని సయితం వహిం చక తప్పదు.

(మే 30, 1964)

# నెహ్రూ వీలునామా

పదేళ్ళక్రిందట నెహ్రూ వ్రాసిన వీలునామాలోని కొన్ని భాగాలను శ్రీమతి విజయలక్ష్మి పండిట్ నిన్నరాత్రి వెల్లడించారు. అది ఆయన తనకు తాను తైలవర్ణాలతో చిత్రించుకున్న రూపచిత్రం వంటిది; తన జీవిత దృక్పథాన్ని తానే వర్ణించుకున్న మనోజ్ఞ కావ్యం వంటిది. అది భారతీయులు కలకాలం భద్రపరచుకొనవలసిన జాతీయపత్రం.

వ్యక్తిగా నెహ్రూపై వ్యాఖ్యానించిన పెక్కుమంది అభిప్రాయంలో ఆయన రాజకీయాలలో ప్రవేశించి వుండకపోతే, గొప్ప కవిగా ప్రశస్తి పొంది వుండేవారు. ఆయన "ఆత్మకథ", "డిస్కవరీ ఆఫ్ ఇండియా" మొదలైన గ్రంథాలలో కొన్ని కొన్ని భాగాలు వచనంలో వ్రాసినవైనా సుకుమార కావ్యసౌందర్యంతో తొణికిసలాడతాయి. గోరఖ్‌పూర్ విచారణ సందర్భంలో ఒకసారి ఆయనే స్వయంగా చెప్పుకున్నట్లు, మాటలకు ఆయన ఎంతో విలువనిస్తారు. శుష్క శబ్దాడంబరం కోసం కాక తన భావాలకు, తన ఆవేశానికి సరియైన వాహికలుగానే పదాలపై ఆయనకు అభిమానం.

నిన్న ప్రకటించిన వీలునామాలో సయితం వ్యక్తికి, శైలికి ఇదే అవినాభావం ప్రస్ఫుటమవుతుంది. ఆయన విశ్వాసాలలోని సౌందర్యమే ఆయన భాషలో వ్యక్తమవుతుంది.

నెహ్రూకు మతాలపై నమ్మకంలేదు. సగుణోపాసన, దానికి సంబంధించిన పూజాపురస్కారాలు, మూఢ విశ్వాసాలు, దేవాలయాలు, కర్మకాండ ఆయన నెప్పుడూ ఆకర్షించలేదు. మంత్రతంత్రాలు, జ్యోతిషం-మొత్తంపై హేతువిరుద్ధమైన వాటి నన్నిటిని ఆయన త్రోసిపుచ్చారు. అవి మానవుడిని అకర్మణ్యుడుగా చేస్తాయని, మానవుల

అలౌకిక శక్తులపై కాక స్వయం కృషిపైనే ఆధారపడాలని ఆయన విశ్వసించారు. అంతమాత్రాన ఆయన నాస్తికుడు నయితంకాదు. తాను అజ్ఞేయవాది ("అగ్నాస్టిక్") నని, దైవ ప్రసక్తితో తనకు ప్రమేయంలేదని ఆయన చెప్పుకున్నారు.

ఈ విషయంలో గాంధీజీకి నెహ్రూ పూర్తిగా విరుద్ధం. అయినా, వారిరువురి గాఢానుబంధానికి ఈ మతభేదం అడ్డురాలేదు. అత్యధిక సంఖ్యాకులు మతానికి ప్రథమ ప్రాధాన్యమిచ్చే ఈ దేశంలో నెహ్రూ వంటి మత ప్రమేయ రహితుడి పట్ల ఇంత గాఢానురాగం ఏర్పడడం కూడా ఒక విధంగా విచిత్రమే. అయితే, అన్ని మతాలకు మూలమైన మానవవాదాన్నే తన మతంగా, అహరహ ప్రజాసేవనే తన పూజా పురస్కారాలుగా, ప్రాజెక్టులు, కర్మాగారాలనే తన దేవాలయాలుగా భావించి తాను భారతీయుడైనందుకు, భారత ప్రాచీన సంస్కృతికి వారసుడైనందుకు గర్వించిన నెహ్రూపట్ల ఈ అనురాగంలో ఆశ్చర్యమేముంది?

భారత భూమిపట్ల ఆయన అనురాగం సర్వతోముఖమైనది. ఆ ప్రేమను ఆయన తన రచనలలో, ఉపన్యాసాలలో, చేతలలో పెక్కుసార్లు పెక్కు విధాలుగా వ్యక్తం చేశారు. ఈ విశాల దేశంలోని కోటానుకోట్ల మానవులను, వారి విభిన్న భాషలను, సంస్కృతులను, వారి భూత భవిష్యద్వర్తమానాలను ఆయన ప్రేమించారు. ఆఖరికి ఈ దేశపు నదీనదాలను, అరణ్యాలను, పర్వత శిఖరాలను, మైదానాలను అన్నిటిని ఆయన ప్రేమించారు.

తాను జీవించి వున్నప్పటి వలెనే మరణానంతరం కూడా ఈ దేశంలో తాదాత్మ్యం పొందాలనే వాంఛను ఆయన తమ వీలునామాలో వెల్లడించారు. తన భౌతికావశేషాలను గంగానదిలోనేగాక, వివిధ ప్రాంతాలలోని సస్యక్షేత్రాలలో కూడా వెదజల్లాలని ఆయన కోరారు.

గంగను మనం నీటికి పర్యాయపదంగా వ్యవహరిస్తాము. కనుక నెహ్రూ కోరికకు అనుగుణంగానే ఆయన చితాభస్మం దేశంలోని నదులన్నిటిలో నిమజ్జనం చేయబడుతున్నది. ఆంధ్రప్రదేశ్‌లో కూడా మూసి, కృష్ణా, గోదావరి, తుంగభద్రలలో వచ్చే సోమవారం అస్థి నిమజ్జనం జరుగనున్నది. అనాదిగా మన చరిత్రకు సాక్షిభూతాలుగా ప్రవహిస్తున్న ఈ నదులవలెనే, జవహర్‌లాల్ స్మృతి నయితం మన జాతిలో నిరంతరం ప్రవహిస్తూనే వుంటుంది.

(5 జూన్, 1964)

# ఫిడేలు నాయుడుగారు

ఆయనది రాళ్ళను కరిగించే విమల గాంధర్వం. మన కది ఇక మీద విన బడదు.

ఆయన చేతిలో కమాను ఫిడేలు తీగలపై నాట్యం చేసేది. ఒకసారి కోకిలల కాకలీ స్వనాన్ని, మరొకసారి సముద్రాల విన్నిద్ర ఘోషను ఆ తీగలు పలికించేవి. అవి ఇక శాశ్వతంగా మూగవోతాయి.

ఆయన అంధ గాయకుడు. ఆయన కళ్ళకు బాహ్య ప్రపంచం లేదు. అవి తమలోకి తాము చూచుకొనేవి. వాటికి ఏవేవో ధ్వని ప్రపంచాలు, స్వర సముద్రాలు కనబడేవి. వాటి నుంచి ఆయన మనోహర శబ్దాలను ఏరి తెచ్చేవారు. ఆ గాన మాధుర్యాన్ని ఆస్వాదించే భాగ్యం ఇకపై రసజ్ఞ లోకానికి లేదు.

ఇరవై యేళ్ళ క్రిందటి మాట. రాజమండ్రిలో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి జరిగిన సన్మాన సభలో ద్వారం వెంకటస్వామి నాయుడుగారు ఫిడేలు వాయించారు. తమ వాయిద్యంలో లీనమైన శ్రోతల నుద్దేశించి "నేను విద్యాధికుడిని

కాను; ధనాధికుడిని కాను; నాకేమీ లేదు; ఉన్నదల్లా ఈ కర్ర ముక్క ఒక్కటే. దీని ఆధారంతోనే ఈ భవజలధిని ఈదడానికి ప్రయత్నిస్తున్నాను," అని నాయుడు గారన్నారు. అంతటి ప్రతిభాశాలిలోని ఈ సహజ వినమ్రత శ్రోతలను నిజంగానే కంట తడి పెట్టించింది.

ఆయనకు సంగీతమే విద్య, సంగీతమే ధనం. ఆ విద్యాధనాన్ని ఆయన దాచు కోలేదు. ఎందరో శిష్య ప్రశిష్యులకు దాన్ని దానం చేశారు. అలనాటి మోహినివలె తమ సంగీతామృతాన్ని పంచిపెట్టి లక్షలాది శ్రోతల రసపిపాసను తీర్చారు.

ఒక అర్ధ శతాబ్దిగా నాయుడిగారి పేరు దక్షిణ భారతమంతటా సుపరిచిత మైంది. తెలుగువారికి త్యాగరాజు తరవాత మరొక సంగీతకారుడు లేడన్న కొరతను ఆయన కనబడ నివ్వలేదు. ఎన్ని వందల గాన సభలకోనో, ఎందరు దిగ్దంతులవంటి పండితుల చేతనో ప్రశంసలు పొందారు; ఎన్నో బిరుదులు, సత్కారాలు పొందారు. భారత ప్రభుత్వం ఆయనను "పద్మశ్రీ" బిరుదుతో గౌరవించింది. ఇటీవలనే ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఆయనను ఆస్థానగాయకుడుగా మన్నించింది. ఆ విధంగా, ఆంధ్ర, కేంద్ర ప్రభుత్వాలు తమ్ము తామే గౌరవించుకున్నాయి.

పూర్వం పిల్లలమర్రి పిన వీరభద్రకవి "వాణి నారాణి" అని చెప్పుకున్నాడట. ఆ తరువాత "నాదాన్ని నా దాన్ని చేసుకున్నా"నని చెప్పుకోగలిగిన ఘనత నాయుడుగారిదే. ఆయన సాధనమైన వాయులీనం భారతీయ వాద్యం కాదు. అయినా, ఆయన దానిపై అపూర్వ ప్రావీణ్యాన్ని ప్రదర్శించడం చూచి యెహూదీ మెనూహిన్ వంటి పాశ్చాత్య విద్వాంసులే ముగ్ధులైపోయేవారు. ఆయన ప్రతిభను పదే పదే కీర్తించేవారు.

డబ్బైయేళ్ళ పరిపక్వ వయస్సులో ఆయన రాలిపోయారు. ఆయన ధన్యజీవి. సముఖంలో కూర్చుని వారి గానం వినడానికి మనమికనోచుకోలేకపోయినా, టేపులలో, గ్రామొఫోను రికార్డులలో ఆయన మిగిల్చి వెళ్ళిన సంగీత సంపద ఎంతో దేశంలో వుంది. దాన్ని పదిలంగా, పదికాలాలపాటు పరిరక్షించుకొనడం మన పవిత్ర విధి. ఎందరెందరో వ్యక్తులవద్ద చెల్లా చెదురుగా వున్న నాయుడుగారి కృతులను సేకరించి వాటిని జాతీయ నిక్షేపంగా భద్రపరచడం మన ప్రభుత్వం చేయవలసిన పని. ఆ విధంగా చేయడమే నాయుడుగారి స్మృతికి మన మర్పించదగిన జోహారు.

(నవంబరు 26, 1964)

# చరిత్రలో చర్చిల్

చర్చిల్‌ది పరిపూర్ణ జీవితం. ఫలవంతమైన జీవితం కూడా !

ఆయన చూచినంత చరిత్రను చూచినవారు ఎక్కువమంది వుండవచ్చు. కాని, అంత సుదీర్ఘకాలం - దాదాపు 70 సంవత్సరాలపాటు — చరిత్రలో పాల్గొన్నవారు, ఆయనవలె చరిత్రను సృష్టించినవారు అరుదుగా వుంటారు.

బాల్యంలో ఆయన సైనికుల బొమ్మలతో ఆడుకునేవాడట. ఆయన సైనిక మన స్తత్వానికి అదే కారణమేమో. హారో పబ్లిక్ స్కూల్‌లో ఆయనకు చదువు అంతగా అంటలేదు. సైన్యంలో చేరదలచినట్టు చిన్నతనంలోనే ఆయన తండ్రికి తెలియ పరి చాడు. సాహసప్రియుడు కనుక, సాహస ప్రదర్శనకు యుద్ధరంగంకంటె అనువైనది మరొకటి లేదు కనుక, ఆయన దృష్టి ఎప్పుడూ యుద్ధాలపైనే వుండేది. ఇండియా, క్యూబా, మధ్య ప్రాచ్యం, దక్షిణాఫ్రికా మొదలైనచోట్ల యుద్ధాలలో పాల్గొని, ధైర్య సాహసాలకు పేరెక్కడమే కాదు, యుద్ధతంత్రాన్ని కూడా క్షుణ్ణంగా అభ్యసించాడు.

ఆయనకు యుద్ధనీతి, రాజనీతి రెండూ కరతలామలకాలైనా, ఆయన రాజనీతి జ్ఞతను బ్రిటిష్ జాతి మొదటినుంచి కొంత అనుమానంతోనే పరిగణించింది. చివరికి ఆయనను ప్రధానమంత్రిగా స్వీకరించడానికి బ్రిటిష్ ప్రజలు సిద్ధపడింది మరి గత్యం తరంలేని రెండవ ప్రపంచయుద్ధ కాలంలోనే. అది 1940 వ సంవత్సరం. బ్రిటన్‌కు

దాని విశాల సామ్రాజ్యాన్నే కాక, మొత్తం మానవాళినే ఒక మహోపద్రవం కబళించ నున్న విషమ ఘట్టం. ఆ సమయంలో చర్చిల్ యుద్ధానికి నాయకత్వం వహించాడు. ఓటమిపై ఓటమి ఎదురవుతున్నా చలించక "అంతిమ విజయం మనదే" అన్న వినాదంతో సవాలును ఎదుర్కొన్నాడు. యుద్ధతంత్రాన్ని స్వయంగా నడిపించాడు. ఆనాడు తన ప్రజలను ఉత్తేజపరచడానికి ఆయన చేసిన మహోపన్యాసాలు వాటి ప్రయోజనం తీరిపోయినా, శతాబ్దాలవరకు ఆంగ్ల సాహిత్యంలో నిలిచిపోతాయి. చివరికాయన హిట్లర్ పతనానికి ప్రధానకారకులలో ఒకడైన కారణానికి ప్రపంచం కలకాలం కృతజ్ఞతతో వుండక తప్పదు.

రవి అస్తమించని తమ సామ్రాజ్యం రవిచంద్రు యున్నంతవరకు వుంటుందని బ్రిటిష్ జాతి నమ్మిన రోజులలో చర్చిల్ జన్మించి, పెరిగాడు. ఆయనలో కరడు కట్టిన సామ్రాజ్యవాదానికి అదే కారణం కావచ్చు. అది భారత సామ్రాజ్య విషయంలో మరీ ప్రస్ఫుటమైంది. చారిత్రక దృక్పథం పుష్కలంగా వున్న వాడైనా, దానికి సామ్రాజ్య భక్తి అడ్డు వచ్చింది. తన టోరీ సహచరులతో కూడా ఈ విషయంలో విభేదించాడు. "గాంధీకి లొంగిపోవడం సహించలే"నని ప్రకటించాడు. చివరకు బ్రిటిష్ సామ్రాజ్యం విచ్ఛిన్నమై, వలసలు విముక్తి పొందడం ఆయన కళ్ళారా చూశాడు. అనివార్యమైన ఈ చారిత్రక సత్యంతో తన తుది సంవత్సరాలలో ఆయన రాజీపడక తప్పలేదు.

చర్చిల్ ఎంత రాజనీతి విశారదుడో, ఎంత యుద్ధతంత్రజ్ఞుడో అంత మహా రచయిత. ఆయన ఒకవేళ రాజకీయ రంగానికి దూరంగా వుండిపోయినా, రచయితగానైనా ఆయన పేరు చిరస్థాయి కాగలిగినదే. భాషపై, పదునైన మాటలపై ఆయన పలుకుబడి అపారం. రెండు ప్రపంచ యుద్ధాలపై, ఇంగ్లీషు జాతిపై ఆయన వ్రాసిన చారిత్రక గ్రంథాలు, మరెన్నో జీవిత చరిత్రలు, వ్యాసాలు, ఒక నవల — ఇవన్నీ ఆయనకు నోబెల్ బహుమతిని సంపాదించి పెట్టాయి. ఇదికాక చిత్రలేఖనంలో కూడా ఆయన ప్రతిభ ఎన్నదగినది.

తన తొంభై సంవత్సరాల దీర్ఘ జీవితంలో ఆయన ఎన్నో జయాలు పొందాడు; అపజయాలు కూడా చవి చూశాడు; చరిత్రను సృష్టించాడు; చరిత్రగతిని వెనుకకు మళ్ళించడానికి కూడా ప్రయత్నించాడు. ఏమైనా, ఈ శతాబ్దిపు మహావ్యక్తులలో ఒకడుగా చరిత్రలో ఆయన స్థానం సుస్థిరమైనది.

(జనవరి 26, 1965)

# సంస్మరణ

స్వాతంత్ర్య సిద్ధికి ముందు ఒక వంద సంవత్సరాలు ఒక విధంగా చూస్తే భారతీయులకు దుష్కాలం; దాస్యయుగం; పర పరిపాలనలో దేశం ఆర్థికంగా, సాంఘికంగా, అన్ని విధాలుగా నిరాశా నిస్పృహలలో క్రుంగిపోయిన రోజులవి; ఎన్నటికైనా స్వాతంత్ర్య భానూదయం కాగలదా అని ప్రజలు సంశయాకులితులైన దినాలవి.

అయినా మలిన పంకంనుంచే మనోహర పద్మా లుద్భవిస్తాయి. ఆనాటి నిరాశా నిస్పృహల నుంచే- అంతేకాదు, బహుశా వాటి కారణంగానే - ఎందరో దేశభక్తులు, ప్రజానాయకులు, మత - సాంఘిక సంస్కర్తలు, మహాకవులు, విద్యావేత్తలు ప్రాదుర్భవించి భరతభూమిని పునీతం చేశారు. తమ చుట్టూ మూగిన తమోజీమూతా లను ఛేదించాలనే కోరికతో తాము ఆవిష్టులు కావడమే కాదు, తమ జాతిలో అట్టి

ఆవేశాన్ని జాగృతం చేశారు; ప్రజలను ఉత్తేజితులుగా చేశారు. ఒక మహా ప్రభంజనం వంటి చైతన్యంతో జనసముద్రాన్ని తరంగితం చేశారు. తమ సర్వస్వాన్ని ప్రాణ, ధన, మానాలతో సహా దేశమాత పాదాల క్రింద అర్పణం చేశారు. తమ జీవితాలనే ఆదర్శాలుగా, జాతికి ధ్రువతారలుగా ప్రకాశింపజేశారు. వారు ధన్యజీవులు. అందుకే ఆ కాలం మన చరిత్రలో స్వర్ణయుగం కూడా.

ఆ ధన్యజీవుల కోవకు చెందిన మహాపురుషుడు లాలాలజపతిరాయ్. ఆయన స్థానం తిలక్, గాంధి, మాలవ్యా, నెహ్రూ, బోస్ వంటి దేశభక్తుల సరసన మన స్వాతంత్ర్యోదమ చరిత్రలో శాశ్వతంగా వుండిపోతుంది.

ఆనాటి నాయకులలో పెక్కుమంది వలెనే లజపతిరాయ్ కూడా న్యాయవాద వృత్తినుంచే రాజకీయాలలో ప్రవేశించాడు. అయినా, ఆయన ప్రజ్ఞా ప్రాభవాలు బహుముఖాలుగా విస్తరించాయి. పంజాబులో విద్యాభివృద్ధికి, పారిశ్రామిక ప్రగతికి ఆయన చేసిన కృషి ఎనలేనిది. మత- సంఘ సంస్కరణలలో, దీనజన సముద్ధరణలో ఆయన ఆసక్తి సాటిలేనిది. గ్రంథ, పత్రికా ప్రచురణల రంగంలో కూడా ఆయన అగ్రగణ్యుడుగా భాసించాడు.

అయితే దేశభక్తుడుగా, స్వాతంత్ర్య సమరయోధుడుగానే ఆయన భారతీయులకు చిరస్మరణీయుడు. పోను పోను ఆయన తీవ్రవాదిగా మారి, ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వాగ్రహానికి గురి అయి పెక్కుసార్లు కారాగారవాసం, దేశాంతర ప్రవాసం కూడా అనుభవించాడు. ఏ ప్రజోద్యమంలోనైనా ఆయన అగ్రశ్రేణిలో నిలబడి నడిపించి "పంజాబ్ కేసరి" అనే సార్థక నామాన్ని సముపార్జించుకొన్నాడు. 1928 లో సైమన్ కమిషన్ భారత పర్యటన సందర్భంలో ఆయన దానికి వ్యతిరేకోద్యమం నడిపించి లాఠీ దెబ్బలకు తీవ్రంగా గాయపడ్డాడు. చివరికాయన అకాలమరణానికి అదే కారణమైంది.

కాని, ఆనాడు గాంధీజీ పేర్కొన్నట్టు లజపతిరాయ్ వంటి మహావీరులకు మరణంలేదు. యశశ్శరీరంతో ఆయన ఏనాటికి తన జాతి స్మృతిపథంలో చిరంజీవిగా వుంటాడు. ఈనాటి శతజయంత్యుత్సవాలు ఆయన ఆదర్శవాదాన్ని, దేశభక్తిని, ధైర్యసాహసాలను మరొకసారి సంస్మరించడానికే కాదు, వాటిని మనలో పునర్జ్వలింప జేసుకొనడానికి కూడా ఉపకరిస్తాయి. అది జరిగినప్పుడే వాటికి సార్థక్యం.

(జనవరి 28, 1965)

"ఆంధ్ర మేధావులలో ఆయన అగ్రగణ్యుడు. అయితే, ఆయన అదృష్ట వంతుడుకాదు. అది ఆంధ్రుల దురదృష్టం."

ఇవి దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారిని గురించి ఒకసారి డాక్టర్ సి. ఆర్. రెడ్డి గారన్న పలుకులు. గోపాలకృష్ణయ్యగారి జీవితచరిత్రను చూచినా, ఆయన మరణానం తర చరిత్రను చూచినా ఈ పలుకులు యథార్థమే ననిపిస్తుంది.

ఆయన మహామేధావి మాత్రమే కాదు; వేలాది ప్రజలు తన మాటను రాజ శాసనంగా పాలించేటట్లు చేయగలిగిన మహానాయకుడు కూడా. సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో మహాపండితుడు మాత్రమే కాదు; తన అనర్గళ వాగ్ధాటితో అశేష ప్రజా నీకాన్ని ఉత్తేజితులను చేసిన మహావక్త; మహావ్యక్తి; దేశ స్వాతంత్ర్యం కోసం తన సర్వస్వాన్ని తృణప్రాయంగా త్యజించిన మహాత్యాగి; ఎంత నిరాడంబరుడో అంత నిర్భీకుడు. ఇన్ని గొప్ప గుణగణాలు ఒక వ్యక్తిలో రాశీభూతం కావడం లోకంలో చాలా అరుదు. దేవతల ప్రేమను అధికంగా చూరగొన్నవారు చిన్న వయస్సులోనే మరణిస్తారని గ్రీకుల నమ్మకం. ఈ నమ్మకం సంగతి ఎలా వున్నా, గోపాలకృష్ణయ్యగారు నలభై ఏండ్లయినా నిండకుండానే మరణించడం ఆంధ్రదేశపు దురదృష్టమే. ఆయన తన సమకాలికులైన ఇతర నాయకుల వలెనే పరిపూర్ణాయుర్దా యంతో జీవించి వుంటే, ఆయనలోని శక్తులు మరింత ప్రస్ఫుటంగా, సమగ్ర సుంద రంగా వికాసం పొంది ప్రకాశించి వుండేవనడం అతిశయోక్తి కాదు.

అయినా ఆ స్వల్పకాలంలోనే ఆయన సాధించిన విజయాలు అద్భుతావహ మైనవి; అవి యావద్భారత దృష్టిని ఆకర్షించి సమ్మోహితం చేశాయి. ఆయన స్థాపిం

చిన రామదండు, సాగించిన స్వరాష్ట్రోద్యమం, గ్రంథాలయోద్యమం, విద్యాపీఠగోష్ఠి, అన్నిటిని మించి చీరాల-పేరాల సత్యాగ్రహం, ఇవన్నీ ఆంధ్రదేశానికి ఆయన చేసిన మహత్తర సేవకు మరపురాని నిదర్శనాలు. అవి మన స్వాతంత్ర్య సమర చరిత్రలో ఒక సువర్ణ ఘట్టంలో భాగాలుగా భాసిస్తున్నాయి. ఈ ఉద్యమాలన్నిటిని ఆయన నిర్వహించిన విధానం సయితం ఆయన మౌలిక ప్రతిభకు, ప్రత్యేకతకు తార్కాణాలుగా వెలుగొందుతున్నాయి.

గోపాలకృష్ణయ్యగారు మరణించి 37 సంవత్సరాలైంది. ఆయన కన్న ఒక కల-స్వరాజ్యం - ఫలించి 18 సంవత్సరాలైంది. మరొక కల- స్వరాష్ట్రం - సిద్ధించి 12 సంవత్సరాలైంది. బహుశా ఈ కారణం చేతనేమో, ఆయన స్మృతి క్రమంగా విస్మృత మవుతున్నట్టు అనుమానం కలుగుతున్నది. మహాపురుషుల స్మృతిని శాశ్వతం చేయడానికి వారి విగ్రహాలను ప్రతిష్ఠాపించుకొనడం మన సంప్రదాయం. ఆయన కీర్తి శేషులైన తరువాత ఇన్ని సంవత్సరాలలో కనీసం ఆయన విగ్రహాన్ని, కనీసం ఆయన ముఖ్య కార్యరంగమైన చీరాలలోనైనా మనం ప్రతిష్ఠించుకోలేక పోవడం శోచనీయం. ఎన్నో ఆలోచనలు జరిగి, ఎన్నో విఘ్నాలు జరిగిన తరువాత ఇప్పటికైనా చీరాల పౌరులు ఆయన కాంస్య విగ్రహాన్ని నెలకొల్పగలగడం, దాన్ని ఉత్సవ పురస్సరంగా ఆవిష్కరించుకోవడం ఎంతైనా అభినందించదగింది.

గోపాలకృష్ణయ్యగారు కన్న ఇంకొక కల సురాజ్యం. దాని కోసం ఇప్పుడు అవిరళమైన మహా కృషి జరుగుతున్నది. అయితే, దానికి ఎన్నో అవాంతరాలు ఎదురవుతున్నాయి. సురాజ్యాన్నే కాదు, మన స్వరాజ్యాన్ని సయితం గ్రహించడానికి ఎన్నో దుష్టశక్తులు యత్నిస్తున్నాయి. ఒక వంక విశాలమైన మన భూభాగాలను కబళించడానికి పాకిస్తాన్ మనతో యుద్ధానికి దిగింది. మరొక వంక చైనా అదే దురాశయంతో అదనుకోసం వేచి వుంది. ఒక స్వతంత్ర జాతిగా ఇదివరకెన్నడూ ఎరుగని మహావిపత్తును ఈనాడు మన మెదుర్కొంటున్నాము. ఈ పరిస్థితిలో మనకు కర్తవ్య బోధను చేయగలిగింది, మనలో దేశభక్తిని, ధర్మావేశాన్ని పురికొల్పగలిగింది "ఆంధ్రరత్న" గోపాలకృష్ణయ్యవంటివారి ధీరోదాత్తుల పవిత్రసంస్మరణమే,వారి విగ్రహాలను ప్రతిష్ఠించు కొనడంతోపాటు వారి ఆశయాలను మన హృదయాశయాలలో సుప్రతిష్ఠితం చేసుకొనడమే నేటి మన కర్తవ్యం.

(సెప్టెంబర్ 10, 1965)

# నోబెల్ సాహిత్య బహుమతి

సాహిత్యానికి దేశం మధ్య హద్దులతో సంబంధం లేదు. రాజకీయ విభేదాలతో దానికి పనిలేదు. దాని ప్రమేయం మానవతతోనే. మానవుల కష్ట సుఖాలతోనే. వాటిని హృదయంగమంగా, సార్వజనీనంగా చిత్రించడంతోనే. అందుచేతనే ఈసారి నోబెల్ సాహిత్య బహుమతి రష్యన్ రచయిత మిఖైల్ షోలొకోవ్‌కు లభించడం సాహిత్యాభిమానులందరికీ సంతోషకరమైన వార్త.

ఏడేళ్ళ క్రిందట రష్యన్ కవి పాస్టర్నాక్‌కు స్వీడిష్ అకాడమీ సాహిత్య

చిరంజీవులు

బహుమతి నివ్వగా, ఆయన నవల "డాక్టర్ ఝివాగో" లోని కమ్యూనిస్టు వ్యతిరేకత కారణంగానే బహుమతి ఇవ్వడం జరిగిందని సోవియట్ ప్రభుత్వం విమర్శించింది. దానితో పాస్టర్నాక్ ఆ బహుమతిని తిరస్కరించవలసి వచ్చింది కూడా. ఇప్పుడు పాస్టర్నాక్ తరువాత చెప్పుకోదగిన మరొక సోవియట్ రచయిత-కమ్యూనిజం పట్ల గాఢాభిమానం గల షోలొకోవ్‌కు ఈ బహుమతి ఇవ్వడం ద్వారా తనకు ప్రచ్ఛన్న యుద్ధపు రాజకీయాలతో ప్రమేయం లేదని స్వీడిష్ అకాడమీ నిరూపించుకుంది.

రష్యన్ నవల టాల్‌స్టాయ్, దాస్తోయెవ్‌స్కీ, తుర్గెనీవ్, గోర్కీల వంటి దిగ్గంతుల చేతులలో సర్వాంగ సుందరంగా పరిణతి చెందింది. విప్లవానంతర రచయితలలో ఇంచుమించుగా వారి సరసన కూర్చుండదగిన ఏకైక నవలాకర్త షోలొకోవ్. సాహిత్యంపై స్టాలిన్ కబంధ హస్తం ఇంకా బిగుసుకోని తొలి రోజులలో ఆయన వ్రాయడం మొదలుపెట్టాడు. అందుచేతనే కావచ్చు, ఆయన రచనలలో చిత్తశుద్ధి కొరవడలేదు; నిజాయితీ నీరు కారిపోలేదు; అటు రష్యన్ సాహిత్యంలోని ఉత్తమ సంప్రదాయాలను, ఇటు విప్లవ ఫలితంగా చెల్లుబడిలోకి వచ్చిన కొత్త విలువలను ఆయన గొప్ప నేర్పుతో మేళవించగలిగాడు. అందుకే సోషలిస్టు వాస్తవికత పేరుతో పుంఖానుపుంఖంగా వెలువడిన సోవియట్ ప్రచారాత్మక సాహిత్యంకంటె వేరుగా చిరకాలం సజీవంగా నిలిచిపోదగిన స్థానాన్ని ఆయన నవలలు సంపాదించుకున్నాయి.

తన ఇరవైయవ యేట మొదలుపెట్టి గడచిన నలభై యేళ్ళుగా రచనా వ్యాసంగం చేస్తున్నా, షోలొకోవ్ వ్రాసిన నవలలు సంఖ్యలో తక్కువే. ఆయన త్వరగా వ్రాయలేడని, ఏ అయిదారేళ్ళకో ఒక నవల పూర్తి చేస్తాడని ప్రతీతి. అంతర్యుద్ధ కాలంలో సంక్షోభానికి లోనైన రష్యన్ జీవితాన్ని-ముఖ్యంగా డాన్ నదీ ప్రాంతంలోని కోసక్ ప్రజల జీవితాన్ని—శక్తిమంతంగా చిత్రించిన "ఎండ్ క్వయట్ ఫ్లోస్ ది డాన్" నవలలో ఆయన ప్రతిభ పూర్తిగా వ్యక్తమవుతుంది. అదే విధంగా సమష్టి వ్యవసాయ క్షేత్రాల నిర్మాణ సమయంలో రష్యాను ఆవరించిన మరొక సంక్షోభాన్ని చిత్రిస్తూ ఆయన వ్రాసిన "ది వర్జిన్ సాయిల్ అప్‌టర్న్డ్" కూడా ఆయన కీర్తికి మరొక మూల స్తంభంగా ఎన్నదగింది. సాహిత్య బహుమతికి ఆయనను స్వీడిష్ అకాడమీ ఎన్నిక చేయడం అన్ని విధాలా అభినందించదగిన విషయం.

(17 అక్టోబర్, 1965)

# కథాకథన చక్రవర్తి

అంత దీర్ఘకాలం రచనలు చేసినవారు అరుదు; అన్ని గొప్ప రచనలు చేసినవారు అరుదు; రచనలపై అంత ధనం సంపాదించిన వారు అరుదు; అంత కీర్తి ఆర్జించినవారు అరుదు. కనుకనే సోమర్‌సెట్ మామ్ మృతి ఆయన అభిమానులకు విషాదకర వార్త.

ఆయన మొదటి నవల "లిజా ఆఫ్ లాంబెత్" 1897లో ప్రచురితమైంది.

నాటి నుంచి మొన్న మొన్న అస్వస్థుడయ్యే వరకు ఆయన రచనా వ్యాసంగం అవిచ్ఛిన్నంగా సాగింది. నవలలే కాదు, నాటకాలే కాదు, కథానికలే కాదు, వ్యాసాలే కాదు, విమర్శలే కాదు, ఆయన సాహిత్య పరిశ్రమ బహుళంగా, బహుముఖంగా విస్తరిల్లింది.

"సమ్మింగ్ అప్" అనే గ్రంథంలో మామ్ తాను "జీవితాన్ని సాహిత్యానికి ముడి సరుకు"గా భావిస్తానని వ్రాశాడు. ఈ దృష్టితోనే ఆయన జీవితాన్ని ఎంత విస్తృతంగా పరిశీలించాడో అంత లోతుగా మథించాడు. తన రచనలలో పాత్రలు కాదగిన వ్యక్తుల కోసం, కావలసిన ఇతివృత్తాలకోసం పెక్కుసార్లు ప్రపంచ పర్యటన చేశాడు. ఇండియా వచ్చిన సందర్భంలో ఆయన రమణ మహర్షి ప్రభావానికి లోనయినాడని, ఆ ప్రభావం క్రిందనే "రేజర్స్ ఎడ్జ్" అనే నవల వ్రాశాడని చెబుతారు. కఠోపనిషత్తులోని "క్షురస్య ధారా నిశితా దురత్యయా...." అనే శ్లోకం నుంచి ఆ నవల పేరును సంగ్రహించడమే కాక, కథా నాయకుడైన లారీ డారెల్‌లో పరివర్తనను చిత్రించడంలో కూడా మామ్‌కు హిందూ వేదాంతంపై మక్కువ వ్యక్తమవుతుంది.

మామ్ తన నవలల పాత్రలకు యథార్థ వ్యక్తులనే ఆధారం చేసుకోవడం ఒక విశేషం. అన్నిటిలో ప్రసిద్ధమైన "ఆఫ్ హ్యూమన్ బాండేజ్" నవల చాలా వరకు మామ్ ఆత్మకథే. "కేక్స్ అండ్ ఏల్" థామస్ హార్డీపై వ్యంగ్య రచన, "మూన్ అండ్ సిక్స్ పెన్స్" కు ఫ్రెంచి చిత్రకారుడు పాల్ గోగాన్ జీవిత చరిత్ర ఆధారం. జీవితం తనకు ముడి సరుకని ఆయన అన్న దిందుకేనేమో.

ఈ వాక్యంలో మామ్ జీవిత దృక్పథం కూడా సూచిత మవుతుంది. ఆయన "సినిక్" అనే నింద లేకపోలేదు. కాని, అది నిజం కాదేమో. మానవుల దౌర్బల్యాలను వలె ఔన్నత్యాలను కూడా అంత నిర్లిప్తంగా, నిర్మమంగా చిత్రించడమే ఈ నిందకు కారణమయి వుండవచ్చు. ఏమయినా, కథా కథన శిల్పంలో ఆయన దరిజేర గలవారు బహుశా ఏ భాషలోనయినా అరుదుగానే వుంటారు.

(డిసెంబర్ 17, 1965)

భావిస్తున్నారట. "ఇకపై విజాతీయ సంస్కృతిని సహించబో" మని తూర్పు పాకిస్తాన్ గవర్నరు అబ్దుల్ మునీం ఖాన్ ఇటీవల ప్రకటించాడట. రవీంద్ర సంగీతాన్ని తమకు విజాతీయంగా భావించడం కంటె పాకిస్తాన్ పాలకుల సంకుచిత మనస్కతకు వేరే నిదర్శన మక్కరలేదు.

తూర్పు పాకిస్తాన్‌లో అధిక సంఖ్యాకులు ఏ మతానికి చెందిన వారయినా బెంగాలీలు. పశ్చిమ బెంగాల్ పౌరులకు, వారికి భాషలోగాని, సంస్కృతిలోగాని భేదం లేదు. పశ్చిమ పాకిస్తాన్‌తో కంటె వారికి ఇండియాతోనే సన్నిహితత్వం ఎక్కువ.

కాగా, రవీంద్రనాథ్ టాగోర్ అవిభక్త వంగదేశంలో పుట్టి, పెరిగి, కాల ధర్మం చెందినవాడు. ఆయన జన్మతః హిందువే కావచ్చు. కాని ఆయన సంస్కారం సర్వమతాలకు అతీతమయింది. ఆయన గానం చేసింది ప్రధానంగా మానవ హృదయాన్ని గురించి. అది దేశకాలాల అవధులను అధిగమించిన కవిత. ఆయనది ఆర్ష సంస్కృతి మాత్రమే కాదు. దానిలో బౌద్ధ, క్రైస్తవ, సూఫీ, హీబ్రూ, మంగోలియన్ సంస్కృతు లెన్నో సమ్మిళితమయిన విశ్వ సంస్కృతి. కనుకనే "విశ్వ కవి" అనే బిరుదు ఆయనకు సార్థకమైంది.

టాగోర్ కవిత వలెనే, ఆయన గీతాల స్వరకల్పన సయితం కేవలం భారతీయమయింది కాదు; వంగదేశపు జానపద గాన రీతులతో యూరోపియన్, చైనీస్, జపనీస్ వంటి బాణీ లెన్నో కలిసిన మధుర సమ్మేళనం. ఈ పై లక్షణాల్ని బట్టే దానికి "రవీంద్ర సంగీత్" అనే ప్రత్యేక నామం లభించింది.

"ఢాకా టైమ్స్" అనే తూర్పు పాకిస్తానీ వార పత్రిక వ్రాసినట్టు టాగోర్ కవితను కేవలం భారతీయమయినదిగా భావించడం షేక్స్పియర్‌ను కేవలం ఇంగ్లండుకు, రోమా రోలాను ఫ్రాన్సుకు చెందిన వారుగా పరిగణించడం వంటిదే. మత మౌఢ్యంతో అంధులయిన పాకిస్తాన్ పాలకులకు ఈ నిజం కన బడుతుందా?

(డిసెంబర్ 23, 1965)

# చౌడయ్య

వయొలిన్ మాట ఎత్తితే జ్ఞాపకం వచ్చేవి రెండే రెండు పేర్లు. ఒకరు ద్వారం వెంకటస్వామి నాయుడుగారు, రెండవవారు టి. చౌడయ్యగారు. ద్వారంవారు కాలధర్మం చెందిన కొద్ది ఏళ్ళకే చౌడయ్యగారు కూడా స్వర్గస్థులు కావడం సంగీతాభిమానులందరికి సంతాపకరమైన వార్త. ఆయన మృతితో దక్షిణ భారత సంగీతాకాశం నుంచి మరొక ధ్రువతార రాలిపడ్డయింది.

నిజానికి వయొలిన్ భారతీయ వాద్యం కాదు. కాని, అది పశ్చిమ దేశాలనుంచి మనకు వచ్చిన విషయం పెక్కుమందికి తెలియనంతగా దాన్ని సాధన చేసి, దానిపై కర్ణాటక సంగీతానికి కొత్త మెరుగులు దిద్ది, తమ అపూర్వ కౌశలంతో స్వదేశీయులను, విదేశీయులను సయితం ముగ్ధులను చేసిన ఘనత ద్వారం వారికి, చౌడయ్యగారికే దక్కింది. ప్రత్యేకించి ఆ వాద్యానికి మరికొన్ని తంత్రులను చేర్చడం ద్వారా దాన్ని మన సంగీతానికి అనుగుణంగా మార్చిన కీర్తి శ్రీ చౌడయ్యదే.

సంగీత రత్న, సంగీత కళానిధి వంటి బిరుదులు, శాస్త్రోక్తి [illegible] ప్రదానం చేసిన కర్ణాటక వాద్య సంగీత మహామహి శ్రీ చౌడయ్య ప్రతిభకు బాహ్యాలంకారాలు మాత్రమే. కాని, [illegible]మైన, అద్భుతమైన స్వరక్రీడతో తాను [illegible] చేసిన అసంఖ్యాక శ్రోతల ప్రశంసలే ఆయనకు నిజమైన సన్మానం. ఆయన [illegible].

(జనవరి 21, 1967)

చిరంజీవులు

# నేతాజీ స్మృతి

తన చిన్నతనంలో సుభాస్‌చంద్రబోసు తత్త్వ చింతనతో గురువుకై అన్వేషిస్తూ హిమాలయాలలో సంచరించాడట. చివరకు విఫల మనోరథుడై తిరిగి వచ్చి తన జీవితాన్ని పరతత్వాన్వేషణ కోసం కాక, దేశమాత దాస్య శృంఖలాల విచ్ఛేదనకోసం అంకితం చేశాడు.

ఈ ఉదంతమే తిరిగి పునరావృత్తం కాగలదని సుభాస్ బోసు అనుయాయులు ఇప్పటికీ విశ్వసిస్తున్నారు. ఆయన ఈనాటికీ ఇంకా బ్రతికే వున్నాడని, ఎక్కడో ఏ హిమాలయాలలోనో, మరొకచోటనో తపో నిమగ్నుడై వున్నాడని, కల్క్యవతారం వలె తిరిగి వచ్చి, నిద్రాణ భారత జాతిని జాగృతం చేస్తాడని నమ్ముతున్నారు.

70 సంవత్సరాల క్రిందట ఈనాడు జన్మించిన శ్రీ బోసు నిస్సందేహంగా లోకోత్తర వ్యక్తి. అంతటి మహాపురుషుడు సామాన్యులవలె భౌతికకాయాన్ని విడనాడినాడన్న కఠోర సత్యాన్ని విశ్వసించలేకనే ఆయన అనుయాయులు ఆయన పునరాగమనంపై ఆశలు పెట్టుకున్నారని భావించవచ్చు. స్వరాజ్య సిద్ధి తర్వాత సురాజ్య సాధనలో అనివార్యంగా జరుగుతున్న ఆలస్యపు నిస్పృహ కూడా వారి ఆశలకు అజ్ఞాత ప్రేరణగా పనిచేసి వుండవచ్చు.

సుభాస్ బోసు మన కోసం ఎన్నటికీ తిరిగి రాకపోవచ్చుగాని, మన జ్ఞాపకాలలో, భవిష్యత్తరాల వారి స్మృతి సీమలలో చిరంజీవుడే కాడా? ఆయన జీవితం, ఆయన ఆశయాలు, త్యాగనిరతి, కార్యపరత, నిర్భీకత, నిశ్చలదీక్ష, ధీరోదాత్తత, కష్ట సహిష్ణుత, అన్నిటిని మించి ఆయన కారాగారం నుంచి తప్పించుకుని ఆఫ్ఘనిస్తాన్, ఇటలీ, జర్మనీ, జపాన్ మొదలైన దేశాలలో అసహాయుడుగా పరిభ్రమిస్తూ చేసిన సాహసాలు, ఆయన నిర్మించిన ఆజాద్ హింద్ ఫౌజు, మాతృదేశం వెలుపల ఆయన స్థాపించిన ప్రప్రథమ స్వతంత్ర భారత ప్రభుత్వం - ఇవన్నీ చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతాయి; భావితరాలను ఉత్తేజపరుస్తూనే వుంటాయి. ప్రవాసంలో నిర్మించిన సైన్యానికి అధిపతిగానే ఆయనకు నేతాజీ బిరుదం లభించి వుండవచ్చు. కాని భారత ప్రజా హృదయ నేతగానే ఆయన సజీవుడు.

ఆయన జాతీయ కాంగ్రెసుకు రెండుసార్లు అధ్యక్షులయ్యారు. ఆయన తీవ్రవాది; ఆనాటి యువతరానికి ప్రతినిధి. స్వరాజ్య సాధన విధానాల విషయంలో గాంధీజీతోను, ఆయన సహచరులతోను పెక్కుసార్లు విభేదించాడు; వారిని తీవ్రంగా విమర్శించేవాడు. ఆయన విశ్వసించిన కార్యాచరణ విధానాల మంచి చెడు లెట్టివైనా, ఆయన అసమానమైన దేశభక్తికి జోహారు అర్పించక తప్పదు. గాంధీజీ పలుకులలోనే "నేతాజీ సాధించిన విజయాలు ఆయనను చరిత్రలో అమరుని చేస్తున్నాయి."

(జనవరి 23, 1967)

చిరంజీవులు

# గాంధీజీ వర్ధంతి

ఇంత మహనీయుడైన వ్యక్తి ఈ నేలపై నడిచాడా అని భావితరాల వారు విస్తుపోతారని గాంధీజీ మరణవార్త వినగానే ఐన్‌స్టీన్ అన్నాడు. నిజంగానే అంతటి మహాత్ముడు మన మధ్య జీవించలేదన్నట్టే మన జాతీయ జీవితం ఈనాడు సాగి పోతున్నది.

గాంధీజీ గతించి నేటికి అప్పుడే పంతొమ్మిదేళ్ళయింది: ఆయన మృతితో పాటు ఆయన స్మృతి కూడా దూరమై పోతున్నట్టు అనిపిస్తున్నది.

ఆయన జీవించి వున్నంత కాలం భారత జాతీయ జీవితంపై ఆయన ప్రభావం ప్రగాఢంగా వుండేది. ఆయన కనుమరుగైనప్పటినుంచి అది క్రమంగా సన్నగిలి పోవడం మొదలు పెట్టింది.

బహూశా ఒకటి నిజమేమో. ఆయన జీవించి వున్న రోజులలో ఆయన వ్యక్తిత్వ ప్రభావానికి తాత్కాలికంగా లోనై, కొన్ని నైతికమైన విలువలను పాటించాము. మానవుని ప్రవర్తన అది వ్యక్తిగతమైనా, సాంఘికమైనా, రాజకీయమైనా, ఆర్థికమైనా దానికి నీతి ప్రాతిపదిక కావాలని ఆయన ఉపదేశించారు. మంచి లక్ష్యాన్ని సాధించడానికి మంచి మార్గమే అవలంబించాలని ఆయన బోధించారు. మొత్తంపై ఆనాడు మనజాతి ఆయన బోధనలను అనుసరించి ప్రపంచానికే విస్మయజనకమైన విధంగా ప్రవర్తించింది. ఆయన గతించడంతో మనపై మనం విధించుకున్న తాత్కాలిక నిగ్రహం సడలిపోయి ఒక్కసారిగా నీతిబాహ్యమైన విశృంఖల వర్తనకు దిగినట్టు అనిపిస్తుంది.

గాంధీజీ మనకు వదిలి వెళ్ళిన వారసత్వంలో ప్రత్యంశం ఈనాటి మారిన పరిస్థితులలో ఉపయుక్తమైనది కాకపోవచ్చు. ముఖ్యంగా గ్రామ స్వయం పోష

కత్వం లక్ష్యంగా గ్రామీణ పరిశ్రమలపై ఆధారపడిన ఆర్థిక వ్యవస్థ నేడు అనుసరణ యోగ్యం కాకపోవచ్చు. వ్యవసాయాన్ని అభివృద్ధి చేయవలసిందే; కుటీర పరిశ్రమలను ప్రోత్సహించ వలసిందే. కాని, మన ప్రగతి అంతటితోనే ఆగిపోవడానికి వీలులేదు. జనసంఖ్య పెరుగుతున్నది. ఇంత జనాభాకు పుష్కలంగా తిండి, బట్ట, ఇతర నిత్య వినియోగవస్తువులను సమకూర్చడానికైనా మన దేశంలో పారిశ్రామిక విప్లవం రావలసిందే. కేవలం వ్యవసాయాన్ని నమ్ముకుని వుండడం వల్లనే మన దేశం కొన్ని శతాబ్దాలుగా వెనుకబడి వుండిపోయింది. అన్ని విషయాలలోను స్వయం పోషకం కావడానికి పారిశ్రామికాభివృద్ధిని మనం సాధించవలసిందే.

ఇది నిజమే. కాని, ఆనాడు గాంధీజీ విశ్వసించిన కొన్ని ప్రత్యేకాంశాలు మనకు ఉపయుక్తం కావంత మాత్రాన, ఆయన ఉపదేశాలన్నిటికి ప్రాతిపదిక అయిన ప్రధాన సూత్రాన్ని మనం విస్మరించడానికి వీలులేదు. అది నైతికంగా విశుద్ధమైన వర్తన. అదే ఈనాడు లోపిస్తున్నది.

వ్యక్తిత్వానికి నేడు సన్మానం జరగడం లేదు. పదవి, ధనం- ఈ రెండింటికే సమాజంలో పట్టాభిషేకం జరుగుతున్నది. ఈ రెండు సమాజ నిశ్శ్రేయసం కోసం వినియోగ పడాలని గాంధిజీ ఉద్బోధించారు. ఈనాడు అవి సమాజంపై ప్రాబల్యం వహించడానికి సాధనాలుగా వినియుక్తాలవుతున్నాయి. వాటిని ఆర్జించడం కోసం నీతి దూరమైన పద్ధతులు ప్రాచుర్యం పొందుతున్నాయి.

కులాలకు, మతాలకు, వర్గాలకు, భాషలకు, ప్రాంతీయతకు అతీతమైన జాతీయతను భారతదేశంలో సృష్టించడానికి గాంధీజీ తన జీవిత కాలమంతా శ్రమించారు. ఈనాడు ఈ జాతీయ భావానికి విరుద్ధమైన సంకుచిత తత్వాలు పొడచూపుతున్నాయి. దేశసమైక్యానికి ప్రమాదకారు లవుతున్నాయి. ఆయన తన ఉపదేశాల ద్వారా, ఆచరణ ద్వారా ఏ హింసాత్మక ధోరణులను వర్జించాలని జాతిని ప్రబోధించారో అవే ధోరణులు ఈనాడు ప్రబలమై మనకు క్లేశం కలిగిస్తున్నాయి. గాంధీజీని వీధి కొకపాకో, రెండుపాటలో జ్ఞప్తికి తెచ్చుకోవడం కాదు; అనునిత్యం మన వర్తనలో ఆయన స్ఫూర్తి ప్రభావం ప్రవహించాలి. అది జరిగినప్పుడు ఇంతటి మహావీయుడు ఈ నేలపై నడిచాడా అని భావి తరాలవారు విభ్రాంతులు కానక్కరలేదు. మన జాతి ప్రతి అడుగులో ఆయన నడుస్తూనే వుంటారు.

(జనవరి 30, 1967)

# బూర్గుల

ప్రముఖ జాతీయవాది, దేశభక్తుడు, మేధావి డాక్టర్ బూర్గుల రామకృష్ణా రావు కాలధర్మం చెందడం తెలుగు వారందరికీ సంతాపకరవార్త.

ఆయన తెలంగాణాలో పుట్టి పెరిగినవారైనా ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికీ

ప్రియతమ నాయకులైనారు. పూర్వపు హైదరాబాద్ సంస్థానాన్ని విభజించవలెనన్న ఉద్యమం వచ్చినప్పుడు తెలంగాణాను ప్రత్యేక రాష్ట్రం చేయాలని ఒక వివాదం బయలు దేరింది. ప్రస్తుతం ఉన్నత పదవులలో వున్న కొందరు ప్రముఖులు ఆ వాదానికి నాయకత్వం వహించారు. కాని డాక్టర్ బూర్గుల తెలుగువారి సమిష్టి ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని ఎంతో రాజనీతిజ్ఞతతో తెలంగాణా వేర్పాటు వాదాన్ని గట్టిగా ప్రతిఘటించారు. తెలంగాణా, ఆంధ్ర ప్రాంతం సమైక్యమై ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడాలని తీవ్రంగా కృషి చేశారు. తెలంగాణాకు చెందిన ఒక ప్రముఖ నాయకుని నుంచి విశాలాంధ్రోద్యమానికి లభించిన ఈ సమర్థన ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి ఎంతో దోహదం చేసింది. ఇందుకు యావదాంధ్రులు డాక్టర్ రామకృష్ణారావుకు ఋణపడి వుంటారు.

ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. చిన్నతనం నుంచి జాతీయవాది. అయితే ఆయన ప్రతిభ రాజకీయాలకు మాత్రమే పరిమితం కాలేదు. సాహిత్యరంగంలో ఆయన కృషి చిరస్మరణీయం. రాజకీయ నాయకులుగా పేరు పొందిన వారిలో ఈ గుణం అరుదైనది. తెలుగు, ఇంగ్లీషు కాక ఆయనకు వచ్చినన్ని భాషలు, వాటిలో అంత విశేష పాండిత్యం చాలా తక్కువమందిలో కానవస్తుంది. ఉర్దూ, పర్షియన్, సంస్కృతాలలో ఆయన విద్వాంసులు. కన్నడం, మహారాష్ట్ర మొదలైన మరికొన్ని భాషలు కూడా ఆయన అభ్యసించారు. తెలుగు, ఉర్దూలలో స్వయంగా గ్రంథరచన చేశారు.

1952 లో అప్పటి హైదరాబాదు సంస్థానానికి ముఖ్యమంత్రి అయిన తర్వాత పెద్ద భూసంస్కరణలను [illegible] విద్యాలయాల గాఢకృషి చేసిన ఘనత శ్రీ బూర్గుల రామకృష్ణారావు [illegible] విధంగా తమ ప్రాంతాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయడానికి [illegible] పాటు పడ్డారు. వారి మరణంతో ఆంధ్రప్రదేశ్ [illegible] వారి స్మృతికి [illegible] వారి కుటుంబానికి మా [illegible]

(సెప్టెంబర్ [illegible])

# శివరామశాస్త్రి గారు

శ్రీ వేలూరి శివరామశాస్త్రి గారి నిర్యాణంతో ఆంధ్ర సాహిత్యాకాశం నుంచి మరొక ఉజ్జ్వల నక్షత్రం రాలిపోయింది. వారి మృతి సాహిత్యాభిమానులకు సంతాప కారణం.

శాస్త్రిగారి ప్రతిభ బహుముఖమైనది. తెలుగు, సంస్కృతాలలో ఆయన విద్వత్తు అద్వితీయం. ఇవికాక హిందీ, బెంగాలీ, ఇంగ్లీషు, ఫ్రెంచి మొదలైన పర భాషలలో సయితం ఆయన పాండితీ ప్రాభవం తక్కువది కాదు. దర్శన శాస్త్రాలు, ఖగోళశాస్త్రం, అలంకార శాస్త్రం వంటి పెక్కు శాస్త్రాలలో ఆయన నిష్ణాతులు. ఆయా విషయాలపై ఆయన వ్రాసిన అసంఖ్యాక వ్యాసావళి దీనికి నిదర్శనం.

తిరుపతి వేంకట కవుల శిష్యుడుగా ఆయన సాహిత్య కృషి ప్రారంభించి శతావధానిగా పేరు తెచ్చుకున్నారు. అయితే ఆయన సాహితీ వ్యవసాయం అవధానాల వద్దనే ఆగిపోలేదు. పెక్కు ఖండకావ్యాలలో ఆయన తమ కవితా వైదగ్ధ్యం వెల్లడించుకున్నారు.

కవిత్వమే కాదు, శాస్త్రిగారు రచించిన కథలను చూచినా, ఆయన సృజనాత్మక ప్రతిభ ద్యోతక మవుతుంది. వెనుకటి తరానికి చెందిన మన కథా రచయితలలో ఆయన ఒక ప్రముఖ స్థానం ఆక్రమిస్తారు. బెంగాలీనుంచి శరచ్చంద్రుని నవలలను ఆంధ్రీకరించిన తొలి రచయితలలో ఆయనొకరు. గాంధీజీ స్వీయచరిత్రను మొదటగా తెనిగించి ఆంధ్రులకు మహోపకారం చేసిన ఘనత కూడా శాస్త్రిగారిదే. వారి మృతితో ఆంధ్రసాహితి పేదపడిన దనడంలో సందేహంలేదు.

(మార్చి 18, 1967)

# గాంధీ జయంతి

ఆయన జన్మించి 98 సంవత్సరాలైంది. ఆయన జననంచే పునీతమైన దినం - అక్టోబర్ 2వ తేదీ—తిరిగి వచ్చింది. ఈనాడు గాంధీ జయంతి.

యథావిధిగా ఈనాడు సభలు, సమావేశాలు, ఉపన్యాసాలు, ప్రార్థనలు, సూత్ర యజ్ఞాలు మొదలైనవి జరిగిపోతాయి. గాంధీజీ పటాలకు, విగ్రహాలకు ఏడాది నుంచి పట్టిన బూజు తొలగిపోయి, దాని స్థానంలో పూలమాలలు, నూలు దండలు ప్రత్యక్ష మౌతాయి. చిన్న, పెద్ద నాయకులు ఆయన ఉపదేశాలకు పట్టిన బూజును కూడా దులిపి వాటిని మాలగా గ్రుచ్చి తమ కంఠసీమలను అలంకరించుకుంటారు.

ఇది ప్రతి సంవత్సరం జరిగే తతంగమే. ఇదే ఆనవాయితీ ఈ సంవత్సరం కూడా చెల్లిపోతుంది.

మరి రెండేళ్ళలో గాంధీజీ శత జయంతి రానున్నది. ఈ ఉత్సవాన్ని మహా వైభవంగా జరిపించడానికి ఇండియా ప్రభుత్వం ఇప్పటికే సన్నాహాలు ప్రారంభించింది. మన దేశంలోనే కాదు, విదేశాలలో కూడా, ప్రపంచ విజ్ఞాన సమితి ఆధ్వర్యాన కూడా శత జయంత్యుత్సవాలు వైభవోపేతంగా జరుగబోతున్నాయి. ప్రతి

సంవత్సరం జరిగే దానికి నూరు రెట్లు లాంఛనాలతో ఉత్సవాలు జరుగుతాయి. సందేహం లేదు.

కాని, ఇంతే నిస్సందేహంగా మన జాతీయ జీవితం గాంధీజీ చేసిన ప్రతి ఒక్క ఉపదేశానికి వ్యతిరేక దిశలో సాగిపోతూనే వుంటుంది. ఆయన నిష్క్రమించిన సుమారు ఇరవై సంవత్సరాలుగా ఇంతే జరిగింది. ఈనాడు దేశంలో ప్రవర్తిల్లుతున్న సంఘటనలను చూస్తే, ఇక ముందు కూడా ఇందుకు భిన్నంగా జరుగుతుందని ఆశించడం కష్టమైపోతున్నది.

కడచిన ఇరవై సంవత్సరాలలో భారతదేశంలో ఒక కొత్త తరం ఉద్భవించింది. ఆ కొత్త తరానికి గాంధీజీ ఒక పేరు మాత్రమే. ఆయన ప్రత్యక్ష ప్రభావం వారిపై పడలేదు. కాని కొత్త తరాన్నే వ్రేలెత్తి చూపనక్కరలేదు. గాంధీజీ జీవిత కాలానికి చెందిన పాత తరం వారు కూడా ఆయన ప్రభావం తమపై పడనట్టే ప్రవర్తించడం మరింత బాధాకరమైన విషయం.

"ఇంతటి మహాత్ముడు ఈ భూమిపై సంచరించాడా అని భావికరాల వారు విస్తుపోతా"రని గాంధీజీ మరణవార్త విన్నప్పుడు ప్రఖ్యాత విజ్ఞానవేత్త ఐన్‌స్టయిన్ అన్నాడు. ఒక విధంగా చూస్తే గాంధీజీ ఈ గడ్డపై పుట్టనట్టే, సంచరించనట్టే తన అద్భుత జీవితంతో దాన్ని పునీతం చేయనట్టే మన జాతీయ జీవితం సాగిపోతున్నది.

ఆయన రాజకీయాల నుంచి జీవితంలోని ప్రతి స్వల్ప చర్య వరకు నైతికమైన విలువలకు అత్యంత ప్రాధాన్యమిచ్చారు. కాని, ఈనాడు జీవితంలోని ఏ రంగాన్ని చూచినా ఆ విలువలు మృగ్యమై పోయాయి. స్వార్థమే పరమార్థమైంది. ఏ స్వల్ప సమస్యను పరిష్కరించడానికైనా దౌర్జన్యమే సాధనమౌతున్నది. దేశ సమైక్యానికి భంగకరమైన ధోరణులు ప్రవర్తిల్లుతున్నాయి.

ఈ విషాదకర పరిస్థితుల నుంచి బయట పడనంతవరకు మన జాతిని ఆవరించిన నేటి నిరాశా నిస్పృహలు, నిస్తబ్ధత, తొలగిపోవు. గాంధీ జయంత్యుత్సవాలు క్రమక్రమంగా ఒక విగ్రహారాధన విధంగా మారిపోతున్నాయి. ఆయన తన జీవితం ద్వారా ప్రబోధించిన నైతిక ధర్మాలు మనలను తిరిగి ప్రభావితులను చేసినప్పుడే మన జాతికి ప్రగతి, ఉన్నతి.

(అక్టోబరు 2, 1967)

# డాక్టర్ భాభా

వైజ్ఞానికంగా ఇండియా నేటికీ పెక్కు రంగాలలో వెనకబడినదే కావచ్చు. కాని, ఒక్కదానిలో మాత్రం ఇండియాది గర్వించదగు స్థానం. అది అణుశక్తి రంగం. దానికి ఏకైక కారకుడు డాక్టర్ హెచ్. జె. భా భా.

స్వాతంత్ర్య సిద్ధికి ముందు రోజులలో ఇండియాలో అణుశక్తి విజ్ఞానం దాదాపుగా పాఠ్యపుస్తకాలకే పరిమితమైంది. మౌలిక పరిశోధన దాదాపు శూన్యం. ఈనాడు అమెరికా, రష్యా, బ్రిటన్, కెనడా మొదలైన అభివృద్ధి చెందిన కొద్ది దేశాల తరువాత ఒక గౌరవప్రదమైన స్థానం ఇండియాకు లభించడానికి ఏకైక బాధ్యత డాక్టర్ భాభాదే.

ఇది అణు వైజ్ఞానిక యుగమని జవహర్‌లాల్ నెహ్రూ తరచుగా అంటూవుండే వారు. అణుపరిశోధనలో, అణు సాంకేతిక విజ్ఞానంలో వెనుకబడిన దేశానికి భవిష్యత్తు లేదని స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల నుంచి నెహ్రూ గ్రహించారు. శాంతియుత నిర్మాణాత్మక కృషికి అణుశక్తి ఎంతగా దోహదం చేయగలదో ఆయన పూర్తిగా గ్రహించారు. అందుచేతనే కేంద్రప్రభుత్వంలో అణుశక్తికి ఒక ప్రత్యేక శాఖను కల్పించి దానిపై ఆయన స్వయంగా ఆధ్వర్యం వహించారు. నెహ్రూ ఆసక్తికి భాభా దక్షత తోడుకాగా, ట్రాంబేలోని అణుశక్తి పరిశోధన కేంద్రమేమి, అణు విద్యుచ్ఛక్తి యంత్రాల స్థాపన మేమి సాధ్యపడ్డాయి.

ఇంతేకాదు; కోరితే పద్దెనిమిది నెలల స్వల్ప వ్యవధిలో అణ్వస్త్రాన్ని నిర్మించగల శక్తిని ఇండియా సముపార్జించు కొనడానికి కూడా డాక్టర్ భాభా ఎనలేని కృషి చేశారు. అయినా, అణుశక్తిని శాంతి ప్రయోజనాల నిమిత్తమే వినియోగించాలని, యాటం బాంబుల ఉత్పత్తి పోటీలో పాల్గొనరాదని ఇండియా నిశ్చయించుకున్నది. ఈ విధానానికి అనుగుణంగానే డాక్టర్ భాభా తమ పరిశోధనా కృషిని సాగించారు.

ఆయనది అకాల మరణం; అతి విషాదకర పరిస్థితులలో జరిగిన మరణం. ఆయన లేని లోటు ఇప్పటిలో తీరనిది. అయినా, మన దేశంలో అణు విజ్ఞాన శాస్త్రానికొక సుస్థిర ప్రాతిపదికను, సుశిక్షితులు, సమర్థులు అయిన వందలాది అణు శాస్త్రజ్ఞులను ఆయన మిగిల్చే వెళ్ళిపోయారు. ఇందుకు ఆయనకు కలకాలం కృతజ్ఞులమై వుండక తప్పదు.

(జనవరి 26, 1966)

# నిష్కళంక దేశభక్తుడు

ఆయన ధైర్య సాహసాలను తలుచుకొంటే ఒడలు గగుర్పొడుస్తుంది. ఆయన అచంచల దేశభక్తిని స్మరిస్తే శరీరం రోమాంచిత మవుతుంది. ఆయన జీవిత చరిత్రను పఠిస్తే ఒక నూరేళ్ళకు పైగా భారతదాస్య విమోచనం కోసం జరిగిన ఆసంఖ్యాక విప్లవాల్ని, పోరాటాల్ని, త్యాగాల్ని, బాధల గాథలు అన్నీ కళ్ళముందు సాక్షా

త్కరిస్తాయి. ఆయన పేరు—వినాయక్ దామోదర్ సావర్కార్ - చరిత్రలో రక్తాక్షరాలతో శాశ్వతమై నిలిచిపోతుంది.

అది ఒక విధంగా భారతదేశానికి అంధకారయుగం. ఆ తిమిరంలోనే అక్కడక్కడ కొన్ని కాంతి కిరణాలు. అది దాస్యంలో క్రుంగుతున్న ప్రజలకు దిక్కు, తెన్ను తోచని పరిస్థితి. దానిలోనే సుదూర స్వాతంత్ర్య గమ్యం దిశగా బాటలు వేయడానికి కొందరు మహాపురుషులు చేస్తున్న ప్రయత్నాలు.

ఆ మహాపురుషులలో సుప్రసిద్ధుడైన వ్యక్తి సావర్కార్. ఆయనను ఒక శివాజీతో, ఒక మాజినీతో, ఒక గారిబాల్డితో పోల్చాలి. దేశభక్తి, ధైర్య సాహసాలు ఆయనకు ఉగ్గుపాలతో రంగరించి పెట్టిన లక్షణాలు. 1899 నాటికే - ఆయన పదహారవ ఏటనే - "మిత్రమేళ" అనే పేరిట ఒక విప్లవ సంఘాన్ని స్థాపించినాడంటే దేశవిమోచనకై ఆయన గాఢవాంఛను ఊహించుకోవచ్చు. వ్యాయామ విద్యను వ్యాప్తం చేయడం, దేశభక్తి గీతాలను ప్రచారం చేయడం, దేశ సమస్యలను చర్చించి నిగ్గు తేల్చుకోవడం లక్ష్యాలుగా స్థాపించిన ఆ సంఘం కొద్దికాలానికే "అభినవ భారత్"గా-ఇటాలియన్ దేశభక్తుడు మాజినీ స్థాపించిన "యంగ్ ఇటలీ" ఒరవడిలో రూపొందింది.

ఆ రోజులలో తెల్లదొరతనాన్ని పల్లెత్తుమాట అనడం నేరం: "వందేమాతరం" పాడడం అపరాధం. దేశ స్వాతంత్ర్యాన్ని కాంక్షించడం రాజద్రోహం. ఈ కారణంగానే ఆ రోజులలో దేశమంతటా ముఖ్యంగా బెంగాల్, పంజాబ్, మహారాష్ట్రలలో ఎన్నో రహస్య సంఘాలు బయలుదేరాయి. దేశ స్వాతంత్ర్య సాధనకు దౌర్జన్యవాదం తప్ప మరొక మార్గం కనిపించని పరిస్థితి ఏర్పడింది. కనుకనే "అభినవ భారత్" సంఘం సయితం దౌర్జన్య వాద ధోరణిలోనే నడవడం జరిగింది.

దాని నాయకుడైన సావర్కార్ దేశ విమోచన సమరంలో వహించిన పాత్రను, నిద్రిత జాతిని ప్రబోధిస్తూ చేసిన ఉద్విగ్న ప్రసంగాలను, నడిపిన ఉద్యమాలను, పడిన బాధలను, చేసిన త్యాగాలను ఇక్కడ వివరంగా ప్రస్తావించవలసిన పని లేదు. లండన్‌లో ఆయన గడిపిన సంవత్సరాలు, దౌర్జన్య చర్యలతో సంబంధం కలదనే అభియోగంపై ఆయన అరెస్టు కావడం, ఓడ నుంచి దూకి సముద్రాన్ని ఈది తప్పించుకుని పోవడం, తిరిగి అరెస్టు కావడం, యాభై సంవత్సరాల పరిమితితో

రెండు యావజ్జీవ ప్రవాస శిక్షలకు లోను కావడం - ఇవన్నీ ఒక వ్యక్తి జీవితానికే కాదు, ఒక జాతి జీవితానికే చరితార్థత కూర్చే మహోజ్జ్వల సన్ని వేశాలు.

ఆయన ఎంత గొప్ప దేశభక్తుడో అంత మహా వక్త; మహా రచయిత; చరిత్రకారుడు. "ఇండియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్ 1857" అనే గ్రంథాన్ని ఆయన రచించడం, ప్రచురించడం, ప్రచారం చేయడం — అదంతా ఆయన జీవిత కథ అంతగా ఆసక్తి కలిగించే విచిత్ర కథ. దాని ఇంగ్లీషు అనువాదాన్ని ముందు ఇండియాలో ప్రచురించ యత్నించడం, ఆ తరువాత ఇంగ్లండులో, ఫ్రాన్సులో, జర్మనీలో ముద్రించడానికి యత్నించడం, చివరకు హాలెండ్‌లో ముద్రించి, ఫ్రాన్సుకు తీసుకు వచ్చి, ప్రతులన్నిటినీ రహస్యంగా ఓడలలో సాధారణ ప్రయా ణీకుల సామాగ్రితోపాటు ఇండియాకు దొంగతనంగా రవాణా చేయడం, 1947 వరకు దానిపై నిషేధం కొనసాగడం-ఇవన్నీ ఆయన రచన అంటే బ్రిటిష్ ప్రభుత్వం ఎంతగా భయపడేదో తెలిపే సంఘటనలు.

బ్రిటిష్ దమన నీతి అతిక్రూర విధానంలో కొనసాగుతున్న ఆ రోజులలో రహస్య విప్లవ సంఘాలు బయలుదేరడం సహజమే కావచ్చు. వాటి నాయకులకు బ్రిటిష్ వారివల్ల ప్రగాఢ ద్వేషం, దేశవిముక్తి కాంక్ష తప్ప స్పష్టమైన విధానాలు, నిర్దిష్టమైన కార్యప్రణాళిక లేకపోయి వుండవచ్చు. తమలో రగిలే స్వాతంత్ర్యకాంక్షను ప్రజానీకంలోని అన్ని వర్గాలలో ప్రబోధించలేకపోయి వుండవచ్చు. ఆ బాధ్యతను జయప్రదంగా నిర్వహించిన ఘనత మరొక జాతీయ సంస్థకు లభించి వుండవచ్చు. అయినా, నాటి విప్లవ వీరుల సాహస కృత్యాలను, ఉద్యమాలను తక్కువ అంచనా వేయడానికి వీలులేదు. అనాటి భారతదేశంపై వాటి ప్రభావాన్ని చులకన చేయడానికి వీలులేదు. ఆ తరువాతి కాలంలో జరిగిన దేశవ్యాప్త మహోద్యమాలకు పునాది నిర్మించిన గౌరవం వాటిదే. తమ వ్యక్తిగత త్యాగాల ఉదాహరణలతో, తమ ఆద ర్శాల పవిత్రతలతో, తమ అత్యుత్సాహంతో దేశీయులను జాగరితులను చేసిన గౌరవం సావర్కార్ వంటి మహాపురుషులదే. భారత స్వాతంత్ర్య చరిత్రలో ఒక ఉజ్జ్వల ఘట్టాన్ని సృష్టించిన సావర్కార్‌కు జాతి చిరకాలం ఋణపడి వుంటుంది.

(ఫిబ్రవరి 27, 1966)

# వాల్ట్ డిజ్నీ

వాల్ట్ డిజ్నీ చలన చిత్రరంగంలోకి రాకపోతే కవిగా పేరు తెచ్చుకునేవాడా? ఆయన కార్టూన్ చిత్రాల కవితా సౌందర్యాన్ని ఆస్వాదించిన వారికి ఈ ప్రశ్న అనివార్యంగా స్ఫురిస్తుంది.

ఆయన కవే అయితే సాహిత్యానికి ఏ పాటి పరిపుష్టి చేకూరేదో చెప్పలేము కాని, చలన చిత్ర రంగానికి మాత్రం తీరని నష్టం వాటిల్లేది. ఎందుకంటే హాలీవుడ్ మంచి వచ్చిన ఉత్తమోత్తమ ప్రతిభాశాలురలో ఆయ నొకరు.

1923 ప్రాంతాలకే వాల్ట్ డిజ్నీ కార్టూన్ చిత్రాలలో వినూత్న ప్రయోగాలు ప్రారంభించాడు. 1928 నుంచి మిక్కీమౌస్, డోనల్డ్ డక్ మొదలైన జంతు పాత్రలతో ఆయన నిర్మించిన వందలాది చిత్రాలు దేశ దేశాలలో బాల బాలికలను ఈనాటికీ ఉర్రూతలూగిస్తున్నాయి. ఆయన సృజించిన చలన చిత్ర పాత్రల ప్రాచుర్యాన్ని షేక్స్పియర్, డికెన్స్ వంటి వారి పాత్రలు పొందిన ప్రాచుర్యంతోనే పోల్చాలి.

1938లో "స్నో వైట్, ఏడుగురు మరుగుజ్జులు"తో ప్రారంభించి డిజ్నీ నిర్మించిన సిండరెలా, పినాషియో, బ్యాంబీ, డంబో, యాలిస్ ఇన్ ది వండర్లాండ్, పీటర్ ప్యాన్ వంటి దీర్ఘ కథా చిత్రాలు ఆయనకు ప్రపంచమంతటా అపార ఖ్యాతిని, అమిత ధనాన్ని ఆర్జించి పెట్టాయి. వీటితోపాటు ఆయన నిర్మించిన ఫాంటాసియా, మెలొడీ టైమ్ వంటి హ్రస్వ చిత్రాల సంపుటాలు చలన చిత్ర చరిత్రలో చిరస్మరణీయాలయినవి.

డిజ్నీ కార్టూన్ చిత్రాలే కాక, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత మామూలు నటీనటులతో సాధారణ కథా చిత్రాలు కూడా చాలా నిర్మించాడు. ప్రకృతి వైచిత్ర్యాలను చిత్రించే నేచర్స్ హాఫ్ ఏకర్, సీల్ ఐలెండ్, బీవర్ వ్యాలీ, గ్రేట్ ప్రెయిరీ వంటి వైజ్ఞానిక చిత్రా లెన్నిటినో తీశాడు. ఇవి ప్రజాదరణ పొందక పోలేదు గాని కార్టూన్ చిత్రాలలోనే ఆయన ప్రతిభ అద్వితీయంగా భాసించింది.

దీనికి కారణం డిజ్నీ వాస్తవ ప్రపంచాన్ని కవిగా, కవిత్వపు దృక్కోణం నుంచి చూడడమే ననిపిస్తుంది. ఆయన విచిత్ర భావన స్థలానికి, కాలానికి సంబంధించిన అవధులన్నిటిని అధిగమించి ఒకానొక ఊహా జగత్తులో తేలియాడేది. దానికి రూపకల్పన చేయడానికి కార్టూన్ చిత్రాల మీడియం ఆయనకు చక్కగా ఉపకరించింది.

డిజ్నీ ఒక అపూర్వ రామణీయకాన్ని తన "అధి వాస్తవిక లోకం"లో కల్పించ గలిగాడు. మహా కవులు మాటలతో, గాయకులు స్వరాలతో, చిత్రకారులు రంగులతో ఆటలాడుకున్నట్టు, డిజ్నీ తన వ్యంగ్య చిత్ర లేఖనంతో ఆడుకున్నాడు. ఆయన మరణించినా ఆయన కీర్తి చిరస్థాయిగా ప్రకాశిస్తుంది.

(డిసెంబర్ 17, 1966)

# నూతన దృక్పథం

మానవుడు కొన్ని లక్షల సంవత్సరాలుగా భూమండలంపై నివసిస్తున్నాడు. అన్ని లక్షల సంవత్సరాలలోను అతడు సాధించిన వైజ్ఞానిక ప్రగతి ఒక ఎత్తు, కడచిన నూరు, నూటయాభై సంవత్సరాలలో అతడు తెలుసుకోగలిగినది మరొక ఎత్తు.

ముఖ్యంగా ఈ శతాబ్దంలో మానవ విజ్ఞానం అమిత వేగంతో, అత్యాశ్చర్య కరంగా పెరిగిపోతున్నది. అందులోను—ప్రపంచ ప్రసిద్ధ ఖగోళ శాస్త్రవేత్తలలో ఒకరైన హార్లో షాప్లీ ఇటీవల ఒక వ్యాసంలో పేర్కొన్నట్టు - మానవ విజ్ఞానం రెండు విభిన్న దిశలలో విభ్రాంతికరంగా పురోగమిస్తున్నది.

ఒకటి—తలఎత్తి, కనులువిప్పి చూస్తే కనబడే అనంత విశ్వానికి సంబంధించిన విజ్ఞానం.

రెండవది - స్థూలదృష్టితోగాని, యంత్రపరికరాల సహాయంతోగాని ఏ విధంగాను చూడడానికి వీలులేని పరమాణు ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానం.

ఒకటి అతి స్థూలజగత్తుకు, రెండవది అతి సూక్ష్మజగత్తుకు సంబంధించినవి. ఈ రెండు దిశలలోను మానవుడు ముఖ్యంగా ఈ ఇరవైయవ శతాబ్దిలో కనుగొన్న రహస్యాలు ఎట్టి అద్భుత పరిణామాలను సాధ్యం చేయనున్నవో ఊహించడమైనా కష్టం.

17 నెలల క్రిందట అమెరికన్ రోదసీ యాత్రికుడు రిచర్డ్ గార్డన్ తన జెమినీ-11 రోదసీ నౌకనుంచి తీసిన కొన్ని ఛాయా చిత్రాల ద్వారా నక్షత్రాలెలా ఉద్భవించినవనే విషయం తెలియవచ్చునని శాస్త్రజ్ఞులు తలపోస్తున్నట్టు నిన్నటి ఒక వార్త తెలుపుతున్నది. "ఓరియన్" నక్షత్రమండలం మనకు 40 కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో వున్నది. దాన్ని 12 కోట్ల కాంతి సంవత్సరాల వ్యాసంగల ఒక "ధూళి మేఘం" ఆవరించి వున్నట్టు రిచర్డ్ గార్డన్ తీసిన ఫోటోలు చూపిస్తున్నాయట. వేరు వేరు స్థలాలలో ఆ "ధూళిమేఘం" చిక్కదనాన్నిబట్టి ఒక కొత్త నక్షత్రం ప్రభవించడానికి అది ముడి పదార్థంగా ఉపయోగిస్తున్నదని, దీన్నిబట్టి నక్షత్రగోళాలు ఏ విధంగా ఆవిర్భవిస్తాయో తెలియరావచ్చునని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు.

ఈ విశ్వ రహస్యాలన్నీ ఎంత త్వరలో మానవ కరతలామలకాలు కాగలవో చెప్పలేముగాని, ఇప్పటికి తెలియవచ్చిన విషయాలను బట్టి కూడా మనం కొన్ని శతాబ్దాలుగా పెంచుకున్న మూఢ విశ్వాసా లనేకం పటాపంచ లవుతున్నాయి. భూమి, దానిపై జీవరాశి, దానిపై మానవుని స్థానం, అతనిపై పరిసరాల ప్రభావం, ఇవేకాదు, మన చుట్టూ ఆకాశంలోని చంద్రుడు, గ్రహాలు, సూర్యుడు, ఇతర గోళాలు మొదలైన వాటివల్ల మనం పెంచుకున్న పెక్కు నమ్మకాలు పటాపంచలవుతున్నాయి.

ఈ పురాతన విశ్వాసాలే కాదు. విజ్ఞాన పురోగతిలో ఒక్కొక్క నూత్న విషయం ఆవిష్కృతమౌతున్న కొద్దీ మొన్నటి శాస్త్రవేత్తల సిద్ధాంతాలను నిన్నటి శాస్త్రవేత్తలు, నిన్నటివారి పరిశోధనా ఫలితాలను నేటివారు ఖండించి వేస్తున్నారు. దీన్ని విజ్ఞానానికి ఖండన మండనల దృష్టితో చూడరాదు. మానవ విజ్ఞాన పురోగతిగానే పరిగణించాలి.

ఉదాహరణకు కాంతికంటె వేగంతో (సెకండుకు లక్ష ఎనభై అరువేల మైళ్లు) ఏదీ ప్రయాణం చేయలేదని మహామేధావి ఐన్‌స్టీన్ విశ్వసించాడు. ఒకటి ఒకటి రెండు అన్నట్టు, తిరుగులేని శాస్త్రీయ సత్యంగానే ఇన్నాళ్లూ మనం భావిస్తూ వచ్చాము.

అయితే, కొలంబియా యూనివర్సిటీకి చెందిన డాక్టర్ జెరాల్డ్ ఫీన్‌బర్గ్ ప్రతిపాదించిన ఒక నూత్న సిద్ధాంతాన్నిబట్టి కాంతికంటె వేగంగా, ఆ మాటకు వస్తే "పరిమితిలేని" వేగంతో (ఇన్‌ఫినిట్ స్పీడ్) పయనించే పరమాణు కణాలు (పార్టికల్స్) వుండవచ్చునట. వాటికి ఆయన "టాక్యాన్స్" అనే పేరు పెట్టాడు.

కొంతకాలం క్రిందటి వరకు జీవరాశి భూగోళానికే పరిమితమని, మరెక్కడా

వుండడానికి వీలులేదని శాస్త్రజ్ఞులు నమ్మేవారు. కాని, ఈ నమ్మకం ఇప్పుడు సడలి పోతున్నది. విశ్వంలో కోటాను కోట్ల నక్షత్రాలున్నాయి. సూర్యుని కున్నట్టే వాటికి కూడా గ్రహాలుండవచ్చు. ఒక్కొక్క నక్షత్రం చుట్టూ ఒక్కొక్క గ్రహంలో జీవ రాశి వున్నా, మన భూమిని పోలిన గ్రహాలు, జీవరాశి కలిగినవి కొన్ని కోట్లు వుండ డానికి వీలున్నది.

ఇంతేకాదు. మన భూమిపై జీవరాశి ప్రాణవాయువు (ఆక్సిజన్) ఆధారంగా ఆవిర్భవించింది. బహుశా ఇతర గ్రహాలలో తద్భిన్నమైన మూల ద్రవ్యాల ఆధా రంతో పరిణామం చెందిన జీవరాసు లున్నాయేమో. మన భూమిపై జీవరాశిలో మానవుడు పరిపూర్ణ పరిణామం చెందిన వాడుగా కనబడుతున్నాడు. సుదూర గ్రహా లలో ఇంతకంటె ఉత్తమ పరిణామం చెందిన జీవులున్నారేమో. వారి నాగరికత మన దానికంటె పరిణతి చెందినదై వుండవచ్చునేమో. వీటిని కేవలం ఊహాగానాలుగా త్రోసివేయ వీలులేదని శాస్త్రజ్ఞుల భావన.

చంద్రగోళానికి మానవుడు చేరడానికి ప్రస్తుతం సన్నాహాలు జరుగుతున్నాయి. ఇది మరి రెండు మూడేళ్ళలోనే సాధ్యం కావచ్చు కూడా. అది సాధ్యమైతే సౌర కుటుంబంలోని ఇతర గ్రహాలకు ప్రయాణాలు కూడా త్వరలోనే సాధ్యంకావచ్చు.

చంద్రుడు మనకు అతిసమీపంలో వున్న గోళం. అక్కడికి వెళ్ళి రావడం అయిదారురోజుల పని. ఇతర గ్రహాలకు చేరడం సాధ్యమైతే అది కొన్ని నెలల పని. కాని, విశ్వాంతరాళంలో అనేక కాంతి సంవత్సరాల దూరంలోగల గోళాలను చేరడం సాధ్యం కాకపోవచ్చు. కనీసం ఇది ఈనాడు శాస్త్రవేత్తలు వెలిబుచ్చుతున్న నిరాశ.

కాని, డాక్టర్ ఫేన్‌బెర్గ్ కనిపెట్టిన "టాక్యాన్స్" పరమాణుకణాలు నిజంగా వుంటే, అవి కాంతికంటె వేగంగా పోగలిగితే, వాటి శక్తిని వినియోగించుకుని రోదసీ నౌకలను అమితవేగంతో నడపగల్గితే, సుదూర గోళాలను చేరడం సాధ్యమేమో, ఈ ఆలోచనను డాక్టర్ ఫేన్‌బెర్గ్ స్వయంగా వెల్లడించాడు.

అణుకేంద్రంలో వున్నవని డాక్టర్ ఫేన్‌బెర్గ్ చెబుతున్న "టాక్యాన్స్" కణాలు నిజంగా వున్నవా లేదా అని శాస్త్రవేత్తలు అనుమానిస్తున్నారు. వాటిని కను

గొనడానికి చేసిన ప్రయత్నాలింతవరకు ఫలించలేదు. కాని 1920 ప్రాంతంలో పి. ఎ. ఎమ్. డిరాక్ అనే శాస్త్రజ్ఞుడు కేవలం గణితశాస్త్ర సహాయంతో ఊహించిన "పోజిట్రాన్" వంటి విలక్షణ అణుకణాలు (యాంటీ మేటర్) నిజంగా వున్నవని ఆ తర్వాత శాస్త్రవేత్తల పరిశోధనలలో తేలింది. అదే విధంగా, కాంతికంటె వేగంగా పయనించే "టాక్యాన్స్" కణాలను కూడా శాస్త్రవేత్తలు నెమ్మదిగా కనిపెట్టడం సంభవమేమో.

ఏమైనా, నిన్న మొన్నటి వరకు శాశ్వత సత్యాలుగా శాస్త్రవేత్తలే భావించిన సిద్ధాంతాలు సయితం నూతన పరిశోధనల ఫలితంగా పూర్వపక్షమై పోతున్నాయి. కాగా, కొన్ని వేల, వందల సంవత్సరాలనాటి వేదాలపై, బైబిల్‌పై, పురాణాలపై,ధర్మ శాస్త్రాలపై ఆధారపడిన మన విశ్వాసాలు, సిద్ధాంతాలు పూర్వపక్షం కావడంలో ఆశ్చర్యంలేదు.

జగత్తు పరిణామశీలమైనది. దేనికి స్థిరత్వంలేదు. అణువునుంచి బ్రహ్మాండం వరకు ప్రతిది పరిణామం చెందుతున్నది. ఒకే ఒక ప్రోటాన్‌తో కూడిన పై అణువునుంచి అతి సంకీర్ణమైన స్థూలజగత్తు యావత్తు పరిణామం చెందింది కణం కలిగిన ప్రాణినుంచి మానవునితోసహా జీవరాశి అంతా రూపొందింది ణామం ఇంకా అనంత ముఖాలుగా కొనసాగుతున్నది.

అయినప్పుడు, కొన్ని వేల ఏళ్ళనాటి విశ్వాసాలను శాశ్వత సత్యాలుగా కుని ప్రాకులాడడం అవివేకం కాదా ? మన పూర్వులు ఆనాటి తమ పరిమిత విజ్ఞానం ఆధారంగా తమ విశ్వాసాలను సృష్టించుకున్నారు. వాటికి ఈనాటి వైజ్ఞానిక పురో గతితో పొసగదు. వాటిని ప్రక్కకునెట్టి, ఈనాటి శాస్త్రీయ విజ్ఞానానికి తగు కొత్త విశ్వాసాలను సృష్టించుకోవాలి. ఒక నూతన దృక్పథాన్ని - కేవలం తాను, తన భూమి సర్వసృష్టికి కేంద్రమన్న విశ్వాసాన్ని విడనాడి—మానవుడు పెంపొందించుకోవాలి. విజ్ఞానశాస్త్ర విస్తరణపై ఆధారపడిన నూత్న మతాన్ని, నూత్న వేదాంతాన్ని సృష్టించు కుని తాను సయితం పురోగమించాలి.

(ఫిబ్రవరి 18, 1968)

గొనడానికి చేసిన ప్రయత్నాలింతవరకు ఫలించలేదు. కాని 1920 ప్రాంతంలో పి. ఎ. ఎమ్. డిరాక్ అనే శాస్త్రజ్ఞుడు కేవలం గణితశాస్త్ర సహాయంతో ఊహించిన "పోజి ట్రాన్" వంటి విలక్షణ అణుకణాలు (యాంటీ మేటర్) నిజంగా వున్నవని ఆ తర్వాత శాస్త్రవేత్తల పరిశోధనలలో తేలింది. అదే విధంగా, కాంతికంటె వేగంగా పయనించే "టాక్యాన్స్" కణాలను కూడా శాస్త్రవేత్తలు నెమ్మదిగా కనిపెట్టడం సంభవమేమో.

ఏమైనా, నిన్న మొన్నటి వరకు శాశ్వత సత్యాలుగా శాస్త్రవేత్తలే భావించిన సిద్ధాంతాలు సయితం నూతన పరిశోధనల ఫలితంగా పూర్వపక్షమై పోతున్నాయి. కాగా, కొన్ని వేల, వందల సంవత్సరాలనాటి వేదాలపై, బైబిల్‌పై, పురాణాలపై,ధర్మ శాస్త్రాలపై ఆధారపడిన మన విశ్వాసాలు, సిద్ధాంతాలు పూర్వపక్షం కావడంలో ఆశ్చర్యంలేదు.

జగత్తు పరిణామశీలమైనది. దేనికి స్థిరత్వంలేదు. అణువునుంచి బ్రహ్మాండం వరకు ప్రతిది పరిణామం చెందుతున్నది. ఒకే ఒక ప్రోటాన్‌తో కూడిన హైడ్రోజన్ అణువునుంచి అతి సంకీర్ణమైన స్థూలజగత్తు యావత్తు పరిణామం చెందింది. ఒక జీవ కణం కలిగిన ప్రాణినుంచి మానవునితోసహా జీవరాశి అంతా రూపొందింది. ఈ పరి ణామం ఇంకా అనంత ముఖాలుగా కొనసాగుతున్నది.

అయినప్పుడు, కొన్ని వేల ఏళ్ళనాటి విశ్వాసాలను శాశ్వత సత్యాలుగా పట్టు కుని ప్రాకులాడడం అవివేకం కాదా ? మన పూర్వులు ఆనాటి తమ పరిమిత విజ్ఞానం ఆధారంగా తమ విశ్వాసాలను సృజించుకున్నారు. వాటికి ఈనాటి వైజ్ఞానిక పురో గతితో పొసగదు. వాటిని ప్రక్కకునెట్టి, ఈనాటి శాస్త్రీయ విజ్ఞానానికి తగు కొత్త విశ్వాసాలను సృజించుకోవాలి. ఒక నూతన దృక్పథాన్ని- కేవలం తాను, తన భూమి సర్వసృష్టికి కేంద్రమన్న విశ్వాసాన్ని విడనాడి—మానవుడు పెంపొందించుకోవాలి. విజ్ఞానశాస్త్ర విస్తరణపై ఆధారపడిన నూత్న మతాన్ని, నూత్న వేదాంతాన్ని సృజించు కుని తాను సయితం పురోగమించాలి.

(ఫిబ్రవరి 18, 1968)

# గోర్కీ శతజయంతి

సరిగా నూరేళ్ళ క్రిందట ఈనాడు రష్యాలో ఒక మహా రచయిత జన్మించాడు. ఆయన పేరు మాక్సిం గోర్కీ.

19వ శతాబ్దంలో జార్ చక్రవర్తుల నిరంకుశ పాలన క్రింద క్రుగ్గిపోతున్న

రోజులలో రష్యా ప్రపంచానికి పెక్కు మంది మహా రచయితలను ప్రసాదించింది. టాల్‌స్టాయ్, దాస్తొయెవ్‌స్కీ, చెకోవ్‌ల పేరు జగత్ప్రసిద్ధమైనవి. వారి కోవకు చెందిన వాడే గోర్కీ.

సరైన విద్యాభ్యాసానికి కూడా అవకాశంలేని అట్టడుగు తరగతిలో నిరుపేద కుటుంబంలో గోర్కీ జన్మించాడు. స్వయం కృషిచేత విద్యా విజ్ఞానాలు సముపార్జించుకుని తన ముప్పదవ ఏటికే గోర్కీ విశ్వ విఖ్యాతుడయినాడు. ఆయన జీవితం అద్భుతావగాహంగా వుంటుంది. చిన్న తనంలో తాను పడిన కష్టాలను, తాను చేపట్టిన రకరకాల హీన వృత్తులను, తాను గడిపిన హేయ జీవితాన్ని వర్ణిస్తూ ఆయన వ్రాసిన స్వీయ చరిత్ర ప్రపంచ సాహిత్యంలో శాశ్వత స్థానం సంపాదించుకుంది.

ఆయన సాహిత్య సృష్టి విస్తారమయింది. కథలు, నవలలు, నాటకాలు అసంఖ్యాకంగా రచించాడు. వాటిలో ఒక వంక ఆనాటి రష్యాలోని దుర్భర జీవిత పరిస్థితులను చిత్రిస్తూనే, తన మానవ వాదాన్ని, ఆశావాదాన్ని ఆయన సముజ్వలంగా వ్యక్తం చేశాడు. రష్యాలో బోల్షివిక్కుల నాయకత్వాన జరిగిన విప్లవం పట్ల ఆయన సానుభూతి చూపి దానికెన్నో విధాలుగా తోడ్పడ్డాడు. ఆ రోజులలో రష్యన్ ప్రజలలో విప్లవ చైతన్యం కలిగించడంలో ఆయన రచన లెంతో ప్రముఖ పాత్ర వహించాయి.

ఆయన సాహిత్యంలో కొంత ప్రచారాత్మక మైనది వున్నా, హెచ్చు భాగం శాశ్వతమయిన విలువ కలిగినది వుంది. అందుచేతనే ఆయన దేశదేశాల సాహితీ ప్రియులకు అభిమాన పాత్రుడయినాడు. ఆయన స్మృతి పట్ల గౌరవ సూచకంగా ఇండియా ప్రభుత్వం కూడా ప్రత్యేకంగా తపాలా బిళ్ళను ముద్రించడం ఎంతయినా సముచితంగా వుంది.

(మార్చి 28, 1968)

# హెలెన్ కెల్లర్

ఏ ఒక్క అవయవం కొరవడినా, ఏ ఒక్క జ్ఞానేంద్రియం లోపించినా, మానవుడు పరిపూర్ణ జీవితం అనుభవించ లేడు. కాగా హెలెన్ కెల్లర్‌కు ఒక్క తీరున కాదు, మూడు విధాలుగా అంగ వైకల్యం సంభవించింది.

జీవితం సగం చెల్లిపోయిన తరువాత కాదు, శైశవంలోనే—19 నెలల లేత వయస్సులోనే—ఆమెకు ఏదో తీవ్ర రుగ్మతవల్ల చూపు పోయింది, మాట పడి పోయింది, వినికిడి కూడా పోయింది.

ఈ మూడింటిలో ఏ ఒక్కటి సంభవించినా జీవితం దుఃఖ భాజనమే అవు తుంది. కాగా ఈ మూడు లోపాలను అధిగమించి ఆమె పరిపూర్ణమయిన జీవితాన్ని

అనుభవించింది. లోకోత్తరమయిన కీర్తి గడించింది. మొన్న తన 87వ ఏట నిర్యాణం చెందింది.

అయిదవ ఏడు వచ్చే వరకు ఆమె జీవితం ముప్పాతిక మూడు పాళ్ళు అంధకార బంధురం. అప్పుడు యాన్ సలివాన్ అనే ఉపాధ్యాయిని సాహచర్యం ఆమెకు లభించింది. క్రమంగా మాట నేర్చుకుంది. కాని బధిరత్వం, అంధత్వం మిగిలిపోయాయి.

యాన్ సలివాన్ తోడ్పాటుతో హెలెన్ కెల్లర్ స్పర్శ ద్వారా మాటలు వినడం నేర్చుకున్నది. బ్రెయిల్ లిపి ద్వారా మాటలను చదవడం నేర్చుకున్నది. ఆ విధంగా ఆమె బధిరత్వం, అంధత్వాలను కూడా జయించింది.

ఇందులో కూడా విశేషం లేదు. ఆమె తన వ్యక్తిగత విజయం ఫలితాలను ప్రపంచానికి, లక్షలాది బధిరాంధ వికలాంగులకు అందివ్వడానికి తన యావజ్జీవితాన్ని ధార పోసింది. పెక్కుసార్లు యూరప్, ఆసియా దేశాలలో పర్యటించి ఉపన్యాసాల ద్వారా, వికలాంగుల సముద్ధరణ కృషి ద్వారా మానవ సేవ చేసింది. స్వీయ జీవితానుభవాలను ఎన్నో గ్రంథాల ద్వారా ప్రపంచానికి చాటి చెప్పింది.

లోకంలో కొందరు అదృష్టవంతులుగా పుట్టవచ్చు. మరి కొందరు దురదృష్టవంతులుగా జన్మించవచ్చు. కాని, దురదృష్టవంతులు జీవితాంతం దుఃఖిస్తూ కూర్చోనక్కరలేదు. మానవుడు ఆత్మశక్తిచేత జయించలేని, అధిగమించలేని దురదృష్టం లేదు. కావలసిందల్లా దృఢ దీక్ష, భవిష్యత్తుపై అచంచల విశ్వాసం, జీవితంపై ఆశ.

వైద్యశాస్త్రం ఈనాడు ఎంతగానో పురోగమించింది. వైద్యులు ఒక గుండెకు బదులు మరొక గుండెను అమరుస్తున్నారు. కొత్త ఊపిరితిత్తులను, కొత్త మూత్రపిండాలను కొత్త లివర్‌ను పాత వాటి స్థానంలో అమర్చుతున్నారు. ఇవన్నీ అద్భుతావహమైనవే. కాని, ఎంత ఘన వైద్యులైనా మానవునికి దీక్ష, ధైర్యం, విజిగీష వంటి ఉత్తమ గుణాలను రక్తంలోకి ఎక్కించలేరు. వాటిని ఎవరికి వారు సమకూర్చుకోవలసిందే. హెలెన్ కెల్లర్ వంటి అద్భుత వ్యక్తుల జీవితోదాహరణలు ఇందుకు ఎంతైనా సహాయపడతాయి. ఆమె ధీరోదాత్త చరిత్ర, దుఃఖిత మానవ జాతికి ఆశాజ్యోతి. ఆమె జీవిత కథ చిరస్మరణీయం.

(జూన్ 4, 1968)

# మహాకవి స్మృతికి అపచారం

రాజకీయంగా ఇండియాతో పాకిస్తాన్‌కు విభేదాలుండవచ్చు; శత్రుత్వం వుండ వచ్చు. కాని, వాటిని సాంస్కృతిక రంగానికి కూడా విస్తరించడం ఏమి వివేకం?

పాకిస్తాన్ అనుసరిస్తున్న టాగోర్ వ్యతిరేక విధానం ఇండియాపై కక్షతోనే కావచ్చు. కాని టాగోర్ స్మృతికి అపచారం చేయడంవల్ల పాకిస్తాన్ టాగోర్ స్మృతికి అపకారమేమీ చేయలేకపోగా తనకు తానే అపకారం చేసుకుంటున్నది. తన ప్రతిష్ఠనే పాడు చేసుకుంటున్నది.

కొన్నాళ్ళక్రితం పాకిస్తాన్ రవీంద్రనాథ్ టాగోర్ కవిత్వాన్ని తన రేడియో ద్వారా ప్రసారం చేయరాదని నిషేధించింది. తూర్పు పాకిస్తాన్‌లో ప్రధాన భాష బెంగాలీ. ఆ భాష ద్వారా తూర్పు పాకిస్తానీలకు పశ్చిమ బెంగాల్‌తో, ఇండియాతో వున్న అనుబంధాన్ని త్రెంచివేయాలని పాకిస్తాన్ పాలకుల ఆలోచన. దీనిలో భాగం గానే టాగోర్ గీతాలపై ఆంక్ష.

నిజానికి, టాగోర్ ఇండియాకు మాత్రమే చెందిన కవికాడు. ఆయన అవిభక్త భారతదేశంలోనే జన్మించాడు. అవిభక్త భారతదేశంలోనే కన్నుమూశాడు. అందుచేత ఆయన ఇండియా, పాకిస్తాన్‌లు రెండింటికి చెందిన మహాకవి. ఆయన కీర్తించిన బంగారు బెంగాల్ - సోనార్ బాంగ్లా - ఇండియాలోనే కాదు, పాకిస్తాన్‌లో కూడా వున్నది. ఆయన వర్ణించిన నదులు, పల్లెలు, పొలాలు, రమణీయ ప్రకృతి భారతదేశం సొత్తు మాత్రమే కావు. అవి పాకిస్తాన్‌కు చెందినవి కూడా.

కాగా, ఆయనను ఇండియాతోపాటు, ఉర్దూ మహాకవి ఇక్బాల్‌తోపాటు పాకిస్తాన్ తమ జాతీయ కవిగా గౌరవించడం ధర్మం. అది లేకపోగా ఆయన స్మృతికి అపచారం చేయడం ఎంతైనా బాధ కలిగించగల విషయం.

తూర్పు పాకిస్తాన్‌లోని షాహజాద్‌పూర్‌లో టాగోర్ నివసించిన చరిత్రాత్మక గృహాన్ని పాకిస్తాన్ రెవిన్యూ కార్యాలయానికి, తపాలా కార్యాలయానికి వినియోగిస్తున్నదట. దాని పైకప్పు కూలిపోయే స్థితిలో వున్నదట. దానిలో టాగోర్‌కు చెందిన కళాత్మక వస్తువులు, ఇతర సామగ్రి శిథిలావస్థలో వున్నవట.

ఆధునిక భారతదేశంలో టాగోర్ వంటి మహాకవి మరొకడు జన్మించలేదు. ఆయన స్మృతి భారతీయులకే కాదు, పాకిస్తానీయులకే కాదు, అన్ని దేశాల వారికి పవిత్రమైనది. ఆయన కవిత, జీవిత వేదాంతం ఏ దేశానికి, ఏ కాలానికి పరిమితమైనవికాదు. ఆయనది విశ్వజనీన కవిత; సార్వకాలిక తాత్విక చింతన. ఆయనను ఇండియాకు చెందిన కవిగా పాకిస్తాన్ పరిగణిస్తున్నది కాబోలు.

ఒకవేళ ఆ విధంగా పరిగణించినా, ఆయన స్మృతి చిహ్నాలను ఇలా నిర్లక్ష్యం చేయడం తగనిదే. మహాపురుషులు నివసించిన గృహాలను, వారు ఉపయోగించిన వస్తువులను అమూల్యమైనవిగా పరిగణించడం, భావితరాలవారి కొరకు వాటిని భద్రపరచడం సభ్యదేశాల వారందరు చేసేపని. అందులో మరొక దేశానికి చెందిన మహావ్యక్తి అయితే మరింత భద్రంగా వాటిని కాపాడాలి. పాకిస్తాన్ ప్రవర్తన ఇందుకు విరుద్ధంగా, సంకుచిత భావ ప్రేరితంగా వుండడం ఎంతైనా శోచనీయం. ఇండియా ప్రభుత్వం తానైనా ఈ విషయమై శ్రద్ధవహించి పాకిస్తాన్ ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి టాగోర్ స్మృతి చిహ్నాలను భద్రపరచడానికి తగుచర్యలను గైకొనడం అవసరం.

(జూలై 30, 1968)

# అపర భగీరథుడు

ఆయన తెలుగువాడు కాదు, భారతీయుడైనా కాదు; శ్వేత జాతీయుడు; పైగా భారత వర్షాన్ని తన బానిస దేశంగా పరిపాలించిన బ్రిటిష్ జాతికి చెందినవాడు.

అయినా, తెలుగుజాతికి ప్రాతఃస్మరణీయుడైన వ్యక్తి, పేరు చెప్పి దీపం

పెట్టుకోదగు వ్యక్తి ఎవరైనా వుంటే ఆయన సర్ ఆర్థర్ థామస్ కాటన్. ఏ తెలుగు వాడు, ఏ భారతీయుడు చేయలేని మహోపకారాన్ని ఆయన తెలుగు దేశానికి చేసి పోయాడు. కృష్ణా, గోదావరులనే "ఆకాశగంగలను" తమ పొలాలలోనికి ప్రవహింప జేసిన అపర భగీరథుడుగా, "జీవన" దాతగా ఆయన పేరు తెలుగువారు కలకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు.

తెలుగువారేకాదు, తమిళులు, ఒరియాలు, బెంగాలీలు, బిహారీలు మొత్తం భారతీయులే ఆయనకు శాశ్వత ఋణగ్రస్తులు. ఇంజనీర్లు ఎందరైనా వున్నారుకాని, ఆయన తనకు తానే సాటి. ఆయన కేవలం ఇంజనీరు మాత్రమే కాదు, మహాద్రష్టగా ఆయన్ని వర్ణించాలి. ఆయన దృష్టి కృష్ణా, గోదావరీ, కావేరీ నదులకే పరిమితం కాలేదు. మొత్తం భారతీయ నదులన్నిటిపై ఆయన సమ్యక్ దృష్టి ప్రసరించింది. వాటిని కాల్వలతో కలిపి మొత్తం దేశానికి జలమార్గాలను సృష్టించడమే కాదు; బ్రహ్మపుత్ర నుంచి కాలువ త్రవ్వి యాంగ్‌జీ నదితో కలిపి ఇండియా, చైనాలను జలమార్గాలతో ఏకీకరించాలన్న మహాస్వప్నాన్ని ఆయన తన భావనావీధిలో తిలకించాడు. అంతటి విశాలదృక్పథం ఆయనది.

ఆయనది పరిపూర్ణ జీవితం. 1803 మే 15 వ తేదీన ఆయన జన్మించే నాటికి ఇండియా కరవు కాటకాలకు నిలయంగా వుండేది. 1819 లో ఆయన మద్రాసు ఇంజనీరింగ్ సర్వీసులో చేరాడు. 18 8లో తన 25వ ఏట తన జీవితానికి చరితార్థతని చేకూర్చిన మహాకృషిని ప్రారంభించాడు. 1836-38 సంవత్సరాలలో కొలెరూన్ నదిపై ఆనకట్టలు నిర్మించాడు. వాటితో తంజావూరు జిల్లా మద్రాసు రాష్ట్రంలోనే కాక, యావద్భారత దేశంలోనే ధనధాన్య సమృద్ధికి ప్రథమ స్థానం పొందింది. ఆ తర్వాత 1847-52 సంవత్సరాలలో గోదావరిపై ధవళేశ్వరం వద్ద ఆనకట్టను పూర్తిచేశాడు. క్షామ పీడితమైన గోదావరిజిల్లా సస్యశ్యామలమై కలకల లాడింది. తగ్గిపోతున్న జనసంఖ్య మూడురెట్లు పెరిగింది. ఆదాయం రెండున్నర రెట్లు పెరిగింది. ఆరు లక్షల ఎకరాల భూమి సాగు క్రిందికి వచ్చింది. (ఇప్పుడిది రెట్టింపుకు పెరిగింది) ఈ మహాకార్యాన్ని ఆయన ఆధునిక ప్రమాణాల దృష్టితో చూచినా ఆశ్చర్యమనిపించే విధంగా కేవలం అయిదేళ్ళలో పూర్తి చేశాడు. దానికి అయిన అంచనా వ్యయం ఆరు లక్షల పౌన్లు; అది ఈనాటి మారకం రేటుతో పోల్చి చూచినా 126 లక్షల రూపాయలు మాత్రమే.

కృష్ణా నదిపై విజయవాడ వద్ద ఆనకట్టకు ప్రోద్బలం కూడా కాటన్‌దే. దాని నిర్మాత కాటన్ అసిస్టెంటు కెప్టెన్ ఆర్. అయినా కాటన్ ఒత్తిడి, మార్గదర్శకత్వం లేనిదే కృష్ణ ఆనకట్ట నిర్మాణం జరిగేదికాదు. ఇంతేకాక, ఆయన బెంగాల్, ఒరిస్సా, బిహార్ మొదలైన ప్రాంతాల నదులను మానవోపయోగ్యం చేయడానికి ఎన్నో పరిశోధనలు, పరిశీలనలు చేశాడు.

అయితే, ఇదంతా ఆయనకు సులభసాధ్యమైన దనుకోవడం పొరపాటు. ఎన్నో అవాంతరాలు ఎదురైనాయి. ఆయన కృషికి అడుగడుగున అవరోధాలే. ఆయన ఇరిగేషన్ పథకాలను మద్రాసు ప్రభుత్వం తీవ్రంగా వ్యతిరేకించింది. వాటిని చేపట్టడానికి తూర్పు ఇండియా కంపెనీని ఒప్పించడంలో ఆయన ఎంతో శ్రమపడ వలసి వచ్చింది. ఈ శ్రమలో ఆయనకు "లేడి ఆఫ్ ది ల్యాంప్"గా చరిత్ర ప్రసిద్ధి కెక్కిన ఫ్లారెన్స్ నైటింగేల్ ఎంతో సహాయ పడింది. కంపెనీ ప్రభుత్వం తన విముఖతను త్యజించడానికి ఆమె కృషి కూడా తోడ్పడింది. కాటన్ పథకాలను మొదట తూష్ణీకరించిన మద్రాసు ప్రభుత్వం చివరికి ఆయనను "మాస్టర్ మైండ్"గా అభివర్ణించింది. 1861లో బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను "సర్" బిరుదంతో గౌరవించింది.

కాటన్ సుమారు నలభై సంవత్సరాలు ఎన్నో కష్టనిష్ఠురాలకు లోనై ఇండియాలో శ్రమించి రిటైరయ్యాడు. ఆ తర్వాత సుమారు మరొక నలభై సంవత్సరాల పాటు ఆయన ఇంగ్లండులో విశ్రాంతిగా జీవితం గడిపాడు. అయినా, 1899 జూలైలో కడసారి కన్ను మూసేవరకు ఆయన ఆలోచనలన్నీ ఇండియాపై, దాని నదులపై, కాల్వలపై, పొలాలపై, దాని ప్రజల సుఖసౌభాగ్యాలపై కేంద్రీకృతమై వుండేవి. ఇండియాలో వ్యవసాయాభివృద్ధికి దాని నదులను ఉపయోగానికి తేవడం గురించి ఇంతగా ఏ భారతీయుడు ఆలోచించి వుండడు. తాను పాలకజాతికి చెందిన వాడనన్న అహంకారం ఆయనలో కంచుకాగడా వేసి వెతికినా కనబడదు. ఇండియాపై, దాని ప్రజలపై ఆయనకున్న ప్రగాఢానురాగం ఏ భారతీయుని దేశభక్తికి తీసిపోనిది.

ఈ వాక్యాలు అతిశయోక్తులని భావించే వారెవరైనా వుంటే "ఇరిగేషన్ వర్క్స్ ఆఫ్ ఇండియా" అనే ఇంగ్లీషు గ్రంథాన్ని పరిశీలించవచ్చు. ఇది ఇటీవలనే వెలువడింది. 1874వ సంవత్సరం డిసెంబరు 10-14-17 తేదీలలో సర్ ఆర్థర్ ఛాతామ్‌లోని బ్రిటిష్ మిలిటరీ ఇంజనీరింగ్ ఇన్‌స్టిట్యూట్ సమావేశంలో చేసిన

మూడు ప్రసంగాలు ఇందులో వున్నాయి. ఇవి ఇంతవరకు ప్రచురణ కాకుండా మరుగున పడి వున్నాయి. వీటిని ప్రముఖ రాజకీయవాది పార్లమెంటు మాజీ సభ్యుడు (నర్సాపురం) శ్రీఉద్దరాజు రామం సేకరించి చక్కని ఉపోద్ఘాతంతో, కాటన్ జీవిత సంగ్రహంతో సహా ప్రచురించారు. ఇందుకు వారిని తెలుగువారు మనసారా అభినందించాలి.

ఈ ప్రసంగాలలో సర్ ఆర్థర్ ఇంజనీరింగ్ పరిజ్ఞానం. ఆయన భావుకత, భావావేశం విస్ఫుటంగా కనిపిస్తాయి. ఇండియాను ఆయన తన మాతృదేశం కంటె అధికంగా ప్రేమించాడా అని కొన్ని వాక్యాలలో అనిపిస్తుంది. లేకపోతే, ఇండియాకు ప్రకృతి ప్రసాదించిన అసంఖ్యాక నదులను, వాటి జలాలను, భారతీయుల సుఖ సౌభాగ్యాల కోసం వినియోగానికి తేవాలని ఆయన అణా పైసలతో సహా లెక్కకట్టి హేతు యుక్తంగా, ఇంతగాఢాభినివేశంతో బ్రిటిష్ ప్రభుత్వానికి నచ్చచెప్పడానికి ఎందుకు శ్రమపడతాడు? ఇండియా కరువులతో, కాటకాలతో నాశనమైతే ఆయనకేమి? వ్యక్తిగా ఆయనకేమి నష్టం? ఆయన భారతదేశ ప్రేమ ఆయన మహోన్నత మానవతకే నిదర్శనం.

"దీన్ని నా వ్యక్తిగత విషయంగా నేనెప్పుడూ భావించలేదు. ఈ వృద్ధాప్యంలో అట్టి భావనను అసలే దరి చేరనివ్వను. నేను ఏ ఉద్యోగాన్ని, మరి దేన్ని ఎన్నడు అర్థించలేదు. భారతదేశంలోని వ్యవసాయ క్షేత్రాలకు నీరు పారించే మహద్భాగ్యాన్ని నాకు కలిగించ వలసిందిగా మాత్రమే నేను మొదటి నుంచి కోరాను. నేను ఆస్తిని సంపాదించుకోలేదు....ఏ స్పెక్యులేషన్ వ్యాపారంలోనూ వాటా సంపాదించుకోలేదు. భారత దేశానికి ఈ ఒక్క విషయంలో సహాయ పడడమే నా కర్తవ్యంగా పెట్టుకున్నాను.... నా కృషి ఫలించింది...."

రిటైరై పోయిన తర్వాత 1878 లో కామన్స్ సభ సెలెక్టు కమిటీ ముందు సాక్ష్యం చెబుతూ సర్ ఆర్థర్ కాటన్ సగర్వంగా చెప్పుకున్న ఈ మాటలు స్వతంత్ర భారతానికి చెందిన మన ఇంజనీర్లు అంతే సగర్వంగా చెప్పుకో గలగాలి. భారతదేశం నుంచి క్షామపిశాచిని తరిమివేసి స్వయంపోషకం చేయవలసిన మహత్తర బాధ్యత వారిపైనే వున్నది. ఈ బాధ్యతా నిర్వహణలో వారికి సర్వదా అనుకరణీయుడు, ఆదర్శప్రాయుడు అయిన మహావ్యక్తి ఆర్థర్ కాటన్.

(సెప్టెంబరు 28, 1968)

# కారుణ్యమూర్తి

బౌద్ధ సిద్ధాంతాలకు మూలసూత్రం కారుణ్యం. గాంధీ సిద్ధాంతాలకు కూడా మూల సూత్రం కారుణ్యమే.

బౌద్ధ కారుణ్యం మానవకోటికే పరిమితమైనది కాదు; సకల చరాచర జగత్తుకు విస్తరించినట్టిది. గాంధీజీ కారుణ్య భావం కూడా అట్టిదే.

బౌద్ధుల దేవతా పరంపరలో అవలోకితేశ్వరు డొక బోధిసత్త్వుడు. జగత్తు సమస్తాన్నీ కరుణా పూరిత వీక్షణాలతో అవలోకిస్తూ వుంటాడు కనుక ఆ బోధిసత్త్వునికి అవలోకితేశ్వరుడనే పేరు వచ్చింది. "నీవు చేసిన పుణ్యకార్యాలకు నీకు నిర్వాణం ఇవ్వనున్నా"మని దేవతలు అవలోకితేశ్వరునికి చెప్పారట. ఆయన దాన్ని తిరస్కరిస్తూ "ఈ విశ్వంలో చిట్ట చివరి అణువునకు సయితం నిర్వాణం సిద్ధించే వరకు నాకు నిర్వాణం అక్కరలేదు" అన్నాడట.

బౌద్ధ పురాణ గాథలలోని అవలోకితేశ్వరునితో పోల్చదగిన మహా వ్యక్తి గాంధీజీ. ఆయన కారుణ్య భావం సమస్త విశ్వానికి ప్రసరించింది. దానికి స్వదేశీయులు, పరదేశీయులు, ధనికులు, పేదలు, బలవంతులు, దుర్బలులు అనే భేదం లేనే లేదు. ఆయన అందరినీ సమానంగా ప్రేమించాడు. అయితే ఆయన కృషి ఎక్కువగా సంఘ వంచితులపట్ల, దీనులపట్ల, తాడితులు, పీడితుల పట్ల జరిగింది. అది సహజం కూడా.

తాను లోకంలోని దరిద్ర నారాయణుల ప్రతినిధినని ఆయన స్వయంగా చెప్పుకునేవాడు. తనకు పునర్జన్మ కలిగితే హరిజనుడుగా జన్మించ గోరుతానని కూడా ఆయన చెప్పుకునే వాడు.

మహత్తరమైన ఈ మానవతా వాదం గాంధీజీకి కేవలం ఒక ఆదర్శం మాత్రమే కాదు; సిద్ధాంతపరమైన విశ్వాసం మాత్రమే కాదు. ఆయన తాను జీవితంలో

ఆచరించ లేనిది, ఆచరించనిది చెన్ని ఇతరులకు బోధించేవాడు కాదు. తనపై, తన జీవితంపై ముందుగా ప్రయోగించుకున్న తరువాత మాత్రమే ఆయన ఏదైనా ఒక సిద్ధాంతంగా, ఇతరులకు ఆచరణీయంగా ఉపదేశించే వాడు. అందుచేతనే ఆయన ఉపదేశాలన్నీ జీవద్విశ్వాసాలుగా విలసిల్లాయి.

గాంధీజీ కాదలచుకుంటే మహాభోగి కాగలిగిన వాడే కాని, కోరి కోరి ఆయన దారిద్ర్యాన్ని వరించాడు. తన దేశంలో అధిక సంఖ్యాకులు దారిద్ర్య పీడితులై వుండగా తాను భోగ భాగ్యాలనుభవించడానికి ఆయన నిరాకరించాడు. ఇతరుల దారిద్ర్యాన్ని ఆయన పంచుకోగోరాడు. ఇందుకే ఆయన కొల్లాయి గుడ్డను మాత్రం ధరించి, బాహ్యాడంబరా లన్నిటిని విసర్జించాడు. ఎక్కడకు వెళ్ళినా భంగీ కాలనీలో నివసించేవాడు; భంగీ పని సయితం చేసేవాడు. అవలోకితేశ్వరుని వలె అందరి సముద్ధరణ అయిన తర్వాతనే తన సముద్ధరణ అని ఆయన విశ్వసించేవాడు. తన ఆశ్రమంలో ఒక కుష్ఠు రోగికి స్వయంగా పుళ్ళు కడిగి, ఉపచర్యలు చేసి, సాంత్వన వచనాలు చెప్పి ప్రబోధం కలిగించిన ఆ మహిమాన్విత కారుణ్యమూర్తిని పోల్చవలసింది గౌతమ బుద్ధునితోనే, ఏసుక్రీస్తుతోనే.

గాంధీజీ శత జయంత్యుత్సవాలు ప్రారంభమైన ఈ తరుణంలో ఆయన జీవితంలో పరమోత్కృష్ట స్థానం ఆక్రమించిన ఈ కారుణ్య భావాన్ని మనం మననం చేసుకోవడం అవసరం. ఆయన శత జయంత్యుత్సవాలు ఈ ఏడాది పొడుగునా మహా సంరంభంగా జరుగుతాయి. ఆయన పేరు కొన్ని వందల, వేల, సార్లు మనంవిన బోతున్నాము. ఆడంబరాలతో, అట్టహాసంగా జరిగే ఆయన నామస్మరణ వెనుక ఆయన ఉపదేశాలు, వాటి ఆచరణ ప్రాధాన్యం మరుగున పడిపోయే ప్రమాదం వున్నది. ఈ ప్రమాదం నుంచి మనల్ని మనం కాపాడుకోవాలి. ఆయన ఉపదేశాల ఆవశ్యకత ఆయనతోనే అంతరించలేదని, వాటిని మన నిత్య జీవితాలలో అనుసరించ వలసిన అగత్యం కలదని మనం గుర్తు పెట్టుకోవాలి.

భారతదేశ సముద్ధరణ, దాని అభ్యుదయం దాని ప్రజల-ముఖ్యంగా అధిక సంఖ్యాకులైన "దరిద్ర నారాయణుల"—సముద్ధరణ కంటె, అభ్యుదయం కంటె వేరు కాదు. ఆ సముద్ధరణ, అభ్యుదయాల సాధనకు మనల్ని మనం పునరంకితులం చేసుకున్నప్పుడే గాంధీజీ శత జయంతి పేరిట నేడు ప్రారంభమైన మహోత్సవాలకు సార్థక్యం.

(అక్టోబర్ 3, 1968)

# సత్యమూర్తి

గాంధీజీ తన ఆత్మకథకు పెట్టిన పేరు "ది స్టోరీ ఆఫ్ మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్"– "సత్యంతో నేను చేసిన ప్రయోగాల కథ."

ఆయన జీవితమంతా సత్యాన్వేషణతో గడిచింది. విభిన్న సందర్భాలలో

విభిన్న సన్నివేశాలకు సత్యాన్ని అన్వయించడానికి చేసిన ప్రయోగాలతోనే గడిచింది. ఆ కారణంగా ఆయన మూర్తీభవించిన సత్యమే అయినాడు.

గాంధీజీ దృష్టిలో సత్యం వేరు, దైవం వేరు కాదు. రెండూ ఒక్కటే. సత్యాన్వేషణ ప్రారంభించిన తొలి దినాలలో ఆయన "దేవుడే సత్యం" అని విశ్వసించినాడు. రాను రాను ఆయన సత్యమే దేవుడు అని విశ్వసించడం ప్రారంభించాడు.

ఈ రెండు నిర్వచనాలకు ఒక సూక్ష్మభేదం వుంది. మొదటిదానిలో దేవుడనే వాడొకడున్నాడని, ఆయన అనంత గుణాలలో సత్యం ఒకటని, ఆయన సత్య స్వరూపమని ఒక విశ్వాసం వున్నది. రెండవ దానిలో సత్యాన్ని మించిన, సత్యానికి భిన్నమైన దైవం మరి లేదన్న నమ్మిక వున్నది. ఈ రెండవ నిర్వచనాన్ని నాస్తికులు (ఎథీయిస్టులు), అజ్ఞేయవాదులు (ఎగ్నాస్టిక్స్) కూడా నిరభ్యంతరంగా ఆమోదించవచ్చునని గాంధీజీ చెప్పేవాడు. "తదేతత్ సత్యం" అన్న ఉపనిషద్వాణికి కూడా ఇది భిన్నమైనది కాదు.

సత్యదర్శనం కోసం తన జీవితకాలమంతా వినియోగించినా, గాంధీజీ తాను సఫల మనోరథుడైనట్లు చెప్పుకోలేదు. ఆయనకు సత్యంపై, దానికి మరొక పేరైన దైవంపై ప్రగాఢ విశ్వాసం వున్నది. జీవితమంతా నైతిక నిష్ఠతో గడిపాడు. ప్రతి నిత్యం ప్రార్థనతో గడిపాడు. రామనామాన్ని అనవరతం జపిస్తూ వుండేవాడు. అయినా, ఆయన తాను సత్యాన్ని గాని, దైవాన్ని గాని దర్శించ గలిగినట్లు చెప్పుకో లేదు. తాను దేవుడిననో, దేవుని అవతారమనో చెప్పుకోలేదు.

తాను సాధకుడినని, సత్యసంశోధకుడినని మాత్రమే ఆయన తుదివరకు చెప్పుకునేవాడు. ఆయనకు మహాత్మతను సిద్ధింపచేసిన గొప్పలక్షణాలలో ఈ వినయ గుణం ఒకటి. సత్యాన్వేషికి వుండవలసిన మొదటి గుణమే వినయమని ఆయన పెక్కుసార్లు పేర్కొన్నాడు.

అయితే సంపూర్ణ సత్యాన్ని దర్శించడం మానవుడికి సాధ్యం కాదని, సాపేక్ష సత్యాన్ని మాత్రమే అతడు దర్శించ గలడని కూడా ఒక సందర్భంలో గాంధీజీ అన్నాడు. సత్యసందర్శనం ఇంత దుర్లభమైనప్పటికి దానికై అన్వేషణ మాత్రం మానవుడు విడనాడరాదని ఆయన ప్రబోధించాడు.

ఒకసారి ఆయన మైసూరులో నందిహిల్స్‌పై వుండగా ఒకరు "మీరు దేవుని చూశారా?" అని ప్రశ్నించారు. దానికి ఆయన "నేను దేవుని చూడలేదు. కాని, ఆయన వున్నాడనే నా విశ్వాసం. మైసూరు మహారాజాను ఆయన ప్రజలలో చాలా మంది చూచివుండరు కాని, అంతమాత్రాన మైసూరు మహారాజా లేడని వారు నమ్ముతారా?" అని. సరిగా ఇవే పలుకులలో కాకపోయినా ఆయన సమాధాన మిచ్చాడు.

సంపూర్ణ సత్యాన్ని దర్శించడం మానవునికి సాధ్యం కాకపోయినా, దాన్ని చిత్తశుద్ధితో విశ్వసించడంలోనే, దానిని అన్వేషించడంలోనే మానవుడు ఉన్నతుడు కాగలడని గాంధీజీ నమ్మకం.

భారత స్వాతంత్ర్య సమరంలో గాంధీజీ సత్యాన్ని తన ఆయుధంగా చేపట్టాడు. కనుకనే తన ఉద్యమానికి సత్యాగ్రహమని పేరుపెట్టాడు. దీనికి వ్యతిరేక మైనది దురాగ్రహంగా ఆయన పేర్కొనేవాడు. స్వాతంత్ర్య సాధన కోసం పోరాటం అవసరమే, ఆగ్రహం అవసరమే. అయితే అది అసత్యం పట్ల ఆగ్రహమై వుండాలి; అప్పుడే అది సత్యమైన ఆగ్రహం, సత్యం కొరకు ఆగ్రహం అవుతుంది. అది కానిది దురాగ్రహ మవుతుంది.

గాంధీజీ స్వాతంత్రోద్యమ కాలంలో తన సత్యాగ్రహాయుధాన్ని జయప్రదంగా ప్రయోగించాడు. దానితో ఆనాడు కోట్లకొలది భారతీయులు ఉత్తేజితులయ్యారు, ఆ సత్యాగ్రహ లక్ష్యం మహత్తరమైనది. దాన్ని ప్రయోగించినవాడు అచ్చమైన సత్యాన్వేషి. ఈ సంగతి గుర్తించక ప్రతి స్వల్ప విషయానికి సత్యాగ్రహాయుధాన్ని దుర్వినియోగం చేయడం ఆయన తరువాతి కాలంలో జరిగింది. అదనెరిగి పదునెరిగి ప్రయోగించక పోవడం వల్ల, తాత్కాలిక, పరిమిత లక్ష్యాల కోసం ప్రయోగించడం వల్ల అది మొక్కవోయింది. అది నిస్వార్థుల ఆయుధం, నిర్భీకుల ఆయుధం, సత్యసంశోధకుల ఆయుధం. అది ఏనాటికైనా తాడిత, పీడిత మానవాళికి గాంధీజీ ప్రసాదించిన మహాయుధం.

(అక్టోబరు 4, 1968)

# ధర్మమూర్తి

వ్యక్తి సంఘంకంటె భిన్నుడు కాడు. సంఘం వ్యక్తికంటె భిన్నమైనది కాదు. వ్యక్తి జీవితం, సంఘ జీవితం పరస్పరాశ్రితాలు.

వ్యక్తి తనకుతాను నీతితో, నియమంతో ధర్మబద్ధుడై వుంటే చాలదు. సంఘం కూడా అట్టిదే కావాలి. అప్పుడుగాని వ్యక్తిగత నీతివర్తనకు పరిపూర్ణత లేదు.

ఈ దృష్టితో జీవితంలో, ముఖ్యంగా జాతి జీవితంలో నీతికి, ధర్మానుష్ఠానానికి గాంధీజీ విశేష ప్రాధాన్యమిచ్చారు. సంఘ జీవితంలోని ప్రతి స్వల్పాంశానికి నైతిక సౌశీల్యమే ఆధారం కావాలని విశ్వసించారు. నీతికి ఇంతగా ప్రాధాన్యమిచ్చిన ప్రజా నాయకుడు ప్రపంచ చరిత్రలోనే మరొకడు లేడేమో.

సాధారణార్థంలో రాజకీయాలు, నీతివర్తనం పరస్పర విరుద్ధాలు. నేతి బీర కాయలో ఎంత నెయ్యి వుందో రాజనీతిలో అంత నీతి వుంటుంది. సాధారణంగా కౌటిల్యం లేనిదే రాజకీయాలే లేవు.

రాజకీయాలలో సచ్ఛీలానికి, సన్మార్గానికి, సత్సాధనాలకు ప్రాధాన్య మివ్వడానికి గాంధీజీ యత్నించారు. మనం సాధించగోరిన లక్ష్యం మంచిదైనంత మాత్రాన చాలదు. దాన్ని సాధించడానికి మనం వినియోగించే సాధనాలు కూడా మంచివై వుండాలి. రాజకీయ రంగంలో నైతిక సూత్రాల అవలంబనం కోసమే మథనపడిన రా[illegible]న్ చక్రవర్తి, మార్కస్ అరీలియస్ వంటి వారు—కొందరు ప్రాచీన కాలంలో [illegible]లేదు. కాని, వారికంటె మిన్నగా, విశిష్టంగా, నైతికసూత్రాలకు విస్తృత [illegible]న అద్వితీయ మహాపురుషుడు గాంధీజీయే.

[illegible] మంచిదైతే సాధనాలు ఎట్టివైనా పరవాలేదన్న వాదం ఒకటి ఎప్పుడూ [illegible]హరణకు దేశస్వాతంత్ర్యం మన లక్ష్యమైతే, దాన్ని సాధించడానికి

[illegible]

హింసామార్గాన్ని అనుసరించినా, లేదా ఎట్టి మాయోపాయాలను, కుతంత్రాలను అవ లంబించినా తప్పులేదని ఈ వాదాన్ని విశ్వసించేవారు భావిస్తారు. దీన్ని గాంధీజీ పూర్తిగా వ్యతిరేకించాడు. లక్ష్యంతోపాటు సాధనం కూడా పవిత్రమైనది, ధర్మబద్ధ మైనది కావాలని ఆయన విశ్వాసం. కనుకనే ఆయన భారత స్వాతంత్ర్య సాధనకు హింసకాక అహింసా మార్గమే అవలంబనీయమని భావించి, తాను నడిపిన ప్రతి ఉద్యమాన్ని అహింసావలంబకంగా చేశాడు. సాధనం అపవిత్రమైనదైతే లక్ష్యం కూడా అపవిత్రంగా మారిపోతుందని ఆయన విశ్వాసం.

గాంధీజీ లండన్‌లో న్యాయవాద విద్యను అభ్యసించే కాలంలో బ్రిటిష్ రాజ కీయాలలో గ్లాడ్‌స్టన్ ప్రముఖ వ్యక్తి. అతడు రాజకీయాలలో నచ్చీలానికి అత్యంత ప్రాధాన్య మిచ్చినవాడు. తన ఆత్మకథలో గాంధీజీ పేర్కొనలేదుగాని, గ్లాడ్‌స్టన్ రాజకీయ, వ్యక్తిగత, నచ్చీల ప్రభావం ఆయనపై అజ్ఞాతంగా వుండే వుండాలి. ఆ తర్వాత ఆయన రస్కిన్, టాల్‌స్టాయ్‌ల నైతిక సిద్ధాంతాల ప్రభావానికి కూడా లోనయ్యాడు. క్రైస్తవ నీతిసూత్రాలను పైనందిన వ్యక్తిగత జీవితానికే కాక, ఆర్థిక, రాజకీయ రంగాలకు కూడా అన్వయించాలని వారి సిద్ధాంతం. తనకు రాజకీయ గురు వుగా గాంధీజీ పేర్కొన్న గోఖలే నైతిక విశ్వాసాల ప్రభావం కూడా ఆయనపై విశే షంగా వున్నది.

యౌవనకాలంలో ఇన్ని సత్ప్రభావాలకు లోనై తన జీవితాన్ని తదనుగుణంగా మలచుకున్న గాంధీజీ తుదివరకు ఈ నైతిక సూత్రాలను అసిధారావ్రతంగా ఆచరించి చూపాడు. తన అనుయాయులచే అనుసరింపజేశాడు. ఆ కారణంగా ఆయన నిర్వ హించిన భారత స్వాతంత్ర్యోద్యమం ప్రపంచ చరిత్రలో అట్టి ఇతర ఉద్యమాలలోకెల్లా ఒక విశిష్టత పొందింది.

ఒక అర్ధశతాబ్దిగా గాంధీజీ మనకు నూరిపోసిన నైతిక సూత్రాలు ఆయన విష్క్రమించిన ఇంత స్వల్పకాలంలోనే ఏమైపోయినవో మనకు తెలిసిందే. గాంధీ జయంతినాడు తప్పితే వాటిని జ్ఞాపకమైనా చేసుకునే రాజకీయవేత్తలు నేడు ఒకరిద్ద రైనా కనబడతారో లేదో. గాంధీ శతజయంత్యుత్సవాల నిర్వహణ కిస్తున్న ప్రాధా న్యంలో ఒక శతాంశమైనా ఆయన సిద్ధాంతానుష్ఠానానికిస్తే మనదేశం, మన ప్రజా జీవితం ఈనాటి శోచనీయస్థితిలో ఒక్క క్షణమైనా మిగిలేదా?

(అక్టోబరు 5, 1968)

# శాంతమూర్తి

మానవుడు జంతుకోటి నుంచి పరిణామం చెందినవాడే. అందువల్ల జంతు [illegible], మానవులకు పశుమాత్ర ధర్మాలు కొన్ని వుండక తప్పదు. అవి శారీరకమైనవే కావు, మానసికమైనవి కూడా. అయితే, పశుపక్ష్యాదులకు లేని కొన్ని అధిక గుణాలు మానవునికి వున్నాయి. వీటిలో ముఖ్యమైనది వివేచనా శక్తి, ధర్మాధర్మ

విచక్షణ శక్తి. ఆ శక్తి వల్లనే అతడు తన జాంతవ లక్షణాలను — కనీసం వాటిలో అధిక భాగాన్ని - "సబ్లిమేట్" చేసుకోగలుగుతున్నాడు.

ఉదాహరణకు క్రోధం, ద్వేషం, భయం మొదలైన మనో వికారాలు మానవునికి, జంతువులకు సమానమే. వాటిని పూర్తిగా నూటికి నూరుపాళ్ళు జయించిన వాడు—ఎంత జితేంద్రియు డనిపించుకున్న వాడైనా - వుంటాడని మనం నమ్మనక్కరలేదు అది సాధ్యంకాని పని. అయితే, వాటిని నిరంతర సాధనవల్ల, అభ్యాసం వల్ల అదుపు చేయవచ్చు. అంతే కాదు; వాటిని మరొక ఉన్నత స్థాయికి తీసుకుపోవచ్చు; వాటిని "సబ్లిమేట్" చేయవచ్చు; లోక కళ్యాణానికే వాటిని సాధనాలుగా వినియోగించవచ్చు.

గాంధీజీ తన జీవితాన్ని ఈ కఠోర సాధనలోనే వెచ్చించాడు. తాను పూర్తిగా సఫలుడైనట్టు, క్రోధాది మనోవికారాలను పూర్తిగా జయించినట్టు ఎక్కడా చెప్పుకోలేదు. అయితే, వీటిని కేవలం మనోవికారాలుగా మాత్రమే మిగల్చక మానసిక శక్తులుగా పరివర్తింప జేయడానికి ఆయన యత్నించాడు. ఈ యత్నంలో తాను స్థూలంగా కృతకృత్యుడైనట్టే ఆయన చెప్పుకున్నాడు.

"నాకు ఆగ్రహం కలగదని చెప్పను. కాని, సహన గుణాన్నే క్రోధరాహిత్యంగా నేను అభ్యసించాను. ఇందులో స్థూలంగా నేను సఫలుడ నయ్యాను. నాకు క్రోధం కలిగినప్పుడు దాన్ని నేను నా అదుపులో పెట్టుకుంటాను." అని ఒక సందర్భంలో గాంధీజీ వ్రాశాడు.

వేడిని అదుపుచేసి శక్తిగా మార్చుకున్నట్టే, ఆగ్రహాన్ని అదుపుచేయడం వల్ల ఒక నూత్న శక్తి జనిస్తుందని ఆయన మరొకచోట వ్రాశాడు. ఆయన ప్రారంభించిన సత్యాగ్రహోద్యమాలు స్వాతంత్ర్య సమరంలో ఎంత శక్తిమంతమైన ఆయుధాలుగా పని చేసినవో మనకు తెలిసిందే.

ఆయనకు క్రోధం రాకపోలేదు; ద్వేషం లేకపోలేదు. కాని, ఆయన క్రోధం గాని, ద్వేషం గాని వ్యక్తులపై కాదు; వారిలోని దుర్గుణాలపైనే. బ్రిటిష్ వలస ప్రభుత్వంపై ఆయన చరిత్రాత్మకమైన మహోద్యమం నిర్వహించాడు. కాని, ఆ సంగ్రామం మహోధృతంగా సాగుతున్న సమయంలో కూడా ఆయన బ్రిటిష్ వారిని వ్యక్తులుగా ద్వేషించలేదు. వారి పరిపాలనను, వారి విధానాలను, వారి జాత్యహంకారాన్ని మాత్రమే ద్వేషించాడు. వాటిపైనే తన ఆగ్రహాన్ని ప్రసరింపాడు

ఈ విధంగా ఆయన మనోవీథిలో క్రోధ, విద్వేషాలు పరివర్తన చెందిన తర్వాత, అవి "సబ్లిమేట్" అయిన తర్వాత వాటిని క్రోధ, విద్వేషాలుగా పేర్కొనడానికే వీలులేదు.

ఆయనను "శాంతమూర్తి"గా లోకం కీర్తించడానికి ఇదే కారణం. "శాంతం" అనే పదంలోనే క్రోధం, ద్వేషం మొదలైన మనోద్రేకాలు "శమించిన" స్థితి అనే అర్థం ఉద్బుద్ధం అవుతున్నది. గాంధీజీ నిత్యపారాయణం చేసే గ్రంథాలలో భగవద్గీత ఒకటి. దానిలో ఆస్తిక్యానికి, పరతత్వానికి సంబంధించిన భాగాలపై ఎవరికెట్టి అభిప్రాయాలున్నా, వ్యక్తిగత నైతిక ప్రవర్తనకు సంబంధించిన వాటిపై భిన్నాభిప్రాయాలుండ వవసరం లేదు. స్థితప్రజ్ఞుని లక్షణాలను పేర్కొంటూ "వీత రాగ భయ క్రోధః స్థితధీర్ముని రుచ్యతే" అని గీత నిర్వచించింది. ఈ నిర్వచనాన్ని తన అనుదిన ప్రవర్తనలో జీర్ణించుకున్నవాడు గాంధీజీ.

"క్రోధాద్భవతి సమ్మోహః, స్సమ్మోహాత్ స్మృతి విభ్రమః"

స్మృతి భ్రంశాద్బుద్ధి నాశో బుద్ధి నాశాత్ప్రణశ్యతి"

— కోపంవల్ల అవివేకం కల్గుతుంది. అవివేకంవల్ల మతిభ్రమ కలుగుతుంది. మతిభ్రమవల్ల బుద్ధి నశిస్తుంది; బుద్ధినాశనంవల్ల తాను నశిస్తాడు — అని భగవద్గీత అనునయ పూర్వకంగా చెబుతున్నది. ఈ గీతా ప్రబోధంతో తన నిత్య జీవితాన్ని ఉదాత్తస్థాయికి తీసుకుపోవడానికి యత్నించిన మహావ్యక్తి గాంధీజీ.

ఆయన ఎప్పుడో పురాణ యుగంలో జీవించిన వ్యక్తి కాదు. ఒక తరం క్రింద వరకు మనలో ఒకడు. మన మధ్య మసలిన వ్యక్తి. నైతికోన్నతి కోసం ఆయన ఏ నిర్జనారణ్యాలలోనో కూర్చుని ముక్కు మూసుకుని తపస్సుచేసినవాడు కాదు. నిరంతర రాజకీయ, సాంఘిక, ప్రజాసేవా కార్యకలాపాలలో మునిగి తేలిన వ్యక్తి. వాటిలోనే తన ఆదర్శాలను, లక్ష్యాలను సాక్షాత్కరించుకో గోరిన వ్యక్తి, వాటిలోనే ఆయనకు జీవిత సాఫల్యం లభించింది. అందరివంటి సాధారణుడే అయిన ఆయనకు సాధ్యమైన అసాధారణత్వం ఇతరులకు మాత్రం ఎందుకు సాధ్యం కాదు?

(అక్టోబర్ 6, 1968)

# స్వాతంత్ర్యమూర్తి

గాంధీజీ శత జయంత్యుత్సవ సందర్భంగా ఆయన దివ్యస్మృతికి మేము అంకితం చేసిన ఈ సంపాదకీయ వ్యాసాలలో కడపటి దానికి మేము ఎన్నుకున్న శీర్షిక "స్వాతంత్ర్యమూర్తి".

అవును, గాంధీజీ స్వాతంత్ర్యమూర్తిగానే మనకు కలకాలం జ్ఞాపకం

వుంటాడు. ఆయన సుమారు దబ్బాయి సంవత్సరాల క్రిందట దక్షిణాఫ్రికాలో తోటి భారతీయులకు శ్వేత జాతి దమననీతి నుంచి విముక్తి కల్గించడానికి పోరాటంతోనే తన జీవితాన్ని ప్రారంభించాడు; స్వదేశం తిరిగి వచ్చిన తర్వాత భారత స్వాతంత్ర్య సమరంలోనే ఆయన దీర్ఘ జీవిత కాలం గడిచింది. తన లక్ష్యసిద్ధిని కనులారా చూచి ఆయన కన్ను మూశాడు. ఆ విధంగా ఆయన జీవితం పరిపూర్ణమైంది. ఆయన మనకు "స్వాతంత్ర్యమూర్తి" కాక మరెవరు?

కాని గాంధీజీ లక్షించినది దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే కాదు. ఆయన స్వాతంత్ర్యానికి ఇచ్చిన అర్థం వేరు. అది అతి విస్తృతమైనది. దానిలో రాజకీయ స్వాతంత్ర్యం ఒక స్వల్ప భాగం మాత్రమే.

"గౌతమ బుద్ధుని తర్వాత భారతదేశంలో ఇంతటి మహాత్ముడు జన్మించ లేదు." అని లోకం ఈనాడు మోహన్ దాస్ కరంచంద్ గాంధిని కీర్తిస్తున్నది. రెండున్నర వేల ఏళ్ళ క్రిందట ఆ బుద్ధుడు నివసించిన భారతీయ సమాజం వేరు, పరిస్థితులు, అవసరాలు వేరు. ఈ అభినవ బుద్ధుడు నివసించిన భారతీయ సమాజం పరిస్థితులు, అవసరాలు వేరు, వారి కార్యాచరణ విధానాలు కూడా వేరు. అయినా, వారి లక్ష్యం ఒకటే.

ఆనాటి తాత్త్విక చింతనకు అనుగుణంగా గౌతమ బుద్ధుడు తన లక్ష్యాన్ని "నిర్వాణం"గా పేర్కొన్నాడు. దాన్ని ఈనాటి పరిభాషలో స్వాతంత్ర్యమనే వర్ణించాలి. బుద్ధుడే కాదు, ఏ మహా ప్రవక్త లక్షించినా పరిపూర్ణ మానవతా వికాసానికి అటంకాలైన శృంఖలాల నుంచి విముక్తినే. మన పూర్వులు చెప్పిన జీవన్ముక్తి కూడా ఈ విస్తృత స్వాతంత్ర్యానికి పర్యాయ పదమే. గాంధీజీ సయితం దాన్నే తన లక్ష్యంగా పెట్టుకున్నాడు.

మన దేశ స్వాతంత్ర్యం మన వారు మంత్రులు, శాసన నిర్మాతలు కావడంతో మనకు పార్లమెంటు ఏర్పడడంతో, మన విదేశాంగ నీతిని మనం నిర్ణయించు కోవడంతో ఆగిపోదు. ఈ పరిమిత స్వాతంత్ర్యం ఇంతకంటె ఉన్నతమయిన స్వాతంత్ర్యానికి దారి తీయాలి. ప్రతి వ్యక్తి స్వాతంత్ర్యం పొందాలి. స్వాతంత్ర్య ఫలితాలు ప్రతి వ్యక్తికి అందాలి. వ్యక్తి, దేశం కూడా ఆర్థికంగా స్వాతంత్ర్యం కావాలి. "ఈ దేశం నాది, దాని బాగోగులు నావి, నా బాగోగులు దేశానివి నేను

లేనిదే దేశం లేదు. దేశం లేనిదే నేను లేను." అనే భావం ప్రతి పౌరునికి కలగాలి. రస్కిన్ రచించిన "అన్ టు దిస్ లాస్ట్" చదివి ప్రభావితు డయిన గాంధీజీ ఈ సమస్త ప్రజాభ్యుదయాన్నే "సర్వోదయ" మని వ్యవహరించాడు. ఆ సర్వోదయ సాధనమే నిజమయిన స్వాతంత్ర్యంగా ఆయన భావించాడు.

భారతదేశమే కాదు, సమస్త ప్రపంచంలో ఈ సర్వోదయ సాధనను గాంధీజీ ఆకాంక్షించాడు. ఈ మానవ జగత్తు ఇంతకంటె సుందరమైనదిగా రూపొందాలని, ఒక జాతిని మరొక జాతి పీడించనిదిగా, ఒక మతం మరొక మతాన్ని ద్వేషించ నిదిగా, మనిషి మనిషిని దోచుకోకుండా, పేదలు, ధనికులు, దుర్బలులు, బలాఢ్యులు, అనే విభేదాల పునాదులపై నిర్మితమయిన సమాజ వ్యవస్థ లేకుండా వుండే ఒక ఆదర్శ ప్రపంచాన్ని ఆయన తన మనోవీధిలో సాక్షాత్కరింప జేసు కున్నాడు.

ఆయన దృష్టిలో మనం సాధించినది స్వరాజ్యమే కాదు. ఆయన స్వరాజ్యం మన పూర్వులు పేర్కొన్న "స్వారాజ్యాని"కి భిన్నమయినది కాదు. అది సురాజ్యం, రామరాజ్యం. దాన్ని గాంధీజీ 'కింగ్‌డమ్ ఆఫ్ గాడ్' అని కూడా పేర్కొన్నాడు. అదీ ఆయన ధ్యేయం.

ఆయన శత జయంత్యుత్సవాలను జరుపుకుంటున్న ఈ శుభ సమయంలో ఆయన లక్ష్యాల సాధనకు మనం ఏమి చేయగలిగామని ఆత్మ సంశోధన చేసుకోవడం మన కర్తవ్యం. గాంధీజీ జీవన్ముక్తుడు. రాగ ద్వేషాల నుంచి, భయ క్రోధాల నుంచి, అన్ని విధాల సంకుచితత్వం నుంచి ఆయన తన జీవిత కాలంలోనే విముక్తుడైనాడు. నిజమైన స్వాతంత్ర్యం పొందిన మొదటి భారతీయుడు ఆయనే. తాను సంపూర్ణ స్వతంత్రుడైన తర్వాతనే ఆయన తన దేశీయుల స్వాతంత్ర్యానికై అహర్నిశలు పోరాడాడు. ఆయన ప్రారంభించిన ఆ పోరాటాన్ని కొనసాగించడమే మన పవిత్ర విధి.

(అక్టోబర్ 7, 1968)

# మావో, షేక్స్పియర్

షేక్స్పియర్‌ను సమస్త నాగరిక ప్రపంచం గౌరవిస్తుంది. ప్రపంచ నాటక కర్తలలో అగ్రగణ్యుడని నెత్తిన పెట్టుకుంటుంది. పాశ్చాత్య, ప్రాచ్య దేశాలవారే కాదు, కమ్యూనిస్టు దేశాల వారు కూడా అతని నాటకాలను శిరోధార్యాలుగా మన్నిస్తారు.

కమ్యూనిస్టుల గురువైన మార్క్స్ దృష్టిలో షేక్స్పియర్ చేతిలో నాటక రచనా శిల్పం పరాకాష్ఠ అందుకున్నది. జర్మన్ నాటక కర్త షిల్లర్ కంటె షేక్స్పియర్‌ను ఎక్కువగా అతడు సంభావించేవాడు. రోజుకొకసారైనా షేక్స్పియర్ నాటక భాగాలను అతడు పఠించేవాడు. వాటిలో అనేకం అతనికి కంఠతా వచ్చు. అతని కుటుంబంలో కూడా "షేక్స్పియర్ కల్ట్" వుండేదట. మార్క్స్, అతని కుమార్తెలు ఒక "గేమ్" ఆడేవారట. ఒకరొక "ప్యాసేజ్"ను ఉదహరిస్తే అది షేక్స్పియర్ రచించిన ఏ నాటకంలోనిదో మిగిలినవారు చెప్పుకోవాలి. అదీ ఆ "క్రీడ".

మార్క్స్ అభిమానులైన రష్యన్లు కూడా షేక్స్పియర్‌ను గౌరవిస్తారు. అతని నాటకాలను ఒకరిద్దరు కాదు, అయిదారుగురు రష్యన్ భాషలోనికి తర్జుమా చేశారు. అట్టి అనువాదకులలో కీర్తిశేషుడు బోరిస్ పాస్టర్నాక్ కూడా ఒకడు. షేక్స్పియర్ నాటకాలను మాస్కోలోని ప్రసిద్ధ నాటక మందిరాలలో తరచుగా ప్రదర్శించడమే కాదు, వాటిని గొప్ప కళాత్మక చలన చిత్రాలుగా కూడా నిర్మించారు.

యూరోపియన్ పునరుజ్జీవనం (రినేజాన్స్) షేక్స్పియర్‌లో పతాకస్థాయికి చేరినదని, అతడు భూస్వామిక విధానాన్ని వ్యతిరేకించి రాజరిక వ్యవస్థను అభిమానించిన వాడని రష్యన్లు అభిప్రాయపడతారు. అందువల్ల అతని కాలం నాటికి షేక్స్పియర్‌ను విప్లవ వాదిగానే వారు భావిస్తారు. ఇంతే కాక, మానవ ప్రవృత్తి వైవిధ్యాన్ని అతని వలె కాచి వడబోసిన నాటక రచయిత మరొకడు లేడని, అతడు గొప్ప మానవతావాది అని వారు విశ్వసిస్తారు.

రష్యన్లకు మిగిలిన వారికి షేక్స్పియర్ రచనల అవగాహనలో, దృక్పథంలో కొన్ని విభేదాలుండవచ్చు గాని, మొత్తంపై అతడిని అనమానుడైన నాటక కర్తగా భావించడంలో తేడా లేదు. కాని, ఊరందరిది ఒకదారి, ఉలిపికట్టెది ఒకదారి అన్నట్టు మావో చైనాకు మాత్రం షేక్స్పియర్ పనికిరాలేదు. అతని "హామ్లెట్", "ఒథెల్లో" నాటకాలనుంచి నిర్మించిన చలన చిత్రాలను చైనీస్ సినిమా మందిరాలలో నిషేధించారట. అవి రాజరికాన్ని, బూర్జువా మానవతా వాదాన్ని సమర్థించే నాటకాలట. "హామ్లెట్"లో వ్యక్తిగత ద్వేషం ప్రధానం కాగా, "ఒథెల్లో"లో ప్రేమ ముఖ్యమట. ఇందుచేత వాటిని నిషేధిస్తున్నట్టుగా పీకింగ్ సినిమా ఇన్‌స్టిట్యూట్‌కు చెందిన రెడ్ గార్డులు ప్రకటించారట.

వారు నిషేధించిన షేక్స్పియర్ చలన చిత్రాలు రష్యన్ నిర్మాణాలు. షేక్స్పియర్ నాటకాలను పాశ్చాత్యులు కూడా చలన చిత్రాలుగా నిర్మించినప్పటికీ, ముఖ్యంగా కొన్ని రష్యన్ నిర్మిత చిత్రాలు అమెరికన్, తదితర నిర్మాణాలకంటె విశిష్టమైనవిగా వున్నాయని బ్రిటిష్ విమర్శకులే అంగీకరించారు. కాగా, వాటిని మావో చైనా నిషేధించడం విడ్డూరం.

చైనీస్ రెడ్‌గార్డులు "విషతుల్యం"గా భావించి, నిషేధించిన మరొక చలన చిత్రం అలెగ్జాండర్ డ్యూమా నవల "త్రీ మస్కెటీర్స్" ఆధారంగా తీసినది. ఫ్రెంచి నవలా కర్తలలో డ్యూమా ప్రథమ శ్రేణికి చెందినవాడు కాకపోవచ్చు కాని, అతని విశిష్టత అతనిది. "త్రీ మస్కెటీర్స్" నవలలో డ అర్టగ్నాన్, పోర్తోస్, ఎరామిస్, ఎథోస్ పాత్రలు, వారి సాహసాలు ప్రపంచ సాహిత్యంలో అజరామరంగా నిలిచి పోతాయి. డ్యూమా నయితం ప్రధానంగా మానవతా వాది. బహుశా ఈ కారణం వల్లనే మావోకు అతని రచనలు కాని, వాటి చలన చిత్రాలు కాని సహించి వుండక పోవచ్చు.

మానవ సంస్కృతి, సభ్యత, నాగరికత క్రమానుగత పరిణామం చెందుతూ వస్తున్నాయి. వాటిలో అనేక విశిష్ట లక్షణాలున్నట్టే, కొన్ని అభివృద్ధి నిరోధక లక్షణాలు కూడా వుండవచ్చు. వాటిలో ఏ పురోగతి సాధించాలన్నా పాత పునాదులపైనే సాధించాలి గాని, పునాదులనే పెకలించరాదు. అది "నిహిలిజం" కాగలదేమో తప్ప కమ్యూనిజం కానేరదు. కమ్యూనిజం ఒకప్పుడు మానవతావాదాన్ని పుణికి పుచ్చుకున్న సిద్ధాంతమన్న అభిప్రాయం జనంలో వుండేది. ఆ అభిప్రాయాన్ని స్టాలిన్ చాలా వరకు చెదరగొట్టాడు. ఇప్పుడు మావో పూర్తిగా పటాపంచలు చేస్తున్నాడు. కాని ఒక సంగతి: సూర్యునిపై దుమ్ము చల్లితే అది తిరిగి మన కంటిలోనే పడుతుంది. షేక్స్పియర్‌పై ఎంత దుమ్మెత్తి పోసినా, అది తిరిగి పడేది మావో కళ్ళలోనే.

(నవంబర్ 16, 1968)

# కీర్తిశేషుడు బందా

ఒకనాడు ఆంధ్ర నాటక రంగం స్వర్ణయుగాన్ని చూచింది. ఆ యుగంలో అత్యుత్తమ శ్రేణి నటు లనేకులు ఆంధ్రలో ప్రభవించారు.

ఇప్పుడు సినిమాల మీద వున్నంత మోజు ఆనాడు నాటకాల వట్ల వుండేది. ఇప్పుడు సినిమా తారల మీద వున్నంత మోజు ఆనాడు నాటకాల నటీనటుల వట్ల వుండేది. ఇప్పటి సినిమా పాటలపై వున్నంత మోజు ఆనాడు నాటకాల వద్యాలపై

వుండేది. హరి ప్రసాదరావు, బళ్ళారి రాఘవ, మాధవపెద్ది, యడవల్లి, స్థానం, అద్దంకి, పులిపాటి, డి. వి. సుబ్బారావు, కపిలవాయి, జొన్నవిత్తుల ఇంకా ఎందరో అశేష ప్రజాదరణ పొందిన నటుల కాలం ఆ స్వర్ణయుగం.

వారి కోవలో చెప్పుకోదగిన నటుడు బందా కనకలింగేశ్వరరావు. ఆయన మరణం ఆంధ్ర నాటక రంగాభిమానులకు అత్యంత విషాదకరం.

కృష్ణుడు, సారంగధరుడు, బిల్వమంగళుడు మొదలైన ఎన్నో పాత్రలలో ఆయన సభారంజకంగా నటించేవారు. నటనలోను, పద్యాలు పాడడంలోను ఆయన దొక ప్రత్యేకమైన పద్ధతి. పద్యాన్ని ఎన్ని అకారాల వికారాలతో ఒక్క ముక్క బోధ పడకుండా పాడితే జనం అంతగా చప్పట్లు కొట్టి హర్షించే రోజులవి. కాని, బళ్ళారి రాఘవ, మాధవపెద్ది వంటి కొందరు పద్యంలో భావానికే ప్రాధాన్యమిచ్చేవారు. కాగా, పద్యాన్ని రాగయుక్తంగాను, అదే సమయంలో భావయుక్తంగాను చదువుతూ సభాసదులను రంజింపజేసిన బాణీ బందా బాణీ.

ఆయన ఎన్నో నాటకాలలో, చలన చిత్రాలలో నటించడమే కాక, స్వయంగా నాటక కళోద్ధరణకు పాటుపడ్డారు. 19౩౮-౩౯ ప్రాంతాలలో ఆయన ఏలూరులో స్థాపించిన ఆంధ్ర నాటక కళాశాలలో ఎందరో నటనా కళ అభ్యసించినవారే.

సుమారు పన్నెండేళ్ళుగా ఆలిండియా రేడియోలో శ్రవ్య నాటక ప్రయోక్తగా పని చేస్తూ అనేక నాటకాలను నిర్వహించడమే కాక, స్వయంగా ఎన్నో నాటకాలు రచించి లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. ముఖ్యంగా ఇటీవలి కాలంలో కూచిపూడి నాట్య కళోద్ధరణకు ఆయన చేసిన కృషి చిరస్మరణీయమైంది. కూచిపూడిలో సిద్ధేంద్ర కళా క్షేత్రం ఆయన కృషి ఫలితమే.

సినిమాలకు బాగా వ్యాప్తి రావడంతో నాటక రంగానికి పూర్వపు ప్రాధాన్యం పోయింది. మన నాటక కళలో పూర్వపు సంప్రదాయాలు అంతరిస్తున్నాయి. కొత్త ధోరణులు ప్రచారంలోకి వస్తున్నాయి. ఇది సహజమే కూడా. అయినా, తెలుగు నాటక రంగానికి బందా, ఆయన తరం వారు చేసిన సేవ ఎన్నటికి మరపు రానిది.

(డిసెంబర్ ౬, 19౬౮)

# ముందు చూపు

అమెరికన్ అంతరిక్ష నౌక అపోలో-8 చంద్రమండలాన్ని చుట్టి దిగ్విజయంగా తిరిగి వచ్చింది. కొందరు ప్రసిద్ధ శాస్త్రవేత్తలు సయితం ఈ ప్రయోగాన్ని వృథా చర్యగా విమర్శిస్తున్నా, మానవుని మేధ సాధించిన ఈ అపూర్వ సాంకేతిక విజయాన్ని ప్రపంచం వేనోళ్ళ కీర్తిస్తున్నది.

మొన్నటి అపోలో యాత్ర ముందు అసంఖ్యాకంగా ఉత్పత్తి అయిన, అవుతున్న వైజ్ఞానిక నవలా సారస్వతమంతా వెలవెల పోక తప్పదు. అంగారకుడు, శుక్రుడు మొదలయిన సుదూర గ్రహాలకు మానవ యాత్రలను, అక్కడి ప్రాణికోటిని, మానవాతీత జీవులను ఊహిస్తూ ఎన్నో నవలలు వచ్చాయి. అయితే, అవన్నీ ఇటీవల ఖగోళ విజ్ఞానం చెందిన పురోగతిని ఆదారం చేసుకుని, అంతకంటె ఎక్కువగా కల్పనను ఆధారం చేసుకుని వ్రాసినవే.

కాని, ఒక మహా రచయితకు మాత్రం ఈ సందర్భంలో జోహారు లర్పించక తప్పదు. అతడు ఫ్రెంచి రచయిత జూల్స్ వెర్న్. అతడు 1828 నుంచి 1905 వరకు జీవించినవాడు. తన కాలంలోని వైజ్ఞానిక సారస్వతాన్ని అధ్యయనం చేసిన వాడే గాని, ప్రత్యేకించి శాస్త్రవేత్త కాడు. పైగా అతడు విద్యాలయాలలో చదివింది విజ్ఞాన శాస్త్రం కాదు, న్యాయశాస్త్రం. తన రచనా జీవితాన్ని కూడా శాస్త్రీయ రచనలతో ప్రారంభించలేదు: పద్య నాటకాలు, సంగీత నాటకాలతో ప్రారంభించాడు. మధ్యలో కొన్ని యాత్రా కథలు వ్రాసి పేరు తెచ్చుకొనడంతో అతనికి 1860 ప్రాంతాల నుంచి వైజ్ఞానిక కథా సారస్వతం మీద అభిరుచి పుట్టి వ్రాయడం మొదలు పెట్టాడు.

జూల్స్ వెర్న్ వచన రచయిత అయినా, కవి పద వాచ్యతకు అన్ని విధాలా అర్హుడు. కవి అనే పదానికి అసలు అర్థం ద్రష్ట, క్రాంతదర్శి, ఋషి, సర్వజ్ఞుడు. వేదాలలో ఈ అర్థంలోనే కవి శబ్దాన్ని ఉపయోగించారు. "నా నృషిః కురుతే కావ్యమ్" అని మన పూర్వులు భావించారు. కవి భవిష్యత్తును ఊహించ గలడని కూడా వారు భావించారు. రాముని జననానికి ముందే వాల్మీకి రామాయణ గాథను వ్రాయగలగడంలో అర్థం ఇదే.

జూల్స్ వెర్న్ కూడా ఆగామి వైజ్ఞానిక పురోగతిని ఊహించి అనేక నవలలు వ్రాశాడు. ఆ రోజులలో జలాంతర్గాములు లేవు. విమానాలు లేవు. టెలివిజన్ లేదు. రోదసీ నౌకలు లేవు. కాని అన్నిటిని శాస్త్రీయంగా ఊహించి అతడు నవలలు వ్రాశాడు. సాగర గర్భంతో జలాంతర్గామిలో అరవై వేల మైళ్ళ యాత్ర,

బెలూన్‌లో ఎనభై రోజులలో భూప్రదక్షిణం. భూమి నుంచి చంద్రుని వద్దకు రోదసీ నౌకలో యాత్ర, భూమి కేంద్ర స్థానానికి అవరోహణ మొదలైన సాహసాలను అతడు వాటిలో వర్ణించాడు. వైజ్ఞానిక నవలలైనా డ్యూమాస్ నవల అంతటి ఆసక్తికరంగా వ్రాయడం అతని ప్రత్యేకత.

ముఖ్యంగా "ఫ్రం ది ఎర్త్ టు ది మూన్" అనే జూల్స్ వెర్న్ నవల ఇటీవల పలువురిని ఆకర్షించింది. దానికి, అపోలో-8 యాత్రకు అనేక సామ్యాలున్నాయి. దానిలో కూడా రోదసీ నౌక ముగ్గురు యాత్రికులతో బయలుదేరి చంద్రుని చుట్టూ పరిభ్రమిస్తుంది. అది కూడా గంటకు 25 వేల మైళ్ళ వేగంతో ప్రయాణిస్తుంది. దాని ప్రయోగం కేప్ కెనెడీకి 160 కిలో మీటర్ల సమీపం నుంచి జరుగుతుంది. అది తిరిగి వచ్చి దిగిన స్థలం కూడా పసిఫిక్ మహా సముద్రమే. ఆ సంఘటన కూడా డిసెంబర్‌లోనే జరుగుతుంది. అపోలో నౌక పొడుగు పన్నెండడుగులు కాగా, వెర్న్ నౌక పన్నెండడుగుల ఎత్తు. అపోలో బరువు 12,392 పౌనులు కాగా వెర్న్ నౌక బరువు 12,230 పౌనులు. వెర్న్ వర్ణించిన చంద్ర గోళం పరిస్థితులకు, మొన్నటి చంద్ర గాముల వర్ణనలకు కూడా సరిపోయింది.

ఈ సామ్యాలు విచిత్రంగా లేవా? జూల్స్ వెర్న్ 103 సంవత్సరాల క్రిందట—1865లో తన నవల వ్రాశాడు. "రవి కాననిచో కవి కాంచునే కదా!" అనే లోకోక్తిని అతని రచనలు రుజువు చేస్తున్నాయి. ఇరవైయవ శతాబ్దంలో మనం జూల్స్ వెర్న్ నవలలనే జీవిస్తున్నామని ఒక ప్రఖ్యాత శాస్త్రవేత్త అన్నాడు. ఆ వాక్యంలోని సత్యాన్ని మొన్నటి అపోలో యాత్ర మరొకసారి రుజువు చేసింది. జూల్స్ వెర్న్ మానవ భవిష్యత్తు లోనికి 'తొంగి' చూచాడు. అతనిది ముందు చూపు; వెనుక చూపు కాదు. ముందుకు దారి చూపడం కంటె సాహిత్యానికి పరమ ప్రయోజనం మరేముంది?

(డిసెంబర్ 30, 1968)

# అన్నాదురై

ముఖ్యమంత్రులైన వారందరు ప్రజానాయకులు కారు. పార్టీలో హెచ్చు మందిని కూడగట్టుకొని కొందరు, అదృష్టం తోసుకొని వచ్చి కొందరు ముఖ్యమంత్రులు కావచ్చు. ముఖ్యమంత్రులైన తరువాత వారు ప్రజా నాయకులుగా చెల్లుబడి

కావచ్చు. కాని అన్నాదురై వలె ప్రజా నాయకులైన తర్వాతనే ముఖ్యమంత్రు లయ్యే వారు అరుదుగా వుంటారు.

కనుకనే, ఆయన అకాల మరణానికి నేడు మొత్తం తమిళనాడు శోకిస్తున్నది. ఆయన ఈనాడు ముఖ్యమంత్రి పదవిలో కాక, ప్రతిపక్ష నాయకుడుగా మాత్రమే వుంటూ మరణించినా తమిళనాడు ఇదే విధంగా, తమ ఆప్త బాంధవుని కోల్పోయినట్లు పరితపించి వుండేదే.

అన్నాదురై మృతితో తమిళనాడు తమ ప్రియతమ నాయకుని కోల్పోవడమే కాదు: యావద్భారతమే ఒక రాజనీతి విశారదుని, ఒక పరిపాలనాదక్షుని కోల్పోయింది. కనుకనే, తమిళనాడు శోకంలో ఈనాడు యావద్భారతం పాలు పంచు కుంటున్నది.

అన్నాదురై తన రాజకీయ జీవితాన్ని తీవ్ర వాదిగానే ప్రారంభించారు. ఆయన స్థాపించిన ద్రవిడ మున్నేట్ర కజగం ప్రత్యేక ద్రవిడనాడు సాధన లక్ష్యంతో ప్రారంభమైంది. తమిళుల పూర్వపు టౌన్నత్యాన్ని పునరుజ్జీవింప జేయాలని, తమిళ సంస్కృతి ప్రత్యేకతను కాపాడాలని, వర్ణ విభేదాలను రూపుమాపాలని, ఇ. వి. రామస్వామి నాయకర్ స్థాపించిన ద్రవిడకజగం నుంచి చీలిపోయి ఆయన 1949లో ద్రవిడ మున్నేట్ర కజగంను స్థాపించారు. కేవలం ఇరవై ఏళ్ళలో దాన్ని తమిళ నాడులో ఒక ప్రబల శక్తిగా ఆయన తీర్చిదిద్దారు.

ఇటీవలి వరకు ఆయన ప్రత్యేక ద్రవిడనాడు ఉద్యమాన్ని కొనసాగించిన మాట నిజమే కాని 1962లో చైనీస్ దురాక్రమణ అనంతరం ఆయన తన పార్టీ లక్ష్యాన్ని మార్చి వేయడం, భారత జాతీయైకమత్యాన్ని బలపరచడం ఆయన రాజనీతి వైశారద్యానికి నిదర్శనం.

తమిళనాడులో తనకు ఏకైక ప్రతి ద్వంద్వి అయిన డి. ఎం. కె. 1967 జనరల్ ఎన్నికల ఫలితంగా అధికారానికి రాగానే కేంద్రంలోని కాంగ్రెస్ ప్రభుత్వానికీ, తమిళ నాడు ప్రభుత్వానికి తీవ్ర స్పర్థ ప్రారంభం కావడం తథ్యమని చాలా మంది తలం

పోశారు. కాని, అన్నాదురై నాయకత్వం ఈ అంచనాలన్నిటిని తల క్రిందులు చేసింది. ఉత్తర భారత రాష్ట్రాలలోని, కేరళలోని కాంగ్రెసేతర ప్రభుత్వాలతో పోల్చితే తమిళనాడు ప్రభుత్వానికి, కేంద్రానికి మధ్య సంబంధాలు సామరస్య పూర్వకమైనవనే చెప్పాలి.

కేంద్రానికి, రాష్ట్రాలకు మధ్య సంబంధాలను పునర్నిర్వచించవలె అన్నాదురై ఉద్ఘాటించకపోలేదు. రాష్ట్రాలకు ఇతోధికంగా అధికారాలివ్వాలని ఆయన వొత్తిడి తేకపోలేదు. హిందీని ఏకైక అధికార భాషగా చేయటాన్ని తీవ్రంగా వ్యతిరేకించక పోలేదు. మరి పెక్కు విషయాలలో కేంద్రంతో ఆయన విభేదించక పోలేదు. కాని ఈ విభేదాలన్నిటిని దృఢంగా, అదే సమయంలో సౌజన్య పూర్వకంగా, జాతీయ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని కొనసాగించడంలో ఆయన నాయకత్వ ప్రతిభ గోచరిస్తుంది.

ఆయన వలె ప్రజానురాగం చూరగొన్న నాయకులు, అసంఖ్యాక ప్రజానీకాన్ని ఒక్క మాటతో మంత్ర ముగ్ధం చేయగలిగిన వారు చాలా అరుదుగా వుంటారు. అధికారానికి వచ్చిన తర్వాత ఆయన వలె తమ ప్రజల అనురాగాన్ని చెక్కు చెదరకుండా నిలుపుకో గలిగిన వారు మరింత అరుదుగా వుంటారు.

సాధారణంగా ఏ ప్రజా నాయకుడు మరణించినా ఆ లోటు తీరనిదనే సంతాప ప్రకటనలు వెలువడడం పరిపాటి. అన్నాదురై విషయంలో ముఖ్యంగా తమిళనాడుకు ఆయన మృతి నిజంగానే తీరని లోటు. డి. ఎం. కె. పార్టీ మొదటిసారిగా రాష్ట్ర పరిపాలనా బాధ్యతను స్వీకరించిన తర్వాత రెండేళ్ళయినా తిరగకుండా ఆయన కన్ను మూశారు. ఆయన లేని లోటును ఆయన సహచరులు ఏ విధంగా పూరించ నున్నారనే దాని పైనే తమిళనాడులో డి. ఎం. కె. భవితవ్యం ఆధారపడి వుంటుంది.

[illegible]

[illegible] (ఫిబ్రవరి 4, 1969)

# మహాకవి గాలిబ్

మందాక్రాంత కాళిదాసు చేతిలో పోయినన్ని ఒదుగులు మరొకరి చేతిలో పోలేదు. శార్దూల విక్రీడితం భవభూతి చేతిలో సొబగులు సంతరించుకున్నది.

సీసం శ్రీనాథుని సొమ్ముకాగా, ఆటవెలదికి వేమన పట్టాభిషేకం చేశాడు.

గ్రీక్ వాఙ్మయంలో "ఓడ్"ను పిండార్ తీర్చిదిద్దాడు. "సానెట్" షేక్స్పియర్‌లో పరాకాష్ఠ అందుకున్నది. రుబాయీని జగత్ప్రసిద్ధం చేసినవాడు ఒమర్ ఖయ్యాం.

అదే విధంగా ఉర్దూ ఘజల్ మిర్జా గాలిబ్ సొత్తు. అది పారసీక కవితారీతి. ఉర్దూ వాఙ్మయంలో కూడా దానికి రెండు వందల ఏళ్ళ చరిత్ర వున్నది. ఆ చరిత్రలో నిర్మకుట సార్వభౌముడు గాలిబ్.

ఘజల్ ప్రత్యేకించి లౌకిక, అలౌకిక ప్రేమకు, మార్మికతకు, భావుకతకు ప్రాధాన్యమిచ్చే కవితారీతి. గాలిబ్ చేతిలో అది అనేక నిమాత్న సౌందర్యాలను ఆవిష్కరించింది. అలౌకికత్వానికి కంటె లౌకికత్వానికి, దేవుని కంటె మానవునికి, మానవ సమస్యలకు, మానవ జీవితానికి గాలిబ్ తన కవితలో ప్రాధాన్యమిచ్చాడు. ఇతర కవుల వలెకాక, అతడు వర్తమానంలోనే ఎక్కువ జీవించాడు. మానవ సమస్యల పరిష్కారానికి గతించిన సాంఘిక వ్యవస్థను పునరుజ్జీవింప చేయడం కాక, నూతనమైన విలువలను, సంప్రదాయాలను నిర్మించుకొనడమే మార్గమని విశ్వసించాడు. ఇందువల్లనే మిర్జా గాలిబ్‌ను ఉర్దూకవితలోనే కాక, భారతీయ

వాఙ్మయంలో నయితం మొట్టమొదటి ఆధునికుడుగా అభిజ్ఞులు పరిగణిస్తున్నారు. ఈ కారణం చేతనే అతడిని సమకాలికులు సరిగా అర్థం చేసుకోలేక విమర్శించే వారని చెబుతారు. అతనికి సమకాలికులలో కీర్తి ప్రతిష్ఠలు రాకపోలేదు. కాని, అతని మరణానంతరం, ముఖ్యంగా ఈ శతాబ్దంలో గాలిబ్ కీర్తి రెండింతలు, మూడింతలు పెరిగింది.

ఉర్దూ కేవలం ముస్లిముల భాష అనే అపోహ చాలా మందికున్నది. అది పారసీక, అరబిక్ భాషా పదాలను విరివిగా చేర్చుకుని రూపొందిన భారతీయ భాష. కనుకనే మన రాజ్యాంగం గుర్తించిన భాషలలో అది ఒకటైంది.

ఆది ఎన్నడో 14వ శతాబ్దిలో ముస్లిమ్ పరిపాలన కారణంగా ప్రభవించిన భాష అయినా, కాలక్రమాన హిందువులలో కూడా అనేకులు దాన్ని తమ భాషగా స్వీకరించారు. ఉర్దూలో గొప్ప పద్య, గద్య రచనలు చేసిన హిందువు లెందరో వున్నారు. ప్రేమ్‌చంద్, కిషన్ చందర్ వంటి పేర్లు ప్రసిద్ధమైనవి. స్వామి రామతీర్థ వంటి వేదాంతి నయితం ఉర్దూలో చక్కని కవిత వ్రాశాడు. అందుచేత ఉర్దూ హిందూ, ముస్లిం సమైక్యానికి కూడా ఎంతో తోడ్పడిన భాష. దాని పారమ్యాతం హిందూ ముస్లిములకు సమానంగా చెందిన వారసత్వం. ముఖ్యంగా గాలిబ్‌ను మహాకవిగా ఆరాధించేవారు, ఆయన కవితా రామణీయకానికి ముగ్ధులయ్యే వారు ముస్లిమ్‌లలో ఎందరున్నారో హిందువులలో కూడా అందరున్నారు.

ఈ శతాబ్దం ప్రారంభం నుంచి ఇక్బల్ మొదలైన ఉర్దూ మహా కవులు ఘజల్ కవితా సంప్రదాయాన్ని ఈసడించి కొంగ్రొత్త రీతులను చేపట్టినా, కొంత కాలంగా అభ్యుదయోద్యమం ఉర్దూ వాఙ్మయాన్ని లోబరుచుకున్నా, ఘజల్ రీతికి వన్నె తగ్గలేదు. ఘజల్ వున్నంత వరకు గాలిబ్ కీర్తి దేదీప్యమానంగా ప్రకాశిస్తుంది. కాలం గడుస్తున్న కొద్దీ ఆయన కీర్తి పెరుగుతూనే వున్నది గాని తరగటంలేదు. ఈనాడు ఇండియా మొత్తంలో గాలిబ్ శత వర్ధంతి మహా వైభవంగా జరుగుతున్నది. ఇండియాలోనే కాదు: సోవియట్ యూనియన్, అమెరికా వంటి విదేశాలలో నయితం ఆయన సంస్మరణోత్సవాలు జరుగుతున్నాయి. దానికి కారణం ఆయన కవిత్వాన్ని ఉద్దీపింప జేసిన మానవీయత. కాలానికి, దేశాలకు అతీతమైన విశ్వజనీనత.

(ఫిబ్రవరి 16, 1969)

# ఐసెన్ హోవర్

ఈ శతాబ్దపు అమెరికన్ చరిత్రలో చిరస్మరణీయులైన వ్యక్తులలో ఐసెన్‌హోవర్ ఒకడు. తన 78 వ ఏట, సంపూర్ణ జీవితాన్ని గడిపిన తర్వాత ఆయన మొన్న కన్ను మూశాడు.

ఆయన యుద్ధకాలంలోను, శాంతి కాలంలోను కూడా చరిత్ర సృష్టించాడు. జన్మించింది సైనిక జీవితానికి పూర్తిగా వ్యతిరేకమైన మత సాంప్రదాయిక కుటుంబంలో నైనా ఆయన చిన్ననాటనే సైనిక జీవితాన్ని కోరుకున్నాడు. ఆయన సైనిక జీవితం అట్టడుగున ప్రారంభించి క్రమ క్రమంగా అగ్రస్థాయిని చేరుకున్నడు.

ముఖ్యంగా ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో ఐసెన్‌హోవర్ సైనికుడిగా తన ప్రతిభా విశేషాలను కనబరచాడు. మిత్రరాజ్యాల సేనలకు యూరప్‌లో ఆయన సర్వాధ్యక్షుడుగా పనిచేసి, తన యుద్ధ తంత్రంతో, వ్యూహ చాతుర్యంతో హిట్లర్ జర్మనీపై అఖండ విజయాన్ని సాధించాడు. ఆ రోజులలో యూరప్, అమెరికా లలో చర్చిల్ తర్వాత సుప్రసిద్ధుడు, అశేష ప్రజానీకానికి ఇంచు మించుగా ఆరాధ

నీయుడు ఎవరైనా వుంటే అతడు ఐసెన్‌హోవర్. యుద్ధం ముగిసిన తర్వాత కొంత కాలానికి ఉత్తర అట్లాంటిక్ కూటం ఏర్పడిన తర్వాత మిత్రరాజ్యాలు అతడినే సుప్రీం కమాండర్‌గా నియమించుకున్నాయి.

వరసగా పెక్కేళ్ళుగా డెమొక్రాటిక్ పార్టీ చేతులలో వుంటూ వచ్చిన అమెరికా అధ్యక్ష పదవిని స్వాధీనం చేసుకొనడానికి రిపబ్లికన్ పార్టీ ఐసెన్ హోవర్‌ను 1948 నాటి ఎన్నికలలోనే తన అభ్యర్థిగా నియమించు కోవాలని తలపోసింది. కాని, ఐసెన్‌హోవర్ తిరస్కరించాడు. బహుశా ఆనాడే ఆయన అంగీకరిస్తే అప్పుడే ఆయన ప్రెసిడెంటుగా ఎన్నికై వుండేవాడు. ఆయన పట్ల ప్రజాదరం అంతటిది.

"ఐసెన్ హోవర్ ఫర్ ప్రెసిడెంట్" అనే నినాదం తిరిగి 1952లో ఉధృతంగా ప్రారంభమైంది. అప్పుడు ఆయన రిపబ్లికన్ పార్టీ కోరికను, ప్రజల కోరికను కూడా కాదనలేక పోయాడు. అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. 1955లోనే ఆయనకు మొదటిసారిగా గుండెపోటు వచ్చి జబ్బు పడినా రెండవసారి 1956 లో కూడా ఆయన తిరిగి పోటీ చేసి ప్రెసిడెంటుగా ఎన్నికైనాడు.

అమెరికన్ ప్రెసిడెంట్లలో చాలామందికి మొదట ఎంతగా ప్రజాదరం లభిస్తుందో పదవీ విరమణ చేయబోయే కాలంలో అంతగా అనాదరం కూడా జరుగుతుంది. ఇందుకు ఇటీవలి ఉదాహరణ ప్రెసిడెంట్ జాన్సన్. ప్రెసిడెంట్ ఐసెన్ హోవర్ కూడా పదవిలోకి వచ్చినప్పుడు ఆయనకు లభించిన ప్రజాదరం చాల కొద్దిమందికే లభిస్తుంది. కాని, చివర చివరకు ప్రజావ్యతిరేకత కాకపోయినా కొంత వరకు అనాదరం ఐసెన్ హోవర్‌కు కూడా తప్పలేదు. విదేశాంగ మంత్రి జాన్ ఫాస్టర్ డలెస్ అనుసరించిన "బ్రింక్‌మన్ షిప్" దీనికి ఒక కారణం. ఐసెన్ హోవర్ రోగగ్రస్తుడు కావడం, వైస్ ప్రెసిడెంట్ నిక్సన్ పరిపాలనా వ్యవహారాలను చూడవలసి రావడం మరొక కారణం. రోదసీ ప్రయోగాలలో రష్యాకంటె అమెరికా వెనుకబడటం వంటి మరెన్నో కారణాలను కూడా పేర్కొనవచ్చు.

ఏమైనా, ఒక మహావ్యక్తిగా, నాజీ జర్మనీపై విజయం సాధించిన సేనానిగా ఐసెన్ హోవర్ అమెరికన్ చరిత్రలో, ప్రపంచ చరిత్రలో నిలిచిపోతాడు.

(మార్చి 28, 1969)

# గాంధి నక్షత్రం

భూమండలంలో గాంధీజీకి స్మారక చిహ్నాలు ఇప్పటికే చాలా వున్నాయి. విజయవాడలో ఒక కొండకు గాంధిపర్వతమని పేరుపెట్టడం జరిగింది. ఆయన పేరిట దేశంలో స్తూపాలు, మందిరాలు ఏవేవో వెలుస్తున్నాయి.

ఇవి చాలక ఆకాశంలో కూడా గాంధి స్మారక చిహ్నాన్ని ప్రతిష్ఠించడానికి ఆలోచనలు జరుగుతున్నాయి. ఆకాశంలో స్మారక స్తూపాన్నో, మందిరాన్నో నిర్మించడం సాధ్యంకాదు కనుక ఒక నక్షత్రానికి "గాంధి నక్షత్ర"మని నామకరణం చేయాలని ఒక పారిశ్రామికుడు సూచన చేశారు. ఈ సూచనపై నిర్ణయం చేయడానికి కొద్ది రోజులలో విశ్వవిద్యాలయాల ఉపాధ్యాయులు, ఖగోళవేత్తలు, విద్యావేత్తలు, ఇతర ప్రముఖులు అహ్మదాబాద్‌లో సమావేశం కానున్నారట.

ఈ వేలం వెర్రిని చూచి ఏమనుకోవాలో తెలియడంలేదు. గాంధీజీ బ్రతికి వున్న రోజులలోనే ఆయనను భగవంతుని అవతారంగా నిరూపించడానికి కొన్ని ప్రయత్నాలు జరిగాయి. ఆయన అస్తమించిన తర్వాత ఆయనకొక దేవాలయం

నిర్మించడానికి ప్రయత్నం జరిగింది. "గాంధిదేవా! బోధివరావా!" అని ఆయనపై భజన పాటలు బయలుదేరాయి. ఊరూరా గాంధి విగ్రహాలు వెలిశాయి. వీటిలో అనేకం గాంధీజీని పరమ వికారస్వరూపుడుగా చూపిస్తున్నవి కూడా వున్నాయి.

ఆయనను రాయిగా, బొమ్మగా మార్చివేయడానికి జరిగిన ప్రయత్నాలు చాలక ఆయనను నక్షత్రంగా చేయడానికి ఇప్పుడు కొందరు ఆలోచిస్తున్నారు. దీనికి సమర్థనగా పూర్వకాలంలో అగస్త్యుడు, వశిష్ఠుడు మొదలైన మహర్షుల పేర్లు నక్షత్రాలకు పెట్టిన సంప్రదాయాన్ని వారు ఉదాహరిస్తున్నారు.

గాంధీజీకి ఈ విధంగా అర్థం పర్థంలేని స్మారక చిహ్నాలను నెలకొల్పడానికి జరిగే ప్రయత్నాలవల్ల ప్రయోజనం ఏమిటో తెలియడంలేదు. వీటివల్ల గాంధీజీ స్మృతిని గౌరవించడం, వ్యక్తిని గౌరవించడం జరుగుతున్న మాట నిజమే కావచ్చు. కాని, ఆయన ఆదర్శాల మాటేమిటి? ఆయన ఉపదేశాల మాటేమిటి? తన జీవితంలో తాను స్వయంగా ఆచరించి బోధించిన కర్తవ్యాల మాటేమిటి?

సమకాలిక సమాజ జీవితాన్ని చూస్తుండగా, గాంధీజీ పేరు ఉచ్చరించడమైనా ఒక "అనాక్రానిజం"గా, అప్రస్తుతంగా కనిపిస్తున్నది. ఆయన సత్యానికి, అహింసకు, స్వార్థరాహిత్యానికి, నిరాడంబరతకు, ఇట్టివే మరెన్నో విలువలకు అధిక ప్రాధాన్యమిచ్చారు. ఆయన జన్మతః లోకోత్తరుడు కారు, తాను విశ్వసించిన కొన్ని మానవత్వపు విలువలను తన జీవితంలో అనుష్ఠించడంవల్లనే ఆయన లోకోత్తర పురుషుడైనారు. ఆ విలువలను పాటించడమే మానవ కళ్యాణ దాయకమని ఆయన బోధించారు. ఈ ప్రాథమిక విషయాన్ని విస్మరించి గాంధీజీని శాశ్వతంగా నిర్జీవ స్మారక చిహ్నాలలో బంధించబూనడం ఏమి పద్ధతి ?

గాంధీజీకి శిలావిగ్రహాలను, మందిరాలను నిర్మిస్తే, ఆయనను మానవాతీతుడుగా చేస్తే, ఆయన గురించి సభలలో పదే పదే కీర్తిస్తే ఇక ఆయన బోధలకు మనం తిలోదకాలిచ్చినా పరవాలేదనే మనస్తత్వం పెరుగుతున్నది. గాంధీజీని నక్షత్రంగా చేయడం కూడా ఈ కోవకు చెందినదే. గాంధీజీని మన నైతిక, రాజకీయ జీవితం నుంచి నక్షత్ర మండలానికి తరిమి వేయడం ఏనాడో జరిగింది. ఆ తరిమివేతకు మాత్రమే ఇది స్మారకచిహ్నం కాగలదు.

(సెప్టెంబర్ 9, 1969)

# శక్తి పూజ

శక్తి, పదార్థం భిన్నమైనవికావు. ఒకే మూలతత్త్వానికి అవి రెండు రూపాలు.

పదార్థం జడమైనది; దాన్ని చైతన్యవిలసితం చేసేది శక్తి.

శక్తికి పదార్థం వాహనం. పదార్థం లేనిదే శక్తి ప్రత్యేకంగా మనలేదు. అవి పరస్పరాశ్రితాలు. పరమాణువు లోనికి పోయిచూస్తే ఏది శక్తి, ఏది పదార్థం అని వేర్పరచలేని అభేదం గోచరిస్తుంది. ఇది ఆధునిక శాస్త్రజ్ఞులు కనుగొన్న సత్యం.

సమస్త సృష్టికి మూలమైన తత్త్వాన్ని మన పూర్వులు శక్తిగా ఆరాధించారు. దానికొక పర్వదినాన్ని నిర్ణయించుకున్నారు. దాని చుట్టూ ఎన్నో పురాణగాథలు

చిలవలు పలవలుగా అల్లుకున్నారు. అవే నేటికీ విజయదశమి పర్వంగా మన సమాజంలో నిలిచివుంది.

శక్తిని కేవలం పూజించడంతో తృప్తిపడని మానవుడు శక్తిని శాసించే మూల సూత్రాలను కనుగొనడానికి, వాటి ద్వారా దాన్ని స్వాధీనం చేసుకొనడానికి కూడా మరొక వంక యత్నిస్తున్నాడు. ఆ ప్రయత్న ఫలితమే నేడు విజ్ఞాన శాస్త్రాలు బహుముఖాలుగా సాధిస్తున్న పురోగతి.

ఉదాహరణకు బయోకెమిస్ట్రీ—జీవరసాయన శాస్త్రంలో— కానవస్తున్న పురోభివృద్ధిని చూడండి. సృష్టికి ప్రతిసృష్టి చేయగల శక్తి శాస్త్రజ్ఞుల హస్తగతంకాగలరోజు ఎంతో దూరం లేదనిపిస్తున్నది.

వైరస్‌పై, వైరస్ వ్యాధులపై తాను జరిపిన పరిశోధనలకు మొన్ననే నోబెల్ బహుమతి పొందిన శాస్త్రవేత్త డాక్టర్ శాల్వడార్ లూరియా ప్రకటించినట్టు మానవులను లెబోరెటరీలలో కృత్రిమంగా, ప్రయోగాత్మకంగా తయారు చేయడమే కాదు. అది సర్వసాధారణం కాగలరోజు కూడా అనతి కాలంలో రావచ్చు. ఇది విజ్ఞానశాస్త్రానికి అపూర్వ విజయమేగాని, దాని నైతిక, సాంఘిక ఫలితాలేవిధంగా వుంటాయి? ఫ్యాక్టరీలలో తయారయ్యే పారిశ్రామిక వస్తువులవలె ఉత్పత్తి అయిన మానవులలో మానవత్వం—హ్యూమన్ క్వాలిటీ—ఏ మాత్రం మిగిలి వుంటుంది ?

కీర్తిశేషుడు ఆల్డస్ హక్స్లీ 1932 లో "బ్రేవ్ న్యూ వరల్డ్" అనే వ్యంగ్య నవల వ్రాశాడు. దానిలో అతడు "ఫోర్డుశకం" 7 వ శతాబ్దిలో సమాజాన్ని ఊహించాడు. దానిలో మానవులు సహజంగా జన్మించరు; కృత్రిమంగా లెబోరెటరీలలో ఉత్పత్తి అవుతారు. ఒకటి మేధావుల వర్గం, మరొకటి పాలకవర్గం, వేరొకటి కార్మిక వర్గం — ఇంకా వివిధ వృత్తులకు సంబంధించిన శాశ్వత వర్గాలుగా మొత్తం మానవ సమాజం విభక్తమై వుంటుంది. ఏ వర్గానికి ఎందరు ప్రజలు అవసరమో, వారిని ఏయే గుణగణాలతో సృజించాలో అంతా పాలకవర్గమే నిర్ణయిస్తుంది. మచ్చుకైనా మానవత్వం మిగలని ఆ భావి సమాజాన్ని హక్స్లీ భయంకరంగా వర్ణిస్తాడు. 1958 లో హక్స్లీ "బ్రేవ్ న్యూ వరల్డ్ రీవిజిటెడ్" అనే మరొక గ్రంథం వ్రాస్తూ, తాను ఊహించిన కృత్రిమ మానవ సమాజం తాను ఊహించిన దానికంటె త్వరగానే ఆవిర్భవించే సూచనలు కలవని వ్రాశాడు.

డాక్టర్ లూరియా సరిగా హక్స్లీ జోస్యాన్నే ప్రతిధ్వనిస్తూ, నేటి విజ్ఞాన శాస్త్ర పురోగతి మానవ సమాజాన్ని హక్స్లీ చిత్రించిన "బ్రేవ్ న్యూ వరల్డ్" వైపు తీసుకుని పోతున్నదేమోనన్న భయాన్ని వెల్లడిస్తున్నాడు. డాక్టర్ లూరియా వైద్య శాస్త్రంలో నోబెల్ బహుమతి పొందిన శాస్త్రవేత్త. ఆయన హెచ్చరికను తేలికగా కొట్టివేయడానికి వీలులేదు.

హక్స్లీ కంటె ముందుగానే 1923 లో చెకొస్లొవాక్ మహారచయిత కార్ల్ చాపెక్ "ఆర్. యు. ఆర్." అనే ఒక నాటకంలో ఇట్టిదే మరొక భావి సమాజాన్ని ఊహించి వ్రాశాడు. దానిలో మానవజాతి తనకు అన్నివిధాల వూడిగం చేయడానికి రాబట్స్‌ను — మానవ యంత్రాలను—లక్షల కొలది, కోట్ల కొలది ఉత్పత్తి చేస్తుంది. ఆ మానవ యంత్రాలు రాగం, ద్వేషం, శోకం మొదలైన మనోవేదనలలో తప్ప మిగిలిన అన్నిటిలోను మానవులనే పోలి వుంటాయి. ఉన్నట్టుండి వాటిలో మానవు లపై ద్వేషం పుట్టుకు వస్తుంది. "రాబట్స్ ఆఫ్ ది వరల్డ్, యునైట్" అనే నినా దంతో అవి తిరుగుబాటుచేసి మొత్తం మానవ జాతిని సంహరిస్తాయి. అయితే, హక్స్లీ వలె చాపెక్ నిరాశావాది కాడు. కనుక, అతడు చివరికి ఆ మానవ యంత్రా లలో ద్వేషం తర్వాత ప్రేమకూడా అంకురించినట్టు చిత్రిస్తూ నాటకాన్ని ముగిస్తా డనుకోండి.

ద్రష్టలైన ఈ మహారచయితలు జోస్యం చెప్పిన దుర్దశ దిశగా మానవాళి పురోగమిస్తున్నదా? విజ్ఞానశాస్త్రాల అభివృద్ధి హర్షించదగిందే. మానవుడు ప్రకృతి శక్తులను స్వాధీనం చేసుకొనడానికి చేస్తున్న నిరంతర యత్నం గొప్పదే. కాని ఆ యత్నం లక్ష్యమేమిటి? మానవ సంక్షేమమా? సంక్షోభమా ?

అణుగర్భంలోని అపారశక్తిని శాస్త్రజ్ఞులు విడుదల చేయగలిగారు. అది ఈనాడు లోక కళ్యాణాని కంటే మారణాస్త్రాలకే ఎక్కువగా వినియుక్త మౌతున్నది. అదే విధంగా వైద్యశాస్త్రంలో, జీవరసాయన శాస్త్రంలో, తదితర విజ్ఞాన శాస్త్రాలలో పురోగతి కూడా డాక్టర్ లూరియా హెచ్చరిస్తున్నట్టు మానవత్వ వినాశానికే వినియోగపడుతుందా?

"మేన్ ఈజ్ ది మెజర్ ఆఫ్ ఆల్ థింగ్స్" అని గ్రీకు ప్రాచీన తత్త్వవేత్త ప్రోటాగరస్ సూక్తి. మానవజాతి ఏ కొత్త శక్తులను సాధించినా అవి మానవునికి కళ్యాణ దాయకాలు కావాలి. వినాశకరాలు కారాదు. మానవుడు చేయగలిగిన నిజమైన శక్తిపూజ అదే.

(అక్టోబరు 20, 1969

# డాక్టర్ సుకర్నో

"అధికారం అవినీతికి దారి తీస్తుంది. సంపూర్ణాధికారం సంపూర్ణమైన అవినీతికి దారి తీస్తుంది.

ఇది నేడు కాలధర్మం చెందిన డాక్టర్ సుకర్ణోకు అక్షరాలా వర్తిస్తుంది. ఇండొనీషియాకు ఆయన సుదీర్ఘ కాలం, సంపూర్ణ అధికారాలతో అధినేతగా వున్నాడు. దాని దుష్ఫలితాలే చివరకు ఆయన పతనానికి కారణాలైనాయి.

సుకర్ణో జాతీయ విప్లవ నాయకుడుగా జీవితాన్ని ప్రారంభించాడు. తన దేశాన్ని డచ్చి పాలన నుంచి విముక్తం చేయడానికి ఆయన 1927లోనే—తన 25వ ఏట—ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఆసియా, ఆఫ్రికాలలోని వలస దేశాల జాతీయోద్యమ నాయకుల పడిన బాధలు ఆయనా పడ్డాడు. కారాగార శిక్షలు, ప్రవాసక్లేశం ఆయనా అనుభవించాడు. స్వదేశ విముక్తికి ఎన్నో త్యాగాలు చేశాడు.

1945లో ఆయన మహమ్మద్ హట్టాతో కలిసి ఇండొనీసియా రిపబ్లిక్ స్థాపించాడు. దానికి ఆయనే అధ్యక్షుడు. డచ్చి వారితో మరి నాలుగేళ్ళ పోరాటం తర్వాత ఇండొనీసియా స్వతంత్రమైంది. నాటి నుంచి ఇండొనీసియాలో సుకర్ణోది తిరుగులేని అధికారం. ఇండొనీసియన్ ప్రజలు మంత్ర ముగ్ధుల వలె ఆయన ఎటు ఆడిస్తే అటు ఆడారు. 1956లో ఆయన పార్లమెంటును రద్దు చేసి "గైడెడ్ డెమొక్రసీ" పేరుతో పరిపాలన ప్రారంభిస్తే దాన్ని వారు శిరసావహించారు.

1959లో ఆయన నియంతృత్వాధికారాలను స్వీకరిస్తే దానికి కూడా వారు తల ఒగ్గారు.

అయితే, దేశంలో ఆయన పట్ల ప్రబలమైన వ్యతిరేకత కూడా లేకపోలేదు. మొత్తం ఆయన పరిపాలించిన ఇరవై రెండేళ్ళ కాలంలో అయిదు హత్యా ప్రయత్నాలు జరిగాయి. ఆయన కమ్యూనిస్టులకు ప్రభుత్వంలో స్థాన మివ్వడం, వారి పలుకుబడి పెరగడానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా దోహదం చేయడం, రష్యాతో, అంతకంటె ఎక్కువగా చైనాతో సన్నిహితంగా వుండడం సైన్యానికి గిట్టలేదు.

సుదీర్ఘకాలం నియంతగా వ్యవహరించిన తర్వాత ఎంతటి మహావ్యక్తికైనా తల తిరుగుతుంది. సుకర్ణో విషయంలో కూడా అంతే జరిగింది. ఇంతేకాక, సుకర్ణో పరిపాలన అవినీతికి ఆలవాలమైంది. ఆర్థికంగా ఇండొనీసియా అధోగతి పాలైంది. దేశాభ్యుదయ ప్రయోజనాల కంటె ఆయన మలేసియాతో వైరానికి అధిక ప్రాధాన్య మిచ్చాడు.

1965లో సుకర్ణోపై సైన్యం తిరుగుబాటు చేసి, అధికారం కైవసం చేసుకోవడానికి ఆయన కమ్యూనిస్టులతో చేసిన చెలిమి, ఆయన అవినీతికర పరిపాలన ప్రధాన కారణాలు. కాగా, జగద్విదితమైన ఆయన భోగలాలసత పట్ల ఏవగింపు మరొక కారణం. మరి రెండేళ్ళ పాటు నామ మాత్రంగా ప్రెసిడెంట్ పదవిలో వున్నా, తిరిగి అధికారాన్ని చేజిక్కించుకొనాలని కలలు కన్నా ఆయన తిరిగి కోలుకోలేక పోయాడు. జీవితాంతం వరకు గృహ నిర్బంధంలోనే వుండిపోయాడు.

జూలియస్ సీజర్ పతనానికి అతని "యాంబిషన్" కారణ మంటారు. సుకర్ణో పతనానికి కూడా కారణం అదే. అయితే ఆయనను సుహార్తో ప్రభుత్వం సాధారణ విద్రోహివలె పరిగణించక, కనీసపు మర్యాదలు పాటించడానికి ఆయన ఇండొనీసియా విముక్తిని సాధించిన ప్రధానవ్యక్తి కావడమే కారణం. ఇదే ఆయనను ఆసియా చరిత్రలో చిరస్మరణీయుడుగా నిలుపుతుంది.

(జూన్ 22, 1970)

# మహానాయకుని మరణం

ఆరబ్ జాతీయుల ఆధునిక చరిత్రలో 1952వ సంవత్సరం జూలై 26వ తేదీ ఒక మహోజ్జ్వల దినం. ఆనాడు ఈజిప్టులో అవినీతి పూరితమైన రాజరిక వ్యవస్థకు రక్తపాత రహితంగా స్వస్తి జరిగింది. దాని స్థానంలో రిపబ్లిక్ అవతరించింది.

కొన్ని శతాబ్దాలుగా విమరిస్తున్న అరబ్ జాతీయత మేలుకున్నది. ఆనాడు అరబ్ జాతికి వైతాళిక గీతి పాడిన మహా మనీషి గమాల్ అబ్దుల్ నాసర్.

1970 సెప్టెంబర్ 28వ తేదీ అరబ్ ఆధునిక చరిత్రలో అంధకారమయమైన దుర్దినం. ఆనాడు నాసర్ ఆకస్మికంగా కన్ను మూశాడు.

ఆయన మరణవార్త వినగానే కయిరో నగర వీధులలో చేరిన శోక సంతప్త ప్రజా వాహినిలో ఒకడు "నన్ను వదలండి - నేను ఈనాడు అనాథుడనయ్యాను." అని విలపించాడట. అరబ్ ప్రజలు ఏ దేశంలో, ఏ ప్రభుత్వం క్రింద నివసిస్తున్నా, ఆ పౌరుని విలాపంలో ఈనాడు పాలు పంచుకుంటున్నారనడంలో సందేహం లేదు.



ఈజిప్టులో 1952 నాటి తిరుగుబాటుకు ముందు అరబ్‌లకు ఒక వ్యక్తిత్వం లేదు. తాము ఒక జాతివారమన్న భావం లేదు. తమ్ము తాము "బెడూయిన్లు"గా దేశదిమ్మరులుగా - వారు భావించుకునే వారు. వేర్వేరు దేశాలలో చెల్లా చెదరై నివసిస్తున్న అరబ్ జాతీయులపై ఆనాడు పాశ్చాత్య రాజ్యాల ఆధిపత్యం అధికంగా వుండేది.



వారిలో జాతీయ భావాన్ని మేల్కొలిపిన వాడు నాసర్. వారిలో ఆత్మ గౌరవాన్ని, స్వాతంత్ర్య కాంక్షను రగుల్కొలిపినవాడు నాసర్.



ఫరూక్ రాజు పదవీచ్యుతి తర్వాత కొన్నాళ్ళు జనరల్ నజీబ్ ఈజిప్టు ప్రధానిగా వున్నా, అసలు అధికారం నాసర్‌దే. 1954లో నజీబ్‌ను తొలగించి తాను ప్రధాని పదవిని, 1956లో అధ్యక్ష పదవిని స్వీకరించాడు. ఆ తొలి దినాలలో నాసర్ వంటి నాయకుడే లేకపోతే ఈజిప్షియన్ విప్లవం విఫలమై వుండేదే.

కాని, నాసర్ అరబ్ జాతీయతకు అప్రతిమానుడైన ప్రతీకగా భాసించింది మరొక జూలై 26వ తేదీన. 1956లో ఈజిప్షియన్ విప్లవం నాల్గవ వార్షికోత్సవ సందర్భంలో ఆయన సూయెజ్ కాల్వను జాతీయం చేయడం జరిగింది. ఇందుకు ఆగ్రహించిన బ్రిటన్, ఫ్రాన్సులు ఇజ్రాయెల్‌తో కలిసి ఈజిప్టుపై మూడు వైపుల నుంచి దండెత్తాయి. వాటికి అమెరికా సమర్థన లభించకపోవడం వల్ల, తాను జోక్యం

చేసుకోగలవని రష్యా హెచ్చరించడం వల్ల అవి తమ దాడిని విరమించినా, ఆ యుద్ధంలో నాసర్ వ్యక్తిగతంగా ప్రదర్శించిన ధైర్యసాహసాలు ఆయనను అరబ్ జాతీయులకు తిరుగులేని నాయకుడిగా చేశాయి.

ఒక వ్యక్తిని మహావ్యక్తిగా, మహానాయకునిగా చరిత్ర పరిగణించడానికి అతడు తాను కన్న కలలన్నిటిని సఫలం చేసుకోగలిగాడా, తన లక్ష్యాలన్నిటిని తన జీవిత కాలంలో సాధించగలిగాడా అన్నది ముఖ్యంకాదు. అతడు కన్న కల లెటువంటివి? అతడు లక్షించిన ఆదర్శాలెటువంటివి. వాటిని సాధించడానికి అతడు చేసిన కృషి ఎంతటిది? ఇవే ముఖ్యం.

ఒక లింకన్‌ను, ఒక లెనిన్‌ను, ఒక గాంధిని ఇటీవలి కాలంలో ఒక నెహ్రూను మహానాయకులుగా లోకం పరిగణించడానికి ఇదే కారణం. వారు తమ జీవిత కాలంలో సాధించిన దానికంటె, సాధించవలసినదే ఎక్కువ అయినా, వారు తమ లక్ష్య సాధనకై చేసిన నిరంతర కృషి, వారు తమ తమ జాతులకు ప్రసాదించిన మహోన్నత నాయకత్వం - ఇవే వారిని మిగిలిన వారికంటె విశిష్టులుగా గుర్తింప జేస్తాయి.

వారు ప్రారంభించిన మహోద్యమాలు వారి జీవిత కాలంలో పూర్తిగా సఫలం కాకపోవచ్చు. కాని, అది వారి విశిష్టతకు భంగకరం కాదు. దీనికి కారణం ఇది. వారి నాయకత్వ ప్రభావం వారితో అంతరించదు. ఏ మహా నాయకుని ప్రభావం అతనితోపాటు అంతరించదు. చిరకాలం వరకు అది అతని జాతిపై ప్రసరిస్తూనే వుంటుంది.

ఈ దృష్టినుంచి నాసర్ నాయకత్వ విశిష్టతను పరిశీలించాలి. అరబ్ జాతీయులలో ఐకమత్య సాధన ఆయన స్వప్నాలలో ఒకటి. కాని, ఆయన దాన్ని సఫలం చేసుకోలేక పోయాడు. 1958లో సిరియా నాసర్ వ్యక్తిత్వ ప్రభావానికిలోనై తనంతట తాను కోరివచ్చి ఈజిప్టుతో చేరింది. కాని, మరి కొన్నేళ్ళలోనే అది తిరిగి విడిపోయింది. వేరు పేరుకు మాత్రమే "ఐక్య అరబ్ రిపబ్లిక్" మిగిలింది. అయినా ఆయన రగిల్చిన అరబ్ జాతీయత ఆరిపోలేదు.

1967లో ఇజ్రాయెల్ చేతిలో ఈజిప్టు ఓడిపోయింది. అయినా, నాసర్ నాయకత్వం చెక్కు చెదరలేదు. ఆయన ప్రెసిడెంట్ పదవికి రాజీనామా ఇచ్చినా, ఈజిప్షియన్ ప్రజల ప్రేమాభిమానాల వల్ల ఆయన దాన్ని వెంటనే ఉపసంహరించుకో వలసి వచ్చింది. ప్రజలు విజయంలో ఒక నాయకుడిని నెత్తిపై పెట్టుకోవడం సహజం. కాని ఓటమిలో సయితం అతని పట్ల అంతటి గౌరవ విశ్వాసాలనే కలిగి వుండడం చరిత్రలోనే అరుదు. నాసర్ లేనిదే ఈజిప్టు లేదన్న భావాన్ని తన ప్రజలలో ఆయన కలిగించడమే ఇందుకు కారణం.

నేడు ఆయన శాశ్వతంగా విశ్రమించాడు. ఈజిప్టు, మొత్తం పశ్చిమాసియా అత్యంత విషమ ఘట్టంలో విహ్వలమై వున్న తరుణంలో నాసర్ కన్ను మూశాడు. ఒక వంక ఇజ్రాయెల్‌తో శాంతి చర్చలు కొనసాగుతాయా లేదా అన్న సందిగ్ధత, మరొక వంక జోర్డాన్‌లో తీవ్రవాదులైన గెరిల్లాలకు, రాజసైన్యానికి మధ్య అంతర్యుద్ధం. వేరొక వంక మొత్తం అరబ్ ప్రపంచంలో అనైక్యం.

అమెరికన్ ప్రతిపాదనల ప్రాతిపదికపై ఇజ్రాయెల్‌తో శాంతి చర్చలు జరగడం సిరియా, ఇరాక్, మరికొన్ని అరబ్ రాజ్యాలకు, అరబ్ కమాండోలకు ఇష్టం లేదు. కాని నాసర్ తన వ్యక్తిగత ప్రతిష్ఠను పణంగా పెట్టి ఈ చర్చలకు అంగీకరించాడు. ఆయన తర్వాత వాటి గతి ఏమవుతుందో తెలియదు.

మరికొద్ది సేపటిలో కన్ను మూస్తాడనగా, నాసర్ జోర్డాన్ రాజుకు, కమాం డోలకు మధ్య అంతర్యుద్ధం పరిసమాప్తికి ఒడంబడిక కుదిర్చాడు. దాని గతి ఏమవుతుందో కూడా చెప్పలేము. ఏమైనా ఆయనను అరబ్ జాతీయుల మహానాయకు డుగా లోకం చిరకాలం జ్ఞాపకం పెట్టుకుంటుంది. స్వయంగా ఒక విప్లవానికి నాయకు డైనా ఆయనది ఎంతో నిగ్రహంతో, వివేకంతో, దూరదృష్టితో కూడిన రాజనీతి. ఈజిప్షియన్ విప్లవం తొలిదశలో అది ఎటువైపు పయనిస్తుందోనని ప్రపంచం ఆందో ళనతో ఎదురు చూస్తున్న సమయంలో ఆయన నెహ్రూ, టిటోలతో పాటు అలీన విధానాన్ని వరించడం ఇందుకు ముఖ్య నిదర్శనం. ఆయన అకాల మరణంతో అరబ్ దేశాలే కాదు, ప్రపంచమే ఒక మహామనీషిని కోల్పోయింది.

(సెప్టెంబర్ 30, 1970)

# జనరల్ డిగోల్

ఫ్రాన్సు నాజీల హస్తగతమైన తర్వాత జనరల్ డిగోల్ లండన్‌లో స్థావర మేర్పరచుకుని "ఫ్రీ ఫ్రెంచి" సేనలకు అధిపతిగా జర్మనీతో పోరాటం సాగించాడు. ఆ రోజులలో ఒకసారి చర్చిల్‌తో మాట్లాడుతూ డిగోల్ "నేనే ఫ్రాన్సును" అన్నాడట.

అతడు అలా అనడం మొదటిసారి అవునో కాదో గాని తుదిసారి మాత్రం కాదు. గత సంవత్సరంలో తాను ఫ్రెంచి ప్రెసిడెంట్ పదవి నుంచి విరమించే వరకు

ఆయన పెక్కుసార్లు పెక్కు మందితో తానే ఫ్రాన్సు, ఫ్రాన్సే తాను వుండేవాడు.

ఇందులో అహంభావం వున్న మాట నిజమే. తాను కారణజన్ముడనని ఫ్రాన్సు సముద్ధరణే తన జీవిత లక్ష్యమని ఆయన దృఢంగా విశ్వసించేవాడు. ప్రెసిడెంట్‌గా వున్న రోజులలో ఎవరో ఆయనను అడిగారట. "మీ తర్వాత ఎవరు?" అని. దానికి ఆయన "మరొక డిగోల్ రావాలి" అని సమాధాన మిచ్చాడట.

రాజులకు, చక్రవర్తులకు సహజమైన రాజసం, దర్పం ఆయనలో ఉట్టి పడుతూ వుండేవి. "నేను" అనే పదం ఆయన తక్కువగా ఉపయోగించేవాడు. "జనరల్ డిగోల్ ఇలా భావిస్తున్నాడు; జనరల్ డిగోల్ అలా చేయబోతున్నాడు" అని తానే చెప్పుకునేవాడు.

అయితే ఆయన నిజంగానే కారణజన్ముడేమోనని భావించడానికి తగు కారణాలు లేకపోలేదు. కనీసం రెండుసార్లు ఆయన ఫ్రాన్సును రక్షించాడు. మొదటిది ద్వితీయ ప్రపంచ యుద్ధ సందర్భంలో జరిగింది. ఆనాడు డిగోల్ ప్రవాసంలో వుంటూ నాజీ ప్రతిఘటనోద్యమానికి నాయకత్వం వహించి వుండకపోతే ఫ్రాన్సు చరిత్ర వేరొక విధంగా వుండేది.

రెండవసారి ఆయన ఫ్రాన్సు నుంచే ఫ్రాన్సును రక్షించవలసి వచ్చింది. ద్వితీయ ప్రపంచ యుద్ధం పరిసమాప్తమైన తర్వాత డిగోల్ కొన్నాళ్ళు ఫ్రెంచి తాత్కాలిక ప్రభుత్వాధినేతగా వున్నాడు. ఆ తర్వాత రాజకీయాలకు దూరంగా పన్నెండేళ్ళు గడిపాడు. ఫ్రాన్సు రాజకీయంగా పూర్తిగా సంక్షోభంలో మునిగి పోయింది. అల్జీరియా విప్లవ కారులతో ఎడతెరపి లేకుండా సాగుతున్న యుద్ధంవల్ల ఫ్రాన్సులోనే అంతర్యుద్ధం ప్రారంభమయ్యే సూచనలు కనిపించాయి. అప్పుడు ఫ్రెంచి రాజకీయ వేత్తలు డిగోల్‌ను బ్రతిమాలి తిరిగి అధికారానికి తీసుకు వచ్చారు. 1958లో ఆయన ప్రధానిగా రెండవసారి రాజకీయాలలో ప్రవే శించాడు. 1959లో నూతన రాజ్యాంగం ఇచ్చిన అధికారంతో ప్రెసిడెంట్ అయ్యాడు.

ఆనాడు డిగోల్ అధికారం స్వీకరించకపోతే ఫ్రాన్సు రాజకీయ కల్లోలం నుంచి బయటపడేది కాదు. పదకొండేళ్ళ పాటు ఆయన ఫ్రాన్సుకు రాజకీయ సుస్థి

రత్వాన్ని ప్రసాదించాడు. ఫ్రాన్సును క్రుంగదీస్తున్న అల్జీరియన్ యుద్ధాన్ని అంతం చేసి, అల్జీరియాకు స్వాతంత్ర్య మిచ్చాడు. ఇతర విషయాలలో ఆయన వైఫల్యాలెట్టివైనా తన పదకొండేళ్ళ పదవీ కాలంలో ఆయన విజయాలుగా ఈ రెండింటిని ప్రత్యేకించి పేర్కొనాలి.

ఆయనకు అమెరికా, బ్రిటన్ పట్ల ఎందుకో విపరీతమైన వైముఖ్యం? ఫ్రాన్సు తిరిగి ఒక మహాశక్తిగా రూపొందడానికి ఈ రెండు దేశాలు అవరోధాలుగా వున్నట్టు ఆయన భావించాడు. యూరప్ రాజకీయాల నుంచి, ఆర్థిక వ్యవస్థ నుంచి వాటిని దూరంగా వుంచడానికి ప్రయత్నించాడు. నాటో కూటం నుంచి ఫ్రాన్సును ఉపసంహరించడం, కామన్ మార్కెట్టును నెలగొల్పడం, ఫ్రాన్సును అణ్వస్త్రరాజ్యంగా చేయడం, రష్యా, చైనా, వియత్నాం, పశ్చిమాసియా మొదలయిన సమస్యలపై ఆంగ్లో—అమెరికన్ విధానాలకు భిన్నమయిన విధానాలను అనుసరించడం—ఇవన్నీ ఫ్రాన్సు ఘనతను, ప్రత్యేకతను పునరుద్ధరించడానికి చేసిన పనులే. ఇవే ఆయనను ప్రపంచ రాజకీయవేత్తలలో అత్యంత వివాదాస్పదుడుగా కూడా చేశాయి.

డిగోల్ ఎంతగా స్వాతిశయపరుడైనా కొన్ని నైతిక విలువలను అమితంగా ప్రేమించే వ్యక్తి కూడా. 1969లో ఆయన అవసరం లేకపోయినా తన విధానాలపై ఫ్రెంచి ప్రజల అభిప్రాయాన్ని తెలుసుకోగోరాడు. వారి అభిప్రాయం తనకు అంత సుముఖంగా లేదని తెలిసిన తర్వాత, అవసరం లేకపోయినా పదవికి రాజీనామా ఇచ్చాడు. పదకొండేళ్ళ పాటు ఏకచ్ఛత్రాధిపత్యం నెరపిన తర్వాత ఏ దేశాధినేత ఈ విధంగా అధికారం నుంచి విష్క్రమిస్తాడు? అది ఆయన నైతికౌన్నత్యానికి నిదర్శనం.

డిగోల్ నిస్సందేహంగా ఈ శతాబ్దపు మహా వ్యక్తులలో ఒకడు. ఆయన మితి మీరిన స్వాతిశయం కలవాడు. కాని ఆ స్వాతిశయానికి తగినట్టుగా ఆయన కొన్ని ఘన విజయాలను సాధించాడు. ఆయన మరణం వల్ల ఫ్రాన్సు ఒక మహా నాయకుని కోల్పోయింది. ప్రపంచం ఒక గొప్ప రాజనీతివేత్తను పోగొట్టుకున్నది.

(నవంబర్ 12, 1970)

మాడపాటి హనుమంతరావుగారు ఎనభై ఆరేళ్ళ వండు ముదుసలి. వండు వలెనే ఆయన రాలిపోయినా, ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ఆయన నిర్యాణం గాఢ సంతాపం కలిగిస్తుంది.

"ఆతడనేక యుద్ధముల నారియు తేరిన వృద్ధమూర్తి." అన్నట్టు హనుమంతరావు గారికి ఆ రోజులలో సంబంధంలేని తెలంగాణా ఉద్యమం వుండేది కాదు. గ్రంథాలయోద్యమం, తెలుగు భాషోద్యమం, విద్యావ్యాప్తి ఉద్యమం, రాజకీయోద్యమం - అన్నిటిలో ఆయన ప్రధాన పాత్ర వహించారు.

నైజాం పాలనలో మొత్తం హైదరాబాదు సంస్థానమే వెనుకబడివడి కాగా, తెలంగాణా ప్రాంతం మరింతగా వెనుకబడి వుండేది. దాని సర్వతోముఖాభివృద్ధికి ప్రజలను జాగరితులను చేయడానికి ఆయన నిర్విరామకృషి చేశారు.

ప్రజలలో ఏవిధమైన చైతన్యం కలగాలన్నా ముందుగా వారు విద్యావంతులు కావాలి. ఇందుకోసం ఆయన తెలుగు బోధనాభాషగా పెక్కు పాఠశాలలను నెలకొల్పారు. వయోజనులలో విద్యావ్యాప్తి కోసం పాటుపడ్డారు. దానికితోడుగా గ్రంథాలయోద్యమాన్ని నిర్వహించారు.

1921లో ఆంధ్ర జనసంఘం స్థాపనతో ఆయన రాజకీయాలలో ప్రవేశించారు. దాని తర్వాత ఆంధ్రమహాసభ స్థాపకులలో ఒకరై 1935లో సిరిసిల్లలో జరిగిన సమావేశానికి అధ్యక్షత వహించారు. మరి మూడేళ్ళ తర్వాత అదే సంస్థాప

కాంగ్రెస్‌గా రూపాంతరం చెంది మొత్తం సంస్థానాన్ని నైజాం పాలన నుంచి విముక్తం చేయడానికి ఒక మహత్తర సాధనంగా రూపొందింది.

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత, హైదరాబాదు సంస్థానం నైజాం నిరంకుశ పాలన నుంచి విముక్తమైన తర్వాత, హనుమంతరావుగారు విశాలాంధ్ర స్థాపన కోసం కీర్తిశేషుడు అయ్యదేవర కాళేశ్వరరావుగారితో కలిసి తీవ్ర కృషి చేశారు. నిజానికి కాళేశ్వరరావుగారికి హనుమంతరావు గారికి ఒకటి కాదు, పెక్కు పోలికలు వున్నాయి.

ఇరువురు నందిగామ తాలూకాలో జన్మించిన వారే. నందిగామ తాలూకా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు సరిహద్దులో వున్నది. అది ఉభయ ప్రాంతాల "సరిహద్దు రాయిగా" కాకుండా రెండింటిని కలిపే వారధిగా వుండాలనే ఇరువురు ఆశించారు. ఇరువురూ న్యాయవాద వృత్తికి చెందినవారే. ఇరువురూ రచయితలే, రచయితలను ప్రోత్సహించినవారే, గ్రంథాలయోద్యమం పట్ల ఆసక్తి చూపించిన వారే. ఇరువురూ విశాలాంధ్ర కోసం కలలు కన్నవారే. తమ కలలు సఫలం కావడం కళ్ళారా చూచి ఆనందించినవారే.

అంతేకాదు: ఆంధ్రప్రదేశ్ అవతరించిన తర్వాత ఏర్పడిన మొదటి లెజిస్లేటివ్ అసెంబ్లీకి ఒకరు స్పీకర్ కాగా, మొదటి లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు రెండవ వారు ఛైర్మన్ అయ్యారు. ఆ పదవులలో వున్నవారికి ఎంత వరకు సాధ్యం కాగలదో అంత మేరకు ఆంధ్ర తెలంగాణాలమధ్య సామరస్య సాధనకు ఇరువురూ కృషి చేశారు. దేశానికి వారు చేసిన బహుముఖ సేవలను గుర్తించి భారత ప్రభుత్వం ఇరువురికి పద్మభూషణ్ బిరుదు నిచ్చి గౌరవించింది.

హనుమంతరావుగారు తెలంగాణాలో పాల్గొనని ఉద్యమం ఒకటే వున్నది. అది ప్రత్యేక తెలంగాణా ఉద్యమం. వృద్ధాప్యంలో తాను వ్యాధిగ్రస్తులై వున్న చివరి రోజులలో ప్రారంభమైన ఈ ఉద్యమం ఆయనకు ఎంతో మనస్తాపం కలిగించి వుండాలి. ఏ ఆంధ్ర, తెలంగాణా సమైక్యం కోసం ఆయన కృషి చేశారో దాన్ని కాపాడుకోవడమే ఆయనకు తెలుగు వారు అర్పించ గలిగిన నివాళి. ఆయన ధన్యజీవి. "ఆంధ్ర పితామహుడు"గా ఆయన తెలుగు వారికి చిరస్మరణీయులు.

(నవంబర్ 13, 1970)

# సి. వి. రామన్

"నా మతం సైన్సే, జీవితాంతం వరకు దానినే ఆరాధిస్తాను."

సుమా రొక నెల రోజుల క్రిందట తనను చూడవచ్చిన పత్రికా విలేఖరులతో డాక్టర్ సి. వి. రామన్ పై విధంగా అన్నారట. దీనిలో అతిశయోక్తి అవంతైనా లేదు. ఆయన విజ్ఞాన నిధి, విజ్ఞాన తపస్వి, అరవై సంవత్సరాల పాటు విజ్ఞాన శాస్త్రాన్నే తన మతంగా స్వీకరించి, భౌతిక తత్త్వాన్వేషణకే తన జీవితాన్ని అంకితం చేసిన మహా మనీషి. తుదిక్షణం వరకు ఆ అన్వేషణ కొనసాగిస్తూనే ఆయన వేను కన్ను మూశారు.

ఈ శతాబ్దిలో అగ్రశ్రేణికి చెందిన శాస్త్రవేత్తలలో ఆయన ఒకరు. ఆయన పేరు మీదుగా ప్రసిద్ధమైన "రామన్ ఎఫెక్టు"ను కనిపెట్టినందుకు గాను 1930లో ఆయనకు నోబెల్ ఫిజిక్సు బహుమతి లభించింది. ఆ బహుమతిని పొందిన మొదటి భారతీయ శాస్త్రవేత్త, మొదటి ఆసియన్ శాస్త్రవేత్త కూడా ఆయనే. ప్రపంచ విజ్ఞాన శాస్త్ర రంగంలో ఇండియాకు గౌరవనీయమయిన స్థానం కల్పించిన ఘనత ఆయనదే.

భారతదేశపు ఘనత అంతా దాని ఆధ్యాత్మిక, ఆముష్మిక జీవన విధానంలోనే నిక్షిప్తమై వున్నదని మనలో పలువురు భావిస్తారు. ఇది మన ప్రాచీన చరిత్రను మనమే సరిగా అర్థం చేసుకోక చెప్పే మాట.

నిజమే; ఒకనాడు భారతదేశం సమకాలిక ప్రపంచానికి అన్ని రంగాలలో తల మానికంగా వుండేది. దాని నాగరికత, సంస్కృతి, మహోచ్చ స్థితిలో వుండేవి. దానికి కారణం మన ఆముష్మిక జీవన విధానం కాదు. ఆనాడు దేశం సర్వ సంపదలతో తుల తూగుతూ వుండేవి. భౌతికంగా సర్వ సమృద్ధమై వుండేది. కనుకనే, ఆ రోజు లలో భారతీయ కళలు, విజ్ఞాన శాస్త్రాలు కూడా మహోన్నత స్థితిలో వుండేవి. గణితం, ఖగోళం, వైద్యం, లోహాల తయారీ, పరిశ్రమలు మొదలైన వివిధ రంగాలలో మన దేశం పరాకాష్ఠను చేరుకున్నది.

ఆధ్యాత్మిక జీవనానికి ప్రాముఖ్యమిచ్చి భౌతిక జీవనాన్ని మిధ్యగా భావించడం ప్రారంభమైనప్పటి నుంచే మన జాతి ఇటు భౌతికంగా, అటు ఆధ్యాత్మికంగా కూడా అధఃపతనం కావడం మొదలుపెట్టింది. మన విజ్ఞాన శాస్త్రాలు అడుగంటాయి. ఎప్పుడో మనది వైభవోపేతంగా బ్రతికిన జాతి అని చెప్పుకోవడం తప్ప మనకు ఏమీ మిగలలేదు.

తిరిగి మన దేశంలో క్రిందటి శతాబ్దిలో విజ్ఞానశాస్త్రాలపట్ల అభిరుచిని, ఆసక్తిని పల్లవింప జేసిన కీర్తి మహేంద్రలాల్ సర్కార్‌ది. మౌలిక పరిశోధనలకు ఆయన దోహదం చేశాడు. ఆయన తర్వాత జగదీశ చంద్రబోసు, ప్రఫుల్ల చంద్ర రే వంటి మహనీయులు విజ్ఞానశాస్త్ర రంగంలో మహత్తర కృషి చేశారు. వారి కోవకు చెందిన వారే సి.వి. రామన్, మేఘనాథ్ సాహా, ఎస్. చంద్రశేఖర్, హెచ్. జె భాభా వంటి ప్రఖ్యాత శాస్త్రవేత్తలు. వీరు వ్యక్తిగతంగా తాము విజ్ఞాన శాస్త్రాలలో కృషి చేయడమే కాక, మొత్తం దేశంలోనే విజ్ఞాన శాస్త్రాభిరుచిని పెంపొందించ డానికీ, అందుకు తగు వాతావరణాన్ని కల్పించడానికి పాటుపడ్డారు.

సి.వి. రామన్ తనకు లభించిన నోబెల్ బహుమతి ధనంతో బెంగుళూరులో ఒక రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్‌ను స్థాపించారు. ఎందరో యువ శాస్త్రవేత్తలను ప్రోత్స హించారు. శిక్షణ ఇచ్చారు.

ఆయన ప్రత్యేకించి కాంతి, దృష్టి, రంగు, క్రిస్టల్స్, వజ్రాలు మొదలైన

వాటిపై ఎన్నో అమూల్య విశేషాలను కనిపెట్టారు. కాంతి ఏదైనా ద్రవ పదార్థంపై పడినప్పుడు ఆ కాంతిలోని ఒక స్వల్ప భాగం కొంత శక్తిని పోగొట్టుకుంటుందని ఆయన తన ప్రయోగాలతో నిరూపించాడు. ముఖ్యంగా ఆల్కహాల్‌పై కాంతి ప్రభావాన్ని ఆయన కనిపెట్టాడు. దీన్నే "రామన్ ఎఫెక్ట్" అంటున్నారు.

ఈ సందర్భంలో ఒక ఛలోక్తిని పేర్కొనడం అప్రస్తుతం కాదేమో! "రామన్ ఎఫెక్ట్"ను కనుగొన్నందుకు లభించిన నోబెల్ బహుమతిని స్వీకరించడానికి సి. వి. రామన్ స్టాక్‌హోం వెళ్ళారు. బహుమతి ప్రదానం తర్వాత ఆయన తన "రామన్ ఎఫెక్ట్"ను వివరించారు. తర్వాత ఆయన అభిమానులు పాన గోష్ఠికి ఆహ్వానించి మద్యం ఇవ్వబోగా ఆయన నిరాకరించారు. అది చూచి ఒక శాస్త్రవేత్త "ఇది న్యాయం కాదు, ఆల్కహాల్‌పై రామన్ ఎఫెక్టు ఎలా వుంటుందో ఇప్పుడే తెలుసుకున్నాము. మరి రామన్‌పై ఆల్కహాలు ఎఫెక్టు ఎలా వుంటుందో తెలుసుకునే అవకాశం ఇవ్వరా?" అని అడిగారట.

వ్యక్తిగా రామన్ నిరాడంబరుడు, నిగర్వి, మంచి సంభాషణా చతురుడు. మరొక మహా మేధావి ఐన్‌స్టయిన్ వలెనే రామన్‌కు కూడా సంగీతం వల్ల ముఖ్యంగా వయొలిన్, వీణ, తంబుర, మృదంగం, పియానో వాద్యాల వల్ల అమితాసక్తి, కొంత ప్రవేశం కూడా వున్నాయి.

ఆయన ధన్యజీవి. ఎనభై రెండు సంవత్సరాల జీవితంలో ఆయన స్వదేశీయుల నుంచి, విదేశీయుల నుంచి అన్ని గౌరవాలను పొందారు. బ్రిటిష్ ప్రభుత్వం 1929లో ఆయనను "సర్" బిరుదంతో గౌరవించింది. రాయల్ సొసైటీలో ఆయన ఫెలోషిప్ పొందారు. సోవియట్ అకాడమీలో ఆయనకు గౌరవ సభ్యత్వం వున్నది. 1954లో ఆయనకు భారత ప్రభుత్వం "భారత రత్న" బిరుదు ఇచ్చింది. ఇక మిగిలిన సత్కారాలకు, సన్మానాలకు, గౌరవ బిరుదులకు లెక్కలేదు. ఆయన జీవిత చరిత్ర, వైజ్ఞానిక కృషి మన యువ శాస్త్రవేత్తలకు ఆదర్శప్రాయమై వర్ధిల్లుతుంది. ఆయన అస్తమయంతో భారతదేశం ఒక మహా విజ్ఞానవేత్తను కోల్పోయింది.

(నవంబర్ 22, 1970)

# సాహిత్యంలో అశ్లీలం

సాహిత్యంలో అశ్లీలం వుండవచ్చునా? ఇది చిరకాలంగా విమర్శకులను, ప్రభుత్వాలను కూడా వేధిస్తున్న ప్రశ్న .

దీనికి సమాధానం చెప్పడానికి ముందు ఏది అశ్లీలం , ఏది కాదు అన్న ప్రశ్నకు సమాధానం చెప్పాలి. ఈ పని చేయవలసింది సహృదయులైన పాఠకులూ విమర్శకులే కాని ప్రభుత్వాధికారులూకారు; న్యాయస్థానాలూకూడా కావు.

సుప్రసిద్ధుడైన బెంగాలీ కవి, నవలా రచయిత, విమర్శకుడు అయిన బుద్ధదేవబోసు రచించిన "రాత్ భోరే బృష్టి" అనే నవల అశ్లీలమైనదని ఇటీవల కలకత్తాలో అడిషనల్ చీఫ్ ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ నిర్ణయించి రచయితకు రెండు వందల రూపాయల జరిమానా, లేకపోతే ఒక నెల జైలుశిక్ష విధించారు. ఈ వార్త సాహిత్య ప్రియులకు నిజంగా ఆందోళనకరమైనది.

ఈ సందర్భంలో ముఖ్యంగా జ్ఞాపకం వచ్చే సంఘటనలు రెండు వున్నాయి. ఒకటి జేమ్స్ జాయిస్ నవల "యులిసెస్" పై నిషేధం. అది 1922లో వెలువడి నప్పుడు దాని కాపీలను న్యూయార్క్ పోస్టల్‌శాఖవారు దహనం చేశారు. 1923లో దాని రెండవ ఎడిషన్ ప్రతులను స్వాధీనం చేసుకున్నారు.

మరొక సంఘటన డి. హెచ్. లారెన్సు నవల "లేడీ చాటర్లీస్ లవర్" కు సంబంధించి నట్టిది. దాన్ని కూడా బ్రిటిష్ ప్రభుత్వం మొదట నిషేధించింది. ఈ రెండు సందర్భాలలోను కూడా సుప్రసిద్ధులైన బ్రిటిష్ రచయితలనేకులు జాయిస్, లారెన్స్‌ల నవలలు అశ్లీలమైనవి కావని, వాటిని నిషేధించడం అన్యాయమని ఆక్షేపిస్తూ ప్రకటనలు చేశారు.

"యులిసెస్"పై అమెరికాలో నిషేధం 1933 వరకు తొలగిపోలేదు. "లేడీ చాటర్లీస్ లవర్" పై 1960 వరకు నిషేధం కొనసాగింది. 1959లో అశ్లీల ప్రచుర ణల చట్టానికి జరిగిన సవరణలను ఆధారం చేసుకుని పెన్‌గ్విన్ సంస్థ లారెన్స్ నవల కేసులో గెలిచింది.

దురదృష్టవశాత్తు ఇండియాలో అశ్లీలంగా వున్నవనే పేరుతో కొన్ని నిజ మైన సాహిత్యపు విలువలు కలిగిన గ్రంథాలపై నిషేధం కొనసాగుతున్నది. బుద్ధదేవబోసు రచనపై నిషేధం కూడా ఈ కోవకు చెందినదేనని పలువురు ప్రఖ్యాత బెంగాలీ రచయితలు అభిప్రాయ పడుతున్నారు.

అశ్లీలం పేరుతో నిషేధించవలసి వస్తే కోణార్క దేవాలయాన్ని పడగొట్టి బంగాళాఖాతంలోనికి త్రోసివేయాలి. ఖజురహో శిల్పాలను ధ్వంసం చేయాలి. దక్షిణాదిన గల పెక్కు దేవాలయాలను నేలమట్టం చేయాలి. మనకు వారసత్వంగా వచ్చిన ప్రాచీన కళాఖండాలలో పెక్కింటిని భూగర్భంలో పాతిపెట్టాలి.

ఇంతేకాదు. అశ్లీలంగా వున్నవనే కారణాన మన ప్రబంధాలను, పురాణాలను దహనం చేయవలసి వస్తుంది. ఒకప్పుడు కొన్ని ప్రబంధాలను ముద్రించినందుకు గాను వావిళ్ళవారిపై కేసు పెట్టడం జరిగింది కూడా. ఈ విధంగా కేసులు పెడుతూ పోతే, పూర్వపు సంస్కృత సాహిత్యంలో గాని, ప్రాంతీయ వాఙ్మయాలలో గాని మనకు మిగిలేది చాలా తక్కువ. ఉదాహరణకు జయదేవుని "గీత గోవిందం" వంటి సుందరకావ్యం కూడా నిషిద్ధమైపోతుంది.

బోసు నవల విషయమై యు. ఎన్. ఐ. వార్తాసంస్థ ప్రముఖ రచయితలతో, చేసిన ఇంటర్వ్యూలలో ఒక్క తారాశంకర్‌బెనర్జీ మాత్రమే భిన్నాభిప్రాయం వెలిబుచ్చారు. రచయిత ఏది పడితే అది వ్రాయకూడదని, అసభ్య శృంగారాన్ని వర్ణించే రచనను నిషేధించే హక్కు ప్రభుత్వానికి వున్నదని ఆయన అంటున్నారు.

నిజమే కాని, సాహిత్యంలో ఏది అసభ్యమో, ఏది కాదో నిర్ణయించవలసింది పండితులు, విమర్శకులే కాని ప్రభుత్వాలు మాత్రం కావు. 1960లో పెన్గ్విన్ సంస్థపై కేసులో లారెన్సు నవల అసభ్యమైనది కాదని పలువురు సాహిత్యవేత్తలు చెప్పిన సాక్ష్యాన్ని పురస్కరించుకుని బ్రిటిష్ ప్రభుత్వం దానిపై నిషేధాన్ని తొలగించింది.

నిజమైన సాహిత్యానికి నిషిద్ధమైనదేదీ లేదు. మొత్తం మానవ జీవితం దానికి ఇతివృత్తం. రమ్యమైనది, జుగుప్సితమైనది కూడా సాహిత్యంలో సమానంగా ఆదరణీయాలని ప్రాచీన సంస్కృతాలంకారికులే అంగీకరించారు. క్రైస్తవ నీతిలో ఏమోగాని, హైందవధర్మం ప్రకారం సాహిత్యంలో శృంగారం నిషిద్ధం కాదు. రచయిత పాఠకులలో కేవలం పాశవిక ప్రవృత్తిని రెచ్చగొట్టడానికే శృంగార వర్ణన చేశాడా, లేక ఉదాత్త ప్రయోజనాన్ని ఆశించి, మానవ మనస్తత్వ విశ్లేషణ కోసం చేశాడా అన్నది చూడాలి. ముఖ్యంగా బుద్ధదేవబోసు వంటి అగ్రశ్రేణి రచయితలు కేవలం అసభ్యతను అసభ్యతకోసమే వర్ణిస్తారని విశ్వసించడం కష్టం. రచయితల పట్ల ఉదారదృష్టితో నిబంధనలను వర్తింప జేయకపోతే సాహిత్యానికే తీరని అపచారం జరుగుతుంది.

(డిసెంబరు 24, 1970)

# నోబెల్ సాహిత్య బహుమతి

నోబెల్ సాహిత్య బహుమతి ఈ యేడాది ఒక కమ్యూనిస్టు రచయితకు లభించడం విశేషం. ఆ బహుమతిని అందుకోబోతున్న చిలియన్ కవి పాబ్లో నెరూడా తీవ్ర భావాలుగల కమ్యూనిస్టు.

క్రిందటి సంవత్సరం నోబెల్ సాహిత్య బహుమతి వివాదగ్రస్తమైంది. రష్యన్ రచయిత అలెగ్జాండర్ సోల్జెనిట్సిన్‌కు ఆ బహుమతి లభించగా, దాన్ని స్వీకరించడానికి ఆయనకు రష్యన్ ప్రభుత్వం అనుమతి ఇవ్వలేదు. ఆయన అధికారుల ఆగ్రహానికి గురియైన రచయిత. రష్యాలో సమకాలిక జీవిత పరిస్థితులపట్ల ఆయన అభిప్రాయాలు వేరు, అధికారుల అభిప్రాయాలు వేరు. ఆయన తన అభిప్రాయాలను దాచుకోకుండా తన రచనలలో వ్యక్తం చేశాడు. ఆయనకు సాహిత్య బహుమతి ఇవ్వడాన్ని రాజకీయ కారణాలతో చేసిన పనిగా రష్యా విమర్శించింది. అంతేకాక, సోల్జెనిట్సిన్ సాధారణ రచయిత అని, ఆయన రచనలలో విశిష్టత ఏమీలేదని కూడా ప్రకటించింది.

నోబెల్ సాహిత్య బహుమతులను ప్రదానంచేసే స్వీడిష్ అకాడమీపట్ల రష్యా ఇట్టి ఆరోపణలు చేయడం అదే మొదటిసారి కాదు. అంతకు ముందు "డాక్టర్ జివాగో" నవలా రచయిత బోరిస్ పాస్టర్నాక్‌కు నోబెల్ బహుమతి ఇవ్వడానికి నిర్ణయం జరిగినప్పుడు కూడా రష్యా దాన్ని రాజకీయ దృష్టితో చేసిన నిర్ణయంగానే పరిగణించింది. ఆ తర్వాత తనకు గౌరవాస్పదుడైన మిఖాయిల్ షోలొఖోవ్‌కు ఆ బహుమతి ఇచ్చినప్పుడు మాత్రం రష్యా మారు మాట్లాడకుండా దాన్ని అంగీకరించడమే కాక, సరైన నిర్ణయం జరిగినట్లు కూడా ప్రశంసించింది.

నోబెల్ సాహిత్య బహుమతుల నిర్ణయం రాజకీయ రాగద్వేషాలను పురస్కరించుకుని జరుగుతుందని ఆరోపించడానికి ఆస్కారం లేదు. సాహిత్యంలో విశేష కృషి చేసిన వారికి, మౌలికమైన ప్రతిభతో సాహిత్యాన్ని పరిపుష్టం చేసిన వారికి - వారు ఏ దేశం వారైనా, ఏ జాతివారైనా, ఏ రాజకీయ భావాలు కలవారైనా-ఆ బహుమతి ఇవ్వడం జరుగుతుంది. దానిలో సాహిత్య ప్రతిభకే తప్ప రాజకీయ విభేదాలకు తావు లేదనడానికి మార్క్సిస్టు కవి నెరూడాకు ఆ బహుమతి ఇవ్వాలని నిన్న స్వీడిష్ అకాడమీ చేసిన నిర్ణయమే నిదర్శనం.

పాబ్లో నెరూడా జన్మతః చిలీ దేశీయుడైనా ఆయనను తమ ఏకైక మహాకవిగా అన్ని లాటిన్ అమెరికన్ దేశాలు అంగీకరిస్తున్నాయి. స్పెయిన్‌లో అంతర్యుద్ధం సమయంలో ఆయన మాడ్రిడ్ నగరంలో తన దేశపు కాన్సల్‌గా వుండే

నాడు—ఫాసిస్టుల దురాగతాలను ప్రత్యక్షంగా చూచిన తర్వాత ఆయన కమ్యూనిస్టుగా మారాడట. అంతకు ముందు ఆయన సర్రియలిస్టు కవిత్వాన్ని, రొమాంటిక్ ధోరణి కవిత్వాన్ని వ్రాసి గొప్ప పేరు తెచ్చుకున్నాడు. కమ్యూనిజంను వరించిన తర్వాత ఆయన కమ్యూనిస్టు ప్రపంచానికి కూడా అభిమాన పాత్రుడై నాడు.

ఒక భాషలోని కవిత్వపు సౌందర్యాన్ని మరొక భాషలో అనువాదాల ద్వారా ఆస్వాదించడం సాధారణంగా సాధ్యం కాదు. నెరూడా కవితా ప్రాగల్భ్యాన్ని ఇంగ్లీషు అనువాదాల ద్వారా పూర్తిగా గ్రహించడం కష్టమే. కాని, ఆయన నిత్యం ప్రజల నోళ్ళలో మెదిలే మామూలు భాషనే తీసుకుని, దానికి గొప్ప శక్తిని, సౌంద ర్యాన్ని ఆపాదించాడని, ఆయన కవితలో జీవశక్తి ఉట్టిపడుతూ వుంటుందని విమర్శకులు ప్రశంసిస్తారు. ఆయనపై అటు రష్యన్ మహాకవి మయకోవ్‌స్కీ ప్రభావం, ఇటు అమెరికన్ మహాకవి వాట్‌విట్మన్ ప్రభావం సమానంగా వున్నవని కూడా చెబుతారు.

కవిత్వం కవిత్వం కోసం కాదని, ప్రజలకోసమని నెరూడా భావించడంలో ఆశ్చర్యం లేదుగాని, కవిత్వం భూమిలోనుంచి త్రవ్వి తీసిన లోహాల వలె, భూమిలో పండించిన ఆహారధాన్యాలవలె ప్రజలు నిత్యజీవితంలో ఉపయోగించడానికి వీలుగా వుండాలని ఆయన వాదిస్తాడు. "రచయిత సైనికుని వంటివాడు, జీవితాభిముఖంగా అతడు నడవాలి. అటు ఇటు ఊగిసలాడకుండా నిబ్బరంగా నడవాలి" అని ఆయన ఒకసారి రచయిత కర్తవ్యాన్ని నిర్వచించాడు.

రాజకీయంగానే కాక కవితా విషయంలో కూడా నెరూడా వివాదాస్పదుడైన వ్యక్తి అని తెలిసి కూడా "భంగపడిన మానవౌన్నత్యం" పక్షాన నిలబడిన కవిగా ఆయనకు సాహిత్య బహుమతి యిస్తున్నట్టు స్వీడిష్ అకాడమీ తన నిష్పాక్షిక దృక్ప థాన్ని మరొకసారి రుజువు చేసుకున్నది.

(అక్టోబర్ 23, 1971)

# మధుర గాయకుడు

ఆ కంఠం ఒకసారి విషాద భారంతో గంభీరంగా పలుకుతుంది. మరొకసారి ఉత్సాహంతో ఉరకలు తీస్తుంది, వేరొకసారి భక్తి పారవశ్యంతో ఉన్మీలితమౌతుంది. ఇంకొకసారి చిలిపితనంతో చిందులు తొక్కుతుంది. ఒక్కక్షణం తారస్థాయిలో, మరుక్షణం మంద్రస్థాయిలో వివిధ విన్యాసాలు చేస్తుంది, ఎన్నో ఒదుగులు పోతుంది. ఎన్నో సొగసులు చూపిస్తుంది. అది అమృతవర్షిణి. సుధాస్రోతస్విని.

ఆ మధుర కంఠం ఘంటసాల వెంకటేశ్వరరావుది. అది మొన్న శాశ్వతంగా మూగవోయింది. లక్షలాది అభిమానులను నిర్వేదంలో మిగిల్చి నీరవమైపోయింది.

సుమారు మూడు దశాబ్దాలుగా తెలుగునాట ఘంటసాల పాట ఊరూరా, ఇంటింటా, ప్రజలనోట ప్రతిధ్వనించింది. చలన చిత్రాలలో, రేడియోలో, గ్రామొఫోను రికార్డులలో అది శ్రోతలను రసపరవశులను చేసింది.

తెలుగు లలితసంగీతం ఆయన బాణీతో సుసంపన్నమైంది. ముఖ్యంగా భావ యుక్తంగా పద్యం ఆలపించడంలో ఘంటసాల తర్వాతే ఎవరైనా! ఎన్నో సాధారణ రాగాలు ఆయన గొంతులో కొత్త సొగసులు సంతరించుకునేవి. ఇక తెలుగు చలన చిత్ర సంగీతానికి ఆయన దోహదం ఇంతింతననరానిది, ఎన్నటికి మరువరానిది.

ఆయన అకాలమరణంతో తెలుగు చలనచిత్ర లోకం, లలిత సంగీత ప్రపంచం ఒక గొప్ప కళాకారుని కోల్పోయాయి. ఆయనలేని వెలితిని పూరించడం కష్టం. అయినా, ఆయన మిగిల్చి వెళ్ళిన వేలాది మధురగీతాల గ్రామొఫోను రికార్డులలో ఆయన స్మృతి కలకాలం నిలుస్తుంది.

(ఫిబ్రవరి 13, 1974)

# మహా శాస్త్రవేత్త

భారతదేశం నేడు (సోమవారం నాడు) ఒక మహా శాస్త్రవేత్తను కోల్పోయింది. ఆయన పేరు సత్యేంద్రనాథ్ బోస్.

ఆధునిక వైజ్ఞానిక రంగంలో పాశ్చాత్య దేశాలకంటే ఇండియా చాలా ఆలస్యంగా అడుగుపెట్టింది. నేటికైనా అది ఈ రంగంలో పాశ్చాత్య దేశాల కంటే వెనకబడే వున్నది. అయినా ఈ కొద్దికాలంలోనే మహా శాస్త్రవేత్తలు పలువురు ఇండియాలో ప్రభవించారు. తమ ప్రజ్ఞాప్రాభవాలతో ప్రపంచ విజ్ఞాన శాస్త్రాలకే వారు విశేషమైన దోహదం చేశారు. వృక్షశాస్త్రంలో జగదీశ్ చంద్రబోస్, భౌతిక శాస్త్రంలో సి.వి. రామన్, ఖగోళ శాస్త్రంలో మేఘనాథ్ సాహా, ఎస్. చంద్రశేఖర్, జీవ రసాయనిక శాస్త్రంలో హర్ గోవింద్ ఖొరానా వంటి వారు చేసిన మౌలిక పరిశోధనలు వారికి అంతర్జాతీయ ఖ్యాతిని సంపాదించి పెట్టాయి.

వారి కోవకు చెందిన వాడే సత్యేంద్రనాథ్ బోస్. ఆయన భౌతిక శాస్త్రజ్ఞుడు. ప్రత్యేకించి అణు శాస్త్రజ్ఞుడు. ఈ రంగంలో, ముఖ్యంగా, క్వాంటం, రెలెటివిటీ సిద్ధాంతాలలో ఆయన చేసిన కృషి ఐన్‌స్టయిన్ నుంచి ప్రశంస పొందింది. అణువులోని వేర్వేరు "పార్టికిల్స్"లో ఒక వర్గానికి మరొక ప్రఖ్యాత శాస్త్రవేత్త ఎన్రికో ఫెర్మి పేరు మీదుగా "ఫెర్మియాన్స్" అని, దానికి విభిన్న లక్షణాలు గల మరొక వర్గం పార్టికిల్స్‌ని బోస్ పేరు మీదుగా "బోసాన్స్" అని ప్రపంచ శాస్త్రవేత్తలు నామకరణం చేయడం జరిగి ది. ఒక సిద్ధాంతానికి "బోస్—ఐన్‌స్టయిన్ స్టాటిస్టిక్స్" అని పేరు పెట్టి బోస్‌ను గౌరవించడం జరిగింది.

విజ్ఞానానికి ఎల్లలు లేవు. దానికి జాతి, మత, తదితర విభేదాలతో నిమిత్తం లేదు. అది మానవుల సమష్టి సంపద. ఆ సంపదకు ప్రోది చేసిన ప్రపంచ మేధావులతో పాటు భారతీయ వైజ్ఞానికుడు సత్యేన్ బోస్ పేరు చిరస్థాయిగా నిలిచిపోతుంది.

(ఫిబ్రవరి 5, 1975)

# నవ్యాంధ్ర నిర్మాత

ఆయన అక్షరాలా నవ్యాంధ్ర నిర్మాత. కందుకూరి వీరేశలింగం లేనిదే నేటి ఆంధ్రావని లేదు, నేటి ఆంధ్రావళి సంస్కృతం లేదు.

తెలుగువారిని తరతరాల సుషుప్తి నుంచి మేల్కొలిపిన తొలి వైతాళికుడు వీరేశలింగం.

పాశ్చాత్య విద్యా, సంస్కృతీ సంపర్కంతో ఇండియాలో మొదటగా మేల్కొలిపిన ప్రాంతం బెంగాల్. రాజా రామమోహనరాయ్ ప్రారంభించిన పునరుజ్జీవనోద్యమం బెంగాల్ నుంచే తక్కిన ప్రాంతాలకు ప్రాకింది. తెలుగు నాట ఈ ఉద్యమాన్ని అంది పుచ్చుకుని, నిర్వహించిన ఘనత వీరేశలింగానిది.

ఆయనకు సంఘ సంస్కర్తగా పేరు వచ్చినా, నిజానికి ఆయన సాంఘిక విప్లవకారుడు. పాత సమాజాన్ని కూకటి వేళ్ళతో పెళ్ళగించి, కొత్త సమాజాన్ని పాదుకొల్పడానికి ప్రయత్నించాడు. మతం పేరుతో, సంప్రదాయం పేరుతో చెల్లుతున్న అనేక దురాచారాలను, అనాచారాలను, మూఢ విశ్వాసాలను, తన వాద పటిమతోనే కాదు. ఒక రాజకీయ విప్లవ కారునికి వుండవలసిన ఉద్వేగంతో, దీక్షతో, దక్షతతో ఆయన ప్రతిఘటించాడు.

వితంతు పునర్వివాహాలు చేయించిన సంస్కర్తగానే వీరేశలింగం ప్రసిద్ధుడు. కాని, పెక్కు రంగాలలో పెక్కుమంది తీసుకు రావలసిన విప్లవాలను ఆయన దాదాపు ఒంటరిగా తీసుకు వచ్చాడు. స్త్రీలకు విద్య హక్కును సంపాదించి

పెట్టడానికి ఆయన చేసిన కృషి సామాన్యమయింది కాదు. వడుపు వృత్తి నిర్మూలనకు ఆయన తలపెట్టిన ఉద్యమం తక్కువది కాదు. అధికారులలో లంచగొండితనాన్ని బయట పెట్టడానికి ఆయన చేసిన సాహసాలు జగద్విదితాలు.

ఆయన కవి, పండితుడు. తెలుగులో నవలా రచనకు శ్రీకారం చుట్టింది ఆయన. తెలుగులో మొదటి నాటకం ఆయనదే. జీవిత చరిత్ర రచనను, స్వీయ చరిత్ర రచనను, వ్యంగ్య రచనలను ఆయన ప్రారంభించాడు. ఆంగ్ల సంస్కృతాల మంచి నాటకాలను అనువదించాడు. పత్రికా రచనకు గట్టి పునాదులు వేశాడు. కాని, ఆయన సాహిత్య సృష్టి మొత్తం ఆయన ఉద్యమాలకే అంకితమైంది. ఆయన చేతిలో కలం ఒక ఆయుధమైంది. దానితో ఆయన తుది శ్వాస వరకు రాజీ లేని పోరాటం సాగించాడు.

స్వాతంత్ర్య సిద్ధి తర్వాత ఎందరెందరి పేర్లతోనో ప్రత్యేకంగా తపాలా బిళ్ళలు వెలువడ్డాయి. వీరేశలింగం గౌరవార్థం తపాలా బిళ్ళ ఏనాడో-1948లో ఆయన శత జయంతి సందర్భంలోనే రావలసింది. ఇరవై ఆరేళ్ళు ఆలస్యంగా రేపు సోమవారం నాడు అది వెలువడ నున్నది. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు హైదరాబాదులో దాన్ని విడుదల చేయనున్నారు.

ఆయన పేరుపై తపాలా బిళ్ళ రాకపోవడం ఆయన ఘనతకు లోపమని కాదు. తెలుగు వారి జీవితంలోనే ఆయన ఒక భాగమైనాడు. వారి ఆలోచనలలో అంతర్లీనంగా ఆయన కొనసాగుతున్నాడు. తెలుగు వారికి ఇంతగా ప్రేమాస్పదుడైన ఆ మహనీయుని ఈ విధంగా గౌరవించాలన్న ఆలోచనైనా కేంద్ర ప్రభుత్వానికి ఇంతకాలం రానందుకే బాధ.

నిజానికి తపాలా బిళ్ళ ఆవిష్కరణతోనే వీరేశలింగంపట్ల మన కర్తవ్యం తీరిపోదు. ఆయన ప్రారంభించిన పెక్కు పోరాటాలు ఇంకా పూర్తి కాలేదు. ఆయన ఆయన కాలంలో ఎదుర్కొన్న అనేక సాంఘిక దురాచారాలు ఇంకా తాండవిస్తున్నాయి. ఎన్నో కొత్తవి సయితం తలయెత్తాయి. వాటిని ఎదుర్కోవడంలో, నిర్మూలించడంలో, మన వైఫల్యానికి మనలను కనీసం సిగ్గిల చేయగలిగితే ఈ సందర్భంలో ఆయన సంస్మరణ సార్థకమౌతుంది.

(జులై 14, 1974)

# హెయిలీ సెలాసీ

ఇథియోపియాలో ఈ సంవత్సరారంభం మంచి జరుగుతున్న పరిణామాల దృష్ట్యా చక్రవర్తి హెయిలీ సెలాసీ పదవీచ్యుతి ఎప్పుడో తప్పదని అనుకుంటున్నట్టిదే. ఇప్పుడు సరిగా ఇంతే జరిగినట్టు ఒక వార్త తెలుపుతున్నది.

వలభై నాలుగేళ్ళ క్రిందట సింహాసనానికి వచ్చిన హెయిలీ సెలాసీ 1936-41 సంవత్సరాల మధ్య తమ దేశం ఇటాలియన్ దురాక్రమణలో వున్నప్పుడు తప్ప ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలన చేశాడు. రాజరికం అంటేనే నిరంకుశత్వానికి మారు పేరు. హెయిలీ సెలాసీ కూడా చాలాకాలం నిరంకుశంగానే పరిపాలించాడు. అయినా, అదే సమయంలో తన దేశాన్ని ఆధునికం చేయడానికి కూడా ప్రయత్నించాడు.

ఇథియోపియా, చాలా ప్రాచీన రాజ్యం. దాని చక్రవర్తులు తాము సాలమన్ రాజా, షెబారాణి సంతతి వారమని చెప్పుకుంటారు. ఈ ఇరవైయవ శతాబ్దంలో కూడా ఇథియోపియాలో ఈ ప్రాచీన వ్యవస్థ లక్షణాలు కొనసాగాయి. మొత్తం పేద్య భూమిలో మూడవ వంతు రాజ కుటుంబానికి చెందినది కాగా, మరొక మూడవ వంతు చర్చికి చెందినట్టిది. మిగతా దానిలో కొంత ఫ్యూడల్ ప్రభువులది, ఇంకా ఏమైనా మిగిలితే అది మాత్రమే సామాన్య ప్రజలది.

అందువల్ల ఇథియోపియా ఆర్థికంగా ఎంతో వెనుకబడిన దేశం కావడంలో ఆశ్చర్యం లేదు. మొత్తం రెండున్నర కోట్ల ప్రజలలో నూటికి 90 మంది విద్యాగంధం లేనివారు. నిరుపేదలు కూడా. ఇందువల్ల దేశంలో, ముఖ్యంగా యువతరంలో చాలా కాలంగా పాలకవర్గం పట్ల అసంతృప్తి వున్నది. ఈ అసంతృప్తిని గమనించి 1955 నుంచి హెయిలీ సెలాసీ కొన్ని సంస్కరణలు ప్రవేశ పెట్టాడు. ఎన్నికలు జరిపి పార్లమెంటును నెలకొల్పాడు. పార్లమెంటరీ పరిపాలనను నెలకొల్పాడు. కొన్ని భూసంస్కరణలను కూడా అమలు చేశాడు.

ఎంత చేసినా అంతిమాధికారం చక్రవర్తి చేతిలోనే మిగిలిపోయింది. ప్రధాన మంత్రి నియామకం, బర్తరఫ్ అధికారాలు ఆయనవే. ప్రతి శాసనం ఆయన ఆమోదాన్ని పొందవలసిందే. పార్లమెంటు, మంత్రి వర్గం నామమాత్రమే.

ఈ కారణం చేత దేశంలో అసంతృప్తి తొలగలేదు. కార్మికులలో విద్యార్థులలో ఈ అసంతృప్తి ప్రబలితమే కాక, సైనికులకు కూడా అది పాకింది. వారు హెచ్చు జీతాల కోసం ఆందోళన చేశారు. వారి ఆందోళన, తిరుగు బాటు ఫలితంగా చక్రవర్తి అధికారాలు చాలా వరకు తగ్గి పోయాయి. కొత్త రాజ్యాంగం రూపొందింది. రాజ్యాంగబద్ధుడయిన రాజుగా మాత్రమే హెయిలీ సెలాసీ మిగిలాడు.

ఇప్పుడు ఈ పదవి నుంచి కూడా ఆయనను తొలగించినట్టు అధికారంలో వున్న సైనిక సమన్వయసంఘం ప్రకటించింది. ఇందుకు అది చెప్పిన కారణం— చక్రవర్తి విదేశీ బ్యాంకులలో దాచిన కొన్ని వందల కోట్ల డాలర్ల ధనాన్ని ప్రభుత్వానికి బదిలీ చేయడానికి నిరాకరించాడట.

ఆంతరంగికంగా హెయిలీ సెలాసీ పరిపాలన ఎట్టిదైనా, విదేశాంగనీతిలో ఆయనది అభ్యుదయ దృక్పథమే. ఆయన అలీనవిధానాన్ని తు. చ. తప్పకుండా అనుసరించాడు. కొత్తగా స్వతంత్రమయిన ఆఫ్రికన్ రాజ్యాలతో స్నేహ సంబంధాలను నెలకొల్పుకున్నాడు. అడిస్ అబాబా ప్రధాన కార్యస్థానంగా ఏర్పడిన ఆఫ్రికన్ రాజ్యాల సంఘీభావ సంస్థ స్థాపనకు ఆయన ప్రోత్సాహం చాలా వున్నది. ఆయనను ఇప్పుడు పదవి నుంచి తొలగించిన సైన్యం ఆంతరంగికంగా అభ్యుదయ విధానాలను అమలు చేయడంతో పాటు ఈ విదేశాంగ విధానాన్ని కొనసాగించగలదని ఆశించవచ్చు.

బ్రిటన్‌లో ప్రవాసంలో వుంటూ ఇటలీ దురాక్రమణకు వ్యతిరేకంగా నడిపిన పోరాటంతో హెయిలీ సెలాసీ ప్రపంచ దృష్టిని ఆకర్షించాడు. ఆయన పదవీచ్యుతితో ఆఫ్రికన్ చరిత్రలో ఒక శకం అంతమౌతున్నది.

(సెప్టెంబర్ 13, 1974)

# కృష్ణమీనన్

ఎంత బద్ధ శత్రువులైనా వి. కె. కృష్ణమీనన్ మేధావటమను కాదనలేరు. స్వార్థరాహిత్యాన్ని, లక్ష్యశుద్ధిని కాదనలేరు. అదే సమయంలో ఎంత గాఢమిత్రులైనా ఆయన వివాదాస్పదుడు కాడని అనలేరు.

మీనన్ వ్యక్తిత్వం విలక్షణమైనట్టిది. అది అలక్ష్యం చేయడానికి వీలులేని వ్యక్తిత్వం. ఆయన నోరు విప్పితే వెలువడే ప్రతి మాట వివాదగ్రస్తమే. వివాదం లేనిదే మీనన్ లేడు.

అయినా, భారతదేశ చరిత్రను స్వాతంత్ర్య సిద్ధికి ముందు, తర్వాత పెక్కేళ్ళపాటు ప్రభావితం చేసిన వ్యక్తులలో ఆయన ఒకడు. లండన్‌లో 1929-47 సంవత్సరాల మధ్య ఇండియాలీగ్ సెక్రటరీగా, బ్రిటిష్ లేబర్‌పార్టీకి సన్నిహితుడుగా, ఇండియాకు స్వాతంత్ర్య మివ్వవలసిన ఆవశ్యకతకు బ్రిటన్‌లో అనుకూలాభిప్రాయాన్ని సృష్టించడంలో ఆయన చేసిన కృషి ఎన్నటికి విస్మరించరానిది.

పండిట్ నెహ్రూ స్నేహాభిమానాలను అంతగా చూరగొనకపోతే, మీనన్ ఇండియా స్వతంత్రమైన తర్వాత దాని రాజకీయాలలో ఎట్టి పాత్ర వహించేవాడో చెప్పలేము. కాని, మొదట లండన్‌లో హైకమీషనర్‌గా, తర్వాత ఐక్యరాజ్యసమితిలో భారత ప్రతినిధిగా, నెహ్రూ విదేశాంగ విధానానికి భాష్యకారుడుగా, భారత ప్రభుత్వంలో రక్షణ మంత్రిగా ఆయనది నిజంగా కీలకపాత్ర.

1962 నాటి యుద్ధంలో చైనా చేతిలో ఇండియా ఓటమికి కృష్ణమీనన్ ప్రధాన బాధ్యుడన్న మాట నాటి నుంచి నేటి వరకు వినబడుతూనే వున్నది. కాని, ఇది పూర్తి నిజం కాదు, దీని బాధ్యతను మీనన్‌తోపాటు నెహ్రూ పంచుకోవాలి; పార్లమెంటు, కాంగ్రెస్, దాని ప్రతిపక్షాలు పంచుకోవాలి. మనది గాంధీ పుట్టిన దేశమని, అసలు మనకు సాయుధ సైన్యమే అనవసరం, చైనా మనపై దండెత్తబోదని, పాకిస్తాన్ దండెత్తితే దానికి జవాబు చెప్పడానికి మనకున్న సైన్యం చాలునని ఆ రోజులలో వాదించిన వారందరు పంచుకోవాలి.

నిజానికి కృష్ణమీనన్ రక్షణమంత్రి కాకముందు భారత సైనిక వ్యవస్థ అస్తవ్యస్తంగా వుండేది. రక్షణసామగ్రి ఉత్పత్తి ప్రాథమికావస్థలో వుండేది. అన్నిటిని దిగుమతి చేసుకోవలసి వచ్చేది. ఆయన వచ్చిన తర్వాతనే రక్షణసామగ్రి విషయంలో దేశాన్ని ఆధునికం, స్వయం సమృద్ధం చేయాలన్న ఆలోచన కలిగింది.

అయితే మన ఓటమికి కృష్ణమీనన్ బాధ్యత లేదని మా తాత్పర్యం కాదు. చైనా నుంచి కంటె పాకిస్తాన్ నుంచే మనకు హెచ్చు ప్రమాదమని ఆయన వాదించేవాడు. సైన్యంలో క్రమశిక్షణ తగ్గిపోవడానికి ఆయన వ్యక్తిగత రాగద్వేషాలు, ప్రమోషన్ల విషయంలో అవకతవకలు కారణాలన్న మాటను కూడా కాదనడానికి వీలులేదు.

కాని, మీనన్‌ను చిరకాలం జ్ఞాపకం వుంచుకోవలసింది ప్రపంచ శాంతి కాముకుడుగా, వలస దేశాల స్వాతంత్ర్య ప్రియుడుగా, ఆఫ్రో-ఆసియన్ దేశాల సంఘీభావ వాదిగా, అలీన విధాన నిర్మాతలలో ఒకడుగా. ఈ అన్ని విషయాలలో ఆయన నెహ్రూకు చేదోడు వాదోడుగా చేసిన కృషి ఇండియాకు మొదటి పదేళ్ళలో ప్రపంచంలోనే ప్రముఖ స్థానాన్ని సంపాదించి పెట్టాయి.

వ్యక్తిగా ఆయన నోటి దురుసుతనం ప్రపంచ ప్రసిద్ధమైంది. శాంతి మహాజీవనాల గురించి మాట్లాడినా ఆయన వాక్కు సౌమ్యంగా కాక పెళుసుగా వుండేది. కాని, ఎన్ని లోపాలున్నా, మన దేశంలో మీనన్ ఈ శతాబ్దపు మహామేధావులలో ఒకడు. మహావక్తగా అనితర లభ్యమైనట్టిది ఆయన స్థానం. మొన్న ఆయన అస్తమయంతో భారతదేశం ఒక మహోన్నత వ్యక్తిని కోల్పోయింది.

(అక్టోబర్ 8, 1974)

# డీ సి కా

ప్రపంచ చలన చిత్రరంగంలో ఒక తరాన్ని ప్రభావితం చేసిన ప్రతిభాశాలి మొన్న రోమ్‌లో శాశ్వతంగా కన్ను మూసిన విట్టోరియో డీ సికా. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఇటలీలో, దానితోపాటు మరి పెక్కు దేశాలలో చలనచిత్ర కళను ఆయన ఒక కొత్త మలుపు తిప్పాడు.

నిత్య జీవితంనుంచి ఆయన తన కథా వస్తువులను ఎన్నుకున్నాడు. కార్మికులు, నిరుద్యోగులు, కూటికోసం పడుపువృత్తి చేపట్టే అభాగ్య స్త్రీలు, ఇట్టి వారిని ఆయన పాత్రలుగా తీసుకున్నాడు. వారిపట్ల అపారమైన కారుణ్య భావంతో, మానవతా దృక్పథంతో, అదే సమయంలో ప్రస్తుత వ్యవస్థపట్ల నిశితమైన విమర్శతో ఆ కథా వస్తువులను ఆయన కళాత్మక దృష్టితో చిత్రించాడు. దీనికి "నియో రియలిజం" (నవ్య వాస్తవికత) అని పేరు వచ్చింది. ఈ ధోరణికి చెందిన చిత్రాలకు మరొక ఇటాలియన్ దర్శకుడు రాబర్టో రోజెలిని ("ఓపెన్ సిటీ రోమ్") మార్గదర్శకుడైనా, "బైసికిల్ థీవ్స్", "షూషైన్", "మిరకిల్ అఫ్ మిలాన్" వంటి చిత్రాలతో డీ సికా గొప్ప కీర్తిని ఆర్జించాడు.

డీ సికా ప్రభావం ఇండియాలో కూడా సుమారొక పాతికేళ్ళ క్రిందట కొన్నాళ్ళ పాటు ప్రసరించింది. డీ సికా చిత్రాలు సత్యజిత్‌రాయ్‌ని ఉత్తేజితుడిని చేసినవనడం అతిశయోక్తి కాకపోవచ్చు. బిమల్‌రాయ్‌ని పోలిన ఎందరో అభ్యుదయ వాదులకు సయితం ప్రేరణ డీ సికా చిత్రాలనుంచే వచ్చింది. ఆఖరికి తెలుగు చిత్రసీమపై కూడా డీ సికా ప్రభావం పడింది. క్రమంగా ఇటలీలోవలె ఇండియాలో కూడా ఈ ప్రభావం అంతరించింది.

ప్రపంచ చలన చిత్ర చరిత్రలో ఒక ఉజ్వలాధ్యాయానికి దేశికుడుగా డీ సికా పేరు చిరస్థాయిగా నిలిచి వుంటుంది.

(నవంబరు 16, 1974)

# పెరియార్

ఆయన అసలు పేరు ఇ.వి. రామస్వామి నాయకర్, క్లుప్తంగా ఇ.వి.ఆర్. కాని "పెరియార్" (మహా పురుషుడు) అనే బిరుదంతోనే ఆయన తమిళనాడులో చాలా కాలంగా సుప్రసిద్ధుడు.

రాజాజీ, నాయకర్ సమకాలికులు, సమవయస్కులు. ఆయన వలె ఈయన కూడా ఒక అర్ధ శతాబ్దంపాటు తమిళ రాజకీయాలను, తమిళ ప్రజా జీవితాన్ని ప్రభావితం చేశారు. ఆయన నిర్యాణం చెందిన సరిగా ఏడాదికే ఈయన కన్ను మూశారు.

కాని, వారిరువురి సిద్ధాంతాలలో, దృక్పథాలలో పోలికల కంటె వైరుధ్యాలే ఎక్కువ. నాయకర్ రాజకీయ జీవితం కాంగ్రెస్ ఉద్యమాలతోనే ప్రారంభ మైంది. ఎక్కువసార్లు కారాగారవాసం అనుభవించారు. ఆయన కూడా తొలి రోజులలో

గాంధీజీ అనుచరకోటిలోని వాడే. కాని రాజాజీ కంటె చాలా ముందుగానే ఆయన కాంగ్రెస్‌ను వదలిపెట్టి అన్య మార్గాన్ని అవలంబించడం జరిగింది.

నాయకర్ మతానికి—ఏ మతానికైనా—ప్రబల విరోధి. సాంప్రదాయిక సాంఘిక వ్యవస్థకు బద్ధ వైరి. ఇంతేకాదు. పూర్తిగా హేతువాది; మూఢ విశ్వాసాలకు తీవ్ర వ్యతిరేకి! కులవిభేదాలను కూలద్రోయడానికి, ముఖ్యంగా అస్పృశ్యతా దురాచార నిర్మూలన కోసం, ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు. దక్షిణా పథంలోని గొప్ప సంఘ సంస్కర్తలలో ఒకరుగా ఆయనను పేర్కొనవచ్చు.

అయినా, ఒక మాట చెప్పక తప్పదు. నాయకర్ సాంఘిక, రాజకీయ సిద్ధాంతాలు తీవ్రమైన అసహనంతో, విద్వేషంతో కూడినవై వుండేవి. స్వ భాషను ఎంతైనా ప్రేమించవచ్చు. కాని నాయకర్ హిందీని తీవ్రంగా విద్వేషించేవారు. ద్రవిడ సంస్కృతిపట్ల ఆయన అభిమానం ఆర్య సంస్కృతిపట్ల తీవ్రమైన అసహనంగా వ్యక్తమయ్యేది. కులాలు పోవాలన్న ఆయన వాదం ఎంతగా హర్షించదగిందో ఒక ప్రత్యేక కులంపట్ల ఆయన విద్వేషం అంతగా నిరసించదగిన విషయమైంది.

భారతదేశాన్ని ఆయన ఆర్య, ద్రవిడ జాతి విభేదాల దృష్టి నుంచి మాత్రమే చూడగలిగారు. ఈ సంకుచిత దృక్పథం ఆయనను ప్రత్యేక ద్రవిడనాడు వాదం వరకు తీసుకు వెళ్ళింది. ఇతర విషయాలలో సయితం ఆయన తీవ్ర భావాలు సంఘ సమైక్య భావాన్ని కాక విభేదాలను పెంచేవిగా రూపొందాయి.

హిందూ దేవతలను అవమానిస్తూ కొన్నాళ్ళ క్రిందట ఆయన చేసిన ప్రదర్శనలు ఆయన తీవ్ర భావాలకు ఒక ఉదాహరణ. కులాల నిర్మూలనకు ఆయన రానున్న జనవరి 26వ తేదీని గడువుగా పెట్టడం, ఆనాటికి అందుకు శాసనం రాకపోతే ద్రవిడనాడు విభజనోద్యమాన్ని ప్రారంభించగలవని "అల్టిమేటం" ఇవ్వడం మరొక ఉదాహరణ.

ఏమైనా తాము నమ్మిన సిద్ధాంతాలకై 94 ఏళ్ళ ముదిమి ముంచుకు వచ్చినా, తుది వరకు పోరాడిన వారు అరుదుగా వుంటారు. తమిళనాడులో, దక్షిణాదిలో ఇంతగా వివాదాస్పదుడైన వ్యక్తి మరొకరు వుండరు. బహుశా వివాదాస్పద వ్యక్తిగానే ఆయన స్మృతి నిలిచి వుంటుంది.

(డిసెంబరు 25, 1974)

# పి. జి. వుడ్‌హౌస్

ఇంగ్లీషు సాహిత్యంలో హాస్య రచయిత లెందరో వున్నారు. కాని, పి.జి. వుడ్‌హౌస్ తర్వాతనే ఎవరైనా.

సుమారు ఏడు దశాబ్దాలుగా ఆయన లేఖిని నుంచి నవలలు, కథానికలు, నాటకాలు, స్వీయ స్మృతులు పుంఖానుపుంఖంగా వెలువడ్డాయి. వాటిలో ఆయన లెక్క-లేని హాస్య పాత్రలను సృష్టించాడు. స్మిత్, జీవ్స్, బెర్టీ వూస్టర్, మ్యూలినర్, లార్డ్ ఎమ్స్‌వర్త్‌లను పోలిన పాత్రలు ఇంగ్లీషు సాహిత్యం వున్నంతవరకు అజరామరంగా నిలిచి పోతాయి.

ఇతరుల హాస్య రచనలలో పేజీ కొక్కసారి నవ్వు రావచ్చు. కాని వుడ్‌హౌస్ ప్రతి వాక్యంలో ఒక్కొక్కసారి ప్రతి మాటలో హాస్యం దట్టించి వ్రాశాడు. అవి చిరునవ్వును మాత్రమే తెప్పించి వూరుకోవు. కడుపుబ్బ నవ్విస్తాయి. పదిమందిలో వున్నప్పుడు వుడ్‌హౌస్ రచనలు చదవడం ప్రమాదకరమని, పాఠకుడు నవ్వును ఆపుకోలేక పోవడాన్ని చూసి పిచ్చివాడుగా ఇతరులు భ్రమపడే అవకాశం కలదని కొందరు హెచ్చరించడం ఇందుకే.

హాస్యం త్వరగా మాసిపోయే గుణం కలిగినట్టిది. రెండవసారి విన్న హాస్యోక్తి సాధారణంగా నవ్వు పుట్టించదు. కాని, వుడ్‌హౌస్ నవలలు, కథలు నిత్యనూతనాలు. కడచిన ఆయిదారు దశాబ్దాలుగా అవి లక్షలాది పాఠకులను అలరిస్తున్నాయి.

ఇతరుల హాస్యరచనలలో లేని మరొక విశిష్టత వుడ్‌హౌస్‌లో వున్నది. ఆయన నవలలలో చక్కని కథ వుంటుంది. ఊహించరాని విధంగా మలుపులు

చిరంజీవులు

తిరుగుతూ పోయే ప్లాట్ వుంటుంది. అవి "థ్రిల్లర్స్" వలె చివరివరకు చదివితే తప్ప వదలి పెట్టడానికి వీలులేనంత ఉత్కంఠ కలిగిస్తాయి.

ఆయనది అచ్చమైన, విశుద్ధమైన హాస్యం. ఆయన రచనలలో సంఘానికి సందేశం లేశమైనా కనబడదు, "హాయిగా నవ్వుకోండి" అని తప్ప. సాంఘిక విమర్శలేదు—కాని, బ్రిటిష్ సమాజంలోని పై తరగతి వారి కృత్రిమ జీవన విధానం పట్ల నిశితమైన వ్యంగ్యంతో కూడిన వెక్కిరింపు లేకపోలేదు. అందుకే కాబోలు ఆయన సృష్టించినది చౌకబారు హాస్యమని కొందరు ప్రబుద్ధులు కొట్టి వేయడం జరిగింది.

వుడ్‌హౌస్ అభిమానులు ఆయన శైలి ఇంగ్లీషు భాషలోనే అసామాన్య మైనదిగా పరిగణిస్తారు. నిజానికి మాటలతో, వాక్యాలతో ఆయన చేసినన్ని గారడీలు చాలా తక్కువ మంది చేశారు. విచిత్రమైన-అదే సమయంలో హాస్య జనకమైన పద ప్రయోగాలు (... if not actually disgruntled he was far from being gruntled) ఆయన రచనలలో కొల్లలుగా కనిపిస్తాయి.

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యే నాటికి వుడ్‌హౌస్ ఫ్రాన్సులో వున్నాడు. ఆయన జర్మన్‌ల చేతికి ఖయిదీగా చిక్కి వారి నిర్బంధంవల్ల మిత్ర రాజ్యాలకు వ్యతిరేకంగా కొన్ని రేడియో ప్రసంగాలను ప్రసారం చేయవలసి వచ్చిందట. ఇందుకు ఆయనను బ్రిటన్ మొన్న మొన్నటి వరకు క్షమించలేదు. అమెరికన్ పౌరుడుగా న్యూయార్క్ వద్ద లాంగ్ ఐలెండ్‌లో ఆయన స్థిరపడి పోయాడు. కాని, ఒక గొప్ప రచయితను ఎవరైనా ఎంతకాలం అలక్ష్యం చేయ గలరు? ఈ సంవత్సరారంభంలో బ్రిటిష్ ప్రభుత్వం వుడ్‌హౌస్‌కు "సర్" బిరుదమిచ్చి గౌరవించింది.

క్రోధం, శోకం, మోహం మొదలైనవి సర్వ జంతువులకు సమానం కాని, నవ్వు మానవుని కొక్కనికే ప్రకృతి ప్రసాదించిన వరం. తనలోను, అన్యులలోను గల మానసిక వికారాలను, దౌర్జన్యాలను చూసి హాయిగా నవ్వుకోగల వ్యక్తికి ఎంత బాధామయ జీవితమైనా భరించదగిందిగా, అనుభవించదగిందిగా కనిపిస్తుంది. ఇట్టి హాస్య ప్రియత్వానికి ప్రోది చేసిన కొద్దిమంది రచయితలలో ఒకడుగా మొన్న తన 93వ ఏట కన్ను మూసిన వుడ్‌హౌస్ చిరస్మరణీయుడు.

(ఫిబ్రవరి 16, 1975)

# ఒక స్వర్ణోత్సవం

దేవులపల్లి కృష్ణశాస్త్రిని మహాకవిగా పేర్కొనడం ఒకప్పుడు ఛాందసులైనవారికి రుచించేది కాదు. ఏ మహాకావ్యం వ్రాశారని ఆయన మహాకవి? అని వారు ప్రశ్నించేవారు.

నిజమే. ఆయన రామాయణమో, మరొక మహాకావ్యమో వ్రాయలేదు. లఘు

కావ్యమైనా వ్రాయలేదు. వ్రాసినవన్నీ పాటలు, ఖండ కావ్యాల కోవకు చెందిన పద్య కవితలు.

అయినా, కృష్ణశాస్త్రిగారు మహాకవే. రాశికంటె రమ్యత ముఖ్యమైతే ఆయన నిస్సందేహంగా మహాకవి. పండితులు తరచుగా ఉదహరించే "వాక్యం రసాత్మకం కావ్యం" అన్న ఆలంకారిక మతాన్నిబట్టి చూసినా ఆయన మహాకవి.

కొందరు ఆధునికుల దృష్టినుంచి, ముఖ్యంగా విప్లవ ధోరణికి చెందిన వారి దృష్టినుంచి కూడా ఆయన మహాకవి కాకపోవచ్చు. కలాన్ని కత్తిగానో, తుపాకిగానో వాడే వాడే వారి దృష్టిలో మహాకవి. నిప్పులు కురిపించేదే అసలైన కవిత. కాని, కృష్ణశాస్త్రిగారు తన కలాన్ని వేణువుగా, వీణియగా ప్రయోగించారు. తన కవితలో వెన్నెలలు కురిపించారు.

అయినా, ఆయన మహాకవే. "నాలుగూ దిక్కులా నవీన స్వర్గమ్ములో — ప్రతి గుండె మోసాల ప్రయోగనా ?" అంటూ స్వచ్ఛమైన మానవతావాదానికి, "నా యిచ్ఛయేగాక నాకేటి వెరపు?" అంటూ వ్యక్తి స్వేచ్ఛావాదానికి ఆయన తన కవితలో పట్టాభిషేకం చేశారు.

శాస్త్రిగారి కవిత తేనెల వాక. దానిలో మధుర సుషమా మదాగావమంజు వాటి కలు, విపంచీ విరహ కంఠాలు, విదుర వెన్నెల దారులు, విభావరీ వేళాశాలలు, తారా లతాంతమాలలు, మృదుపవనాంచలాయుల గుసగుసలు, చరణ మంజీరాల కొసరు జాలి పలుకరింతలు ........ ఎన్నో కనిపిస్తాయి, వినిపిస్తాయి. మనస్సును ఆహ్లాదపరుస్తాయి.

ఆయన పదజాలమే వేరు. అది అచ్చగా ఆయనదే. నిజమైన శబ్ద శిల్పి ఆయన. ఆంగ్లభాషను తన అసాధారణ పాండిత్యంతో మనంపన్నం చేసిన జేమ్స్ జాయిస్ "ఫినిగన్స్ వేక్" నవల వ్రాస్తూ రోజంతా ఆలోచించి ఒక కామా పెట్టే వాడట. మరొక రోజంతా ఆలోచించి ఆ కామా తీసివేసే వాడట.

అతడు ఆ నవల పూర్తి చేయడానికి పదిహేడేళ్ళు పట్టింది. కృష్ణశాస్త్రిగారు కూడా అంతే. ఒక పాట వ్రాయడానికి ఒక గంటనుంచి, వారం రెండు వారాలవరకు ఎంతయినా పట్టవచ్చు. వ్రాసిన దాన్ని పదిసారులైనా మార్చనిదే ఆయన తృప్తి

పడరు. ప్రతిమాటకు రంగు, రుచి, వాసన వుంటాయని ఆయన విశ్వాసం. ఆయన వలె శబ్దరహస్యాన్ని ఎరిగినవారు తెలుగునాట ఎందరో లేరు. ఆయన జీవితమే శబ్దాలకోసం తపస్సు. "నా వలెనె యాతడున్మత్త భావశాలి .... పాట పదములకై నిత్యపథికుడయ్యె" అని ఎవరి గురించో శాస్త్రిగారు వ్రాసిన మాటలు శాస్త్రిగారికి కూడా వర్తిస్తాయి.

అయినా, ఆయన వ్రాసింది మరీ తక్కువ కాదు. యాభై ఏళ్ళలో కృష్ణపక్షం, ఊర్వశి, ప్రవాసం, మహతి, ఎన్నో రేడియో, సినిమా పాటలు, గేయ నాటికలు, వ్యాసాలు .... కనీసం ఇరవై సంపుటాలుగా రాదగినన్ని వ్రాశారు. అన్నట్టు, కొన్నాళ్ళు అభ్యుదయోద్యమ ప్రవాహంలోపడి ఆకలి పాటలు కూడా వ్రాశారు. స్విన్ బర్న్ మలిదశలో రాజకీయ కవిత వ్రాసినా రొమాంటిక్ ధోరణిలోనే వ్రాసినట్టు, శాస్త్రిగారు "తమ కమృత ముంచుకున్నారు, తమ మధువు నించుకున్నారు, మాకు ఆకలి నిచ్చి—మాకు రోషం హెచ్చి...." అంటూ ఆకలి పాటలు వ్రాసినా, మృదుల శైలిలోనే వ్రాశారు.

మరి, ఆయన కవిత్వం వ్రాయడం మొదలు పెట్టిన రోజులు వేరు. బ్రాహ్మ సమాజం, వీరేశలింగంగారి సంఘ సంస్కరణవాదం, గిడుగు వ్యావహారిక వాదం, గురజాడ కొత్త కంఠం, టాగోర్ మార్మిక కవిత, గాంధీజీ శంఖారావం, ప్రథమ ప్రపంచ యుద్ధానంతర నిరాశా నిస్పృహలు, జాతీయ వాదం, మానవతా వాదం, స్వేచ్ఛకై తపన....అవీ ఆ రోజులు. వీటితో ప్రభావితులైన తెలుగు కవులు కొత్త బాణిలో గానం చేసిన రోజులవి. వారిలో కృష్ణశాస్త్రిగా రొకరు. కాని, ఆ తరం కవులందరు ఒక ఎత్తు, కృష్ణశాస్త్రిగారొక ఎత్తు. వారిలో కృష్ణశాస్త్రిగారే కొంచెం ఎత్తు.

మద్రాసులో నేడు వారి కవితకు స్వర్ణోత్సవం జరుగుతున్నది. ఆయన రచనలలో చాలాకాలంగా లభ్యం కానివి కొన్ని సంపుటాలుగా నేడు ఆవిష్కృతాలవుతున్నాయి. ఇవి కృష్ణశాస్త్రిగారికి ఈ తరం వారిలోనుంచి కూడా కొత్త అభిమానులను సంపాదించి పెట్టగలవని ఆశిస్తున్నాము. శాస్త్రిగారి మధుర కవిత ఇట్టి స్వర్ణోత్సవాలెన్నింటినో జరుపుకోవాలని కూడా కోరుకుంటున్నాము.

(మే 11, 1975)

# గోరా

ప్రవాహం వాలునుబట్టి ఎంత వేగంగానైనా, ఎంతదూరమైనా వెళ్ళగల గడి ఈతగాళ్ళు లోకంలో కోకొల్లలు. ప్రవాహానికి ఎదురీదే వారు మాత్రం కొద్దిమందే వుంటారు. వారు ఎంతో దూరం వెళ్ళలేకపోవచ్చు. కాని, ఎదురీతకు ఉద్యమించడమే

విశేషం. అట్టి కొద్దిమందిలో "గోరా"గా ప్రసిద్ధులైన గోపరాజు రామచంద్రరావు ఒకరు.

ఆయన జీవితమే ఒక రణరంగం. నలభై ఏళ్ళకు పైగా ఆయన రాజీలేని పోరాటాలు సాగించారు. మనిషిని విధిచేత కీలుబొమ్మగా మిగిల్చిన దైవభావనపై, మూఢ విశ్వాసాలపై పోరాటం, మనిషికి మనిషికి మధ్య అడ్డుగోడలు నిర్మించిన కుల, మత వ్యవస్థలపై పోరాటం, రాజకీయాలలో పార్టీ వ్యవస్థపై పోరాటం, అవినీతిపై, ఆడంబరాలపై పోరాటం-ఒకటి, రెండు కావు ఆయన సాగించిన పోరాటాలు.

ఈ పోరాటాలలో ఆయన చేయని త్యాగంలేదు, పడని బాధలేదు, తినని తిట్లు లేవు. అయినా, ఆయన ఆత్మవిశ్వాసాన్ని కోల్పోలేదు. ఆశావాదాన్ని విడనాడ లేదు. గత శనివారంనాడు తుదిశ్వాస విడిచే వరకు ఆయన ఈ పోరాటాలను సాగిస్తూనే వున్నారు.

ఆయన తన ఉద్యమాలలో ఏపాటి విజయాలు సాధించారన్నది ప్రశ్న కాదు. అవి పరిమితమైనవే కావచ్చు, కాని, వ్యక్తికి చరితార్థత చేకూర్చేది విజయం కాదు, చిత్తశుద్ధితో కూడిన ప్రయత్నమే.

గోరాకు అనుచరులకంటె అభిమానులు ఎక్కువ. అభిమానుల కంటె వ్యతిరేకులు ఎక్కువ. ఆయన సిద్ధాంతాలతో పెక్కుమంది ఏకీభవింప లేకపోవచ్చు. కొన్ని సందర్భాలలో ఆయన వింత పుంతలు తొక్కినట్టు, అతిగా పోయినట్టు కూడా అనిపించి వుండవచ్చు. కాని, ఎంత వ్యతిరేకులైనా ఆయన విశ్వాసబలాన్ని కాదన లేరు. చెప్పినదాన్ని చేసి చూపినవాడుగా ఆయన ధైర్యసాహసాలను మెచ్చుకోకుండా వుండలేరు.

గోరా జీవితాన్ని స్మరించినప్పుడు టాగోర్ వ్రాసిన "ఏక్లా చలో - ఏక్లా చలో—ఏక్లా చలో రే" అన్న బెంగాలీ గీతం పల్లవి జ్ఞాపకం వస్తుంది. ఆయన జీవితాంతం వరకు దాదాపు ఏకాకిగానే నిలిచారు. ఏకాకిగానే ముందుకు సాగిపోయారు. ఆయన ధన్యజీవి.

(జూలై 29, 1975)

# చక్రపాణి

ఆలూరి వెంకట సుబ్బారావుగా ఆయన సన్నిహిత బంధుమిత్రులకే తెలుసు. తక్కిన వారికి ఆయన చక్రపాణిగారే. మద్రాసు సినిమా రంగంలో ఆయనను "చక్కన్న"గా వ్యవహరించేవారే ఎక్కువ.

తెలుగువారికి తొలిసారిగా శరత్‌బాబును పరిచయం చేసింది చక్రపాణిగారేనేమో. ఆయన అనువాదంలో "దేవదాసు", "బడదీదీ" మొదలైన నవలలు తెలుగునాట ఎంతో ప్రసిద్ధిపొందాయి. శరత్‌నేకాక మరి పలువురు బెంగాలీ రచయితలను కూడా ఆయన తన అనువాదాల ద్వారా తెలుగువారికి పరిచయం చేశారు.

తెలుగు చిత్ర నిర్మాతలలో చక్రపాణిది ఒక ప్రత్యేక స్థానం. శ్రీ నాగిరెడ్డితో కలిసి ఆయన విజయా ప్రొడక్షన్స్ సంస్థను స్థాపించి, "షావుకారు", "పాతాళభైరవి", "పెళ్ళిచేసిచూడు" మొదలైన మరపురాని ఉత్తమ చిత్రాలెన్నింటినో నిర్మించారు. ఈ చిత్రాలన్నింటిలోను చక్రపాణి హృదయ సంస్కారం, ఉత్తమాభిరుచి, భావుకత, హాస్యప్రియత్వం ప్రస్ఫుటంగా ప్రతిబింబించేవి.

ప్రచురణ రంగంలో కూడా చక్రపాణి సేవ సామాన్యమైంది కాదు. విజయవంతమైన పెక్కు మాసపత్రికలను నిర్వహించడమేకాక, యువ ప్రచురణల ద్వారా చౌకధరలకు ఉత్తమ సాహిత్యాన్ని అందజేయడానికి ఆయన కృషి చేశారు. ఆయన మృతి తెలుగు చిత్రసీమకు, తెలుగు సాహిత్యరంగానికి తీరనిలోటు.

(సెప్టెంబర్ 25, 1975)

# అసాధారణ వ్యక్తి

కామరాజ్ ఆకస్మిక మృతితో స్వాతంత్ర్య సమరతరానికి చెందిన మరొక అగ్ర నాయకుడు మన మధ్యనుంచి నిష్క్రమించారు. ఆయన నిష్క్రమణతో మన దేశ రాజకీయ జీవితం పేదవడింది. వన్నె తగ్గింది.

రాజకీయ రంగలో పనిచేసేవారు పదవులను ఆశించకుండా వుండడం అరుదు. పదవులలోనికి వెళ్ళిన తర్వాత స్వచ్ఛందంగా దిగిపోవడం మరింత అరుదు, అరుదైన ఈ రెండు పనులూ కామరాజ్‌కే చెల్లినవి.

స్వాతంత్ర్య సమరంనాటి కాంగ్రెస్ రాజకీయాలలో ఆయన సాధారణ కార్య కర్తగా, తమిళ నాయకుడు శ్రీ సత్యమూర్తి అంతేవాసిగా జీవితాన్ని ప్రారంభించారు. ఆయన కార్యశూరత్వం, వ్యవహారదక్షత, జన్మసిద్ధమైన లోకజ్ఞానం, శక్తి సామర్థ్యాలు పలువురి దృష్టిని ఆకర్షించాయి. స్వాతంత్ర్యసిద్ధికి ముందు తమిళనాడులో కాంగ్రెసును తిరుగులేని శక్తిగా తీర్చిదిద్దిన ఘనత ఆయనదే.

ఆ తర్వాత కామరాజ్ తలచుకుంటే మంత్రి పదవి, ముఖ్యమంత్రి పదవి సయితం ఆయనను వరించేవే. కాని, ఆయన పదవుల జోలికి పోలేదు. తెర వెనుకనే నిలబడి ఉమ్మడి మద్రాసు రాజకీయాలను ఆయన నడిపారు. "కింగ్ మేకర్"గా అప్పటిలోనే ఆయనకు పేరు వచ్చింది. రాజాజీ తప్పుకున్న తర్వాత, మార్గాంతరం లేని పరిస్థితులలోనే ఆయన ముఖ్యమంత్రి పదవిని స్వీకరించారు. తొమ్మిదేళ్ళపాటు ఆయన ముఖ్యమంత్రిత్వ కాలంలో మద్రాసు రాష్ట్రం మొత్తం దేశంలోనే సమర్థ మైన, సువ్యవస్థితమైన పరిపాలనగల రాష్ట్రాలలో మొదటిదిగా పేరు పొందింది.

ఒక జాతీయ సంస్థగా కాంగ్రెసు తన పూర్వపు పలుకుబడిని కోల్పోతున్న దని బహుశా మొదటగా గ్రహించినవాడు ఆయనే. కనుకనే, కొందరు అగ్రనాయకులు పదవులనుంచి వైదొలగి పార్టీ పటిష్ఠతకై పనిచేయాలన్న పథకాన్ని ఆయన ప్రతిపాదించారు. తన పథకంనుంచి తనను మినహాయించుకొనకుండా ముందుగా తానే ముఖ్యమంత్రి పదవినుంచి వైదొలగారు.

దానితో కాంగ్రెసు అధ్యక్షుడుగా ఆయన కార్యరంగం యావద్భారతానికి విస్తరించింది. నెహ్రూ నిర్యాణానంతరం రెండుసార్లు ప్రధాని పదవివారసత్వం సమస్యను అతివాకచక్యంతో, ప్రశాంతంగా పరిష్కరించడంతో కామరాజ్ "కింగ్ మేకర్" అన్న ప్రతీతి తిరిగి ధ్రువపడింది.

కాంగ్రెస్‌లో చీలిక తర్వాత, ఆయన పాత కాంగ్రెసుకోనే, పాతమిత్రులతోనే వుండిపోవడం ఆయన దృఢవిశ్వాసాలకు, నిస్వార్థ రాజకీయాలకు మరొక ఉదాహరణ. క్రమంగా ఆయన తన కార్యరంగాన్ని తిరిగి తమిళనాడుకే పరిమితం చేసుకోవడం జరిగింది. తమిళనాడులో సంస్థా కాంగ్రెసు అంత్యం చేయడానికి వీలులేని పార్టీగా, కాంగ్రెసు సయితం దాని సహకారాన్ని అర్థించవలసిన శక్తిగా మిగలడానికి కామరాజ్ నాయకత్వ దక్షత ప్రధానకారణం.

రాజకీయాలు స్వార్థానికి పర్యాయ పదాలుగా చెల్లుతున్న రోజులలో కామరాజ్ నిస్వార్థానికి ప్రతినిధి. నీతి నిజాయితీలకు, నిరాడంబరతకు, త్యాగశీలానికి ఆయన మూర్తీభావం. వివేకం, వివేచనాపటిమ ఆయన సొత్తు. పదవిలో వున్నప్పుడు, లేనప్పుడు కూడా పార్టీ విభేదాల ప్రసక్తి లేకుండా, అంతగా అన్నివర్గాల అభిమానాన్ని చూరగొన్న నాయకులు ఎందరో లేరు.

ఆయన మితభాషి. రాజకీయాలలో రాణించడానికి, ప్రజానాయకుడుగా భాసించడానికి అతి వాగ్ధోరణి అక్కరలేదని ఆయన నిరూపించారు. ఇంతేకాదు, ఇంగ్లీసు చదువుకోనివారు యావద్భారత రాజకీయాలపై ప్రభావం ప్రసరించ లేరన్నది అవప్రథగా ఆయన నిరూపించారు. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి తమ శ్రద్ధాంజలిలో పేర్కొన్నట్టు కామరాజ్ నిజంగా అసాధారణ వ్యక్తి.

(అక్టోబర్ 4, 1975)

# చరిత్రకు భాష్యకారుడు

మానవజాతి చరిత్రలో ఎన్నో మహా నాగరికతలు ఆవిర్భవించాయి, కొంత కాలం వర్ధిల్లాయి. కాలగర్భంలో అంతరించాయి.

ఎందువల్ల ఇలా జరిగింది? ఏ నాగరికత ఎల్లకాలం ఎందుకు వర్ధిల్లలేదు?

అసలు ఏ నాగరికత అయినా ఎందుకు, ఎలా అవతరిస్తుంది? ఎందుకు, ఎలా వర్ధిల్లుతుంది? ఎందుకు, ఎలా అంతరిస్తుంది?

ఆరువేల ఏళ్ళు వెనుకకు పోయి చూస్తే, మానవ చరిత్రలో ఈజిప్షియన్, సూమెరియన్, అక్కేడియన్, బాబిలోనియన్, సింధు, చైనీస్, గ్రీక్—ఇలాగ

ఎన్నో నాగరికతలు పరిఢవిల్లినట్టు కనిపిస్తుంది. ఇవి దేనికదే స్వతంత్రంగా ఆవిర్భవించాయా? లేక ఒక దాని నుంచి ఒకటి ఉత్పన్నమైనాయా? వీటి మధ్య పరస్పర సంబంధాలు ఎటువంటివి?

ఇట్టివే, కొన్ని మౌలిక ప్రశ్నలను తనకు తాను వేసుకొని, వాటికి తార్కికమైన సమాధానాలు చెప్పడానికి ఒక జీవితకాలాన్ని వెచ్చించిన మహామనీషి మొన్న కన్నుమూసిన ప్రొఫెసర్ ఆర్నాల్డ్ టాయిన్‌బీ. మొత్తం మానవ చరిత్రను ఆయన కూలంకషంగా మథించాడు. ఎన్నో విస్మృత నాగరికతలను అధ్యయనం చేశాడు. వలభై ఏళ్ళపాటు ఏకదీక్షగా సాగిన ఆ అధ్యయనం ఫలితమే ఆయన పన్నెండు సంపుటాలలో రచించిన బృహద్గ్రంథం "ఎస్టడీ ఆఫ్ హిస్టరీ".

టాయిన్‌బీ కేవలం చారిత్రక సంఘటనలను తేదీల వారీగా వ్రాసుకుపోయిన వట్టి చరిత్ర కారుడు కాడు. చరిత్రకు ఆయన గట్టి భాష్యకారుడు. మొత్తం 28 నాగరికతలను, వాటి అభ్యుదయ, పతనాలను ఆయన అధ్యయనం చేశాడు. హారంలో దారంవలె దాగి ఆయా నాగరికతలను ఏకసూత్రంతో బంధిస్తున్న చారిత్రక సత్యాన్ని అన్వేషించాడు.

ఒక జాతి జన్మతః మిగిలిన జాతుల కంటె గొప్పది కావడం వల్ల నే గొప్ప నాగరికతను సృష్టించ గలుగుతుందని కొందరు చరిత్రకారుల వాదన. దీన్ని టాయిన్‌బీ త్రోసిపుచ్చాడు.

ఒక జాతి తన భౌతిక పరిసరాలు తన సుఖమయ జీవితానికి అనుకూలంగా వున్నప్పుడే గొప్పనాగరికతను సాధించగలుగుతుందని మరి కొందరన్నారు. దీన్ని కూడా ఆయన తిరస్కరించాడు.

జర్మన్ తత్త్వవేత్త, చరిత్రకారుడు స్పెంగ్లర్ వలె కొందరు నాగరికతలను కూడా — వ్యక్తులవలె — శైశవ, యౌవన, వృద్ధావస్థ దశలుంటాయని విశ్వసించారు. దీన్ని సయితం టాయిన్‌బీ నిరాకరించాడు.

ఏ సమాజమైనా, తన ప్రాకృతిక పరిసరాల నుంచి, లేదా, ఇతర సమాజాల నుంచి వచ్చే సవాళ్ళను విజయవంతంగా ఎదుర్కొనడానికి చేసే ప్రయత్నంలోనే నాగరికత అన్నది ఆవిర్భవిస్తుందని టాయిన్‌బీ సిద్ధాంతం. దీనికి ఆయన "ఛాలెంజ్ అండ్ రెస్పాన్స్" (సవాలు-జవాబు) అని పేరు పెట్టాడు. అంటే పరిస్థితులు అను

కూలంగా కాక, ప్రతికూలంగా వున్నప్పుడే నాగరికతా సృష్టికి ప్రేరణ కలుగు తుందని ఆయన వాదం. ఈ సిద్ధాంతానికి నిరూపణగా ఆయన ప్రాచీన, అర్వాచీన చరిత్ర నుంచి ఇచ్చిన అనేకోదాహరణలలో ఆయన ప్రతిభా వైదుష్యాలు అచ్చెరువు కలిగిస్తాయి.

టాయిన్‌బీపై విమర్శలు రాకపోలేదు. కొన్ని వైరుధ్యాలకు ఆయన లోనైనాడని ఒక విమర్శ. ఆయన సాధారణీకరణ (జనరలైజేషన్) కొన్ని చోట్ల మితిమీరినదని మరొక విమర్శ. మతం వల్ల ఆయన విశ్వాసంపై వేరొక విమర్శ. ఏమైనా ఆయన పాండిత్య వైభవాన్ని కాదన్న వారు లేరు.

చరిత్రకారులు సాధారణంగా జోస్యం చెప్పకుండా వుండలేరు. టాయిన్‌బీ మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలను గురించి ముందుగానే ఊహించి చెప్పాడట. సుమారు ఇరవై ఏళ్ళ క్రిందట - ప్రాక్పశ్చిమ సైనిక కూటాల మధ్య ప్రచ్ఛన్న యుద్ధం తీవ్రంగా వున్న సమయంలో—ఆయన ఇండియాలో పర్యటిస్తూ ఒక ప్రసంగంలో క్యాపిటలిజమ్, కమ్యూనిజమ్‌లు ఎన్నటికైనా సహజీవనం చేయక తప్పదని చెప్పాడు. దీనికి సమర్థనగా మధ్య యుగాలలో పరస్పర విద్వేషంతో ఘర్షించిన ఇస్లామ్, క్రైస్తవ మతాలు ఈనాడు సహజీవనం నెరపడాన్ని ఆయన ఉదాహరించాడు. ఆయన మాటలు ఆనాడు ఆశ్చర్యం కల్గించినా, ఈనాడు పరిణామాలను బట్టి ఆయన సరిగానే ఊహించినట్టు అనుకోవాలి.

తన "స్టడీ ఆఫ్ హిస్టరీ" లో ఇండియాను గురించి కూడా టాయిన్‌బీ ఒక ఊహాగానం చేశాడు. ఇండియా ఎదుర్కొంటున్న పెద్ద సవాలు జనాభా పెరుగుదల అని, దాన్ని భారతీయ నాయకులు పాశ్చాత్య మానవతా పద్ధతులలో ఎదుర్కొన లేకపోతే ఇండియాను కమ్యూనిజం లోగొనక తప్పదని ఆయన భావన.

ప్రొఫెసర్ టాయిన్‌బీ సిద్ధాంతాలు, జోస్యాలు ఎట్టివైనా, వాటిలో కొన్నిటితో ఏకీభవించ లేకపోయినా, ఒక మౌలిక చరిత్ర కారుడుగా ఆయన ప్రతిభా పాండిత్యాలకు జోహారు లర్పించని వారుండరు.

(అక్టోబర్ 25, 1975)

# చార్లీ చాప్లిన్

సినిమా అనేది అప్పటికింకా సాంకేతికమైన ఒక వింత మాత్రమే. దానికొక వ్యాకరణంగాని, శిల్పంగాని ఇంకా ఏర్పడలేదు. ఒక కళగా అది ఇంకా రూపురేకలు దిద్దుకోలేదు. అసలు సినిమా ఎన్నటికైనా ఒక ప్రత్యేక కళగా రూపుదాల్చగలదన్న ఆలోచన కూడా ఎవరికీ కలగని రోజులవి.

ఆ ప్రారంభ దినాలలో సినిమాను ఒక కళగా తీర్చిదిద్దడానికి, దానినొక ఉత్తమ వినోద సాధనంగా మలచడానికి కొందరు ప్రతిభావంతులు ప్రయత్నించారు. వారిలో ఒకరు మొన్న తన 88వ ఏట అస్తమించిన చార్లీ చాప్లిన్. కర్ణుడులేని భారతం లేనట్టు, చాప్లిన్ లేని ప్రపంచ చలనచిత్ర కళను ఊహించలేము. దాని మూల పురుషులలో, మార్గదర్శకులలో ఆయన ఒకడు. హాలీవుడ్ ప్రపంచ చలనచిత్ర రాజధానిగా అభివృద్ధి కావడానికి తోడ్పడిన వారిలో కూడా ఆయన ఒకడు.

బౌలర్ టోపీ, ముక్కుకింద చిన్న మీసకట్టు, బిగుతు కోటు, వదులు పంట్లాము, చిరిగిన బూట్లు, చేతిలో కర్ర—ఇదీ ఆయన వేషం. రెండు దశాబ్దాల పాటు తాను నిర్మించిన ప్రతి చిత్రంలో ఇదే వేషంతో నిరుద్యోగిగా, భగ్న ప్రేమికుడుగా, "దగాపడిన తమ్ముడు"గా, ఎవరికీ అక్కరలేని అప్రయోజకుడుగా, ఒక చోట స్థిరనివాసం లేని దేశ ద్రిమ్మరిగా, నా అనేవారు లేని అనాథుడుగా — ఇంకా రకరకాల "అల్పజీవి" పాత్రలను చాప్లిన్ ధరించి, తన అపూర్వ హాస్య పటిమతో ప్రపంచ వ్యాప్తంగా కోట్లాది ప్రజలను పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వించాడు.

అయితే, అతడు కేవలం హాస్యనటుడే కాదు. అతని కేవలం హాస్య చిత్రాలే కావు. అతని హాస్యంలో "కిడ్", "సిటీలైట్స్" చిత్రాలలో వలె కరుణరసం కూడా తొటికిసలాడేది. "మోడరన్ టైమ్స్" చిత్రంలో వలె యంత్ర నాగరికతపై వ్యాఖ్య వుండేది. "గ్రేట్ డిక్టేటర్"లో వలె ఫాసిజంపై దాడి వుండేది. "మున్స్యూర్ వెర్డూ" చిత్రంలో వలె నేరాలకు అస్కారమిచ్చే ఆధునిక సంఘ వ్యవస్థపై నిశిత విమర్శ వుండేది. "లైమ్‌లైట్" చిత్రంలోవలె నవ్వించే శక్తిని కోల్పోయిన హాస్యనటుని పాత్ర ద్వారా స్వీయ కథా ఛాయలు వుండేవి. మొత్తంపై అన్ని చిత్రాలలో ఒక ఆశావాదం, మానవతావాదం అంతర్వాహినులుగా వుండేవి.

అతనిది అసాధారణ ప్రతిభ, అనితర సాధ్యమైన కళాకౌశలం. ప్రపంచంలోని ఉత్తమోత్తమ చిత్రాలను పదింటిని ఎన్నిక చేయవలసి వస్తే వాటిలో చాప్లిన్ చిత్రాలలో కనీసం ఏ రెండింటినో చేర్చక తప్పదు. చలన చిత్రాల చరిత్రలో అతడిని మించిన నటుడు లేడని ఇప్పటికీ కూడా విమర్శకులు అభిప్రాయపడతారు. ఆయన మరణం అసంఖ్యాకులైన ఆయన అభిమానులకు తీరని విచారం కలిగిస్తుంది.

(డిసెంబర్ 27, 1975)

# చౌ ఎన్ లై

నవ చైనా నిర్మాతలలో మొదటగా పేర్కొనవలసిన వ్యక్తి మావో సే టుంగ్ అయితే, రెండవవాడు చౌ ఎన్ లై. చైనా కమ్యూనిస్టు రిపబ్లిక్‌గా అవతరించిన నాటినుంచి మావోది తిరుగులేని అధికారం కాగా, అతని తర్వాత అంతటి అధికార ప్రాభవాన్ని చెల్లించుకున్న వ్యక్తి చౌ ఎన్–లై. అయినా, వీ రుభయులలో పోలికలకంటె తేడాలే ఎక్కువ.

మావో సామాన్య కర్షక కుటుంబంనుంచి వచ్చినవాడు కాగా, చౌ సంపన్న కులీన కుటుంబంలో జన్మించినవాడు. మావో స్వదేశంనుంచి అడుగు బయటపెట్టడం అపురూపం. కాని, చౌ పెక్కుసార్లు విస్తృతంగా ప్రపంచ పర్యటనలు చేసిన వ్యక్తి. అతని విద్యాభ్యాసమే ఫ్రాన్సు, జర్మనీ మొదలైన యూరోపియన్ దేశాలలో జరిగింది. మావో మనస్సు ఏ క్షణంలో, ఏ విధంగా మారుతుందో ఎవ్వరూ ఊహించలేరు. అది ఒకసారి ఉత్తరధ్రువం వైపు ప్రయాణిస్తే మరొకసారి దక్షిణ ధ్రువం వైపు వెడుతుంది. చౌ ఎన్ లైది తొణుకు బెణుకు లేని నిశ్చల ప్రవృత్తి, వాస్తవిక

దృక్పథం. మావో ఎక్కువగా సిద్ధాంతకారుడుగా, స్వాప్నికుడుగా కనిపిస్తాడు. చౌ సమర్థుడైన పరిపాలకుడుగా, సాటిలేని దౌత్యనీతిజ్ఞుడుగా పేరు తెచ్చుకున్నాడు.

ఇంకా ఎన్నో విధాలుగా ఎంతో భిన్నత్వం ఉభయులలో కనిపిస్తుంది. అయినా, ఒక అర్ధశతాబ్దానికి పైగా వీరిరువురు మొదట చైనా కమ్యూనిస్టుపార్టీ సహస్థాపకులుగా, సహవిప్లవకారులుగా, కమ్యూనిస్టు చైనా అవతరణ తర్వాత నాయకుడుగా, అనుచరుడుగా కలిసి మెలిసి పనిచేయడం ఆశ్చర్యకర విషయమే.

ఇంతేకాదు. చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపనలో, ఆ తర్వాత విప్లవోద్యమాలలో, 1934-35 నాటి "లాంగ్‌మార్చ్"లో, కమ్యూనిస్టు చైనా రాజకీయాలలో ప్రముఖపాత్ర వహించినవారు ఎందరో క్రమంగా పదభ్రష్టులు కావడమో, అనామకులుగా మిగిలి పోవడమో జరిగింది. కాని, చౌ ఎన్ లై మాత్రమే చెక్కు చెదరకుండా తన పలుకుబడిని 1949 నుంచి నేటివరకు ప్రధానిగా అధికారాన్ని నిలబెట్టుకొవడం కూడా ఆశ్చర్యమే.

లియు షావ్ చీ వలె, లిన్ పియావో వలె, మరి పెక్కుమంది అగ్రనాయకుల వలె చౌ ఎన్ లై నయితం కొన్నిసార్లు పదవీ భ్రష్టుడు కాగల సూచనలు కనిపించక పోలేదు. ముఖ్యంగా 1966—69 సంవత్సరాల మధ్య సాంస్కృతిక విప్లవకాలంలో చౌ ఎన్ లైపై చైనాలో ఎన్నో తీవ్ర విమర్శలు వచ్చాయి. కాని, అన్ని సందర్భాల లోను అన్ని ఒడుదుడుకులను తట్టుకుని అతడు నిలబడ్డాడు. మావోయిజం ఎన్ని వెర్రి తలలు వేసినా, మావో నాయకత్వాన్ని తూచా తప్పకుండా అతడు అనుసరించడం ఇందుకు కారణమై వుండవచ్చు. ఒకటి రెండేళ్ళుగా వ్యాధిగ్రస్తుడై ఆస్పత్రిలో వున్నా, మొన్న కన్ను మూసేనాటివరకు ప్రధానిగానే కొనసాగడానికి కూడా అతని శక్తి సామర్థ్యాలతోపాటు మావో అండదండలే కారణమై వుండాలి.

రెండున్నర దశాబ్దాలుగా తన దేశ రాజకీయాలలో ముఖ్యపాత్ర వహించిన చౌ కాలధర్మం తర్వాత చైనా విధానాలు ఏ విధంగా మారనున్నవో, అసలు మారనున్నవో లేదో చెప్పలేము. అమెరికాతో సయోధ్య, రష్యా, ఇండియాల పట్ల విరోధం—ఇవన్నీ మావో నిర్ణయించిన విధానాలే అయివుండాలి కనుక, వీటిలో మార్పు రాకపోవచ్చు. చైనా నాయకత్వంలో మరింత పెద్ద మార్పు వచ్చిననాడుగాని, ఇండియా చాచిన మైత్రీహస్తాన్ని అది అందుకొవడం బహుశా జరగకపోవచ్చు.

(జనవరి 10, 1976)

# విప్లవ కవి

కాజీ నజ్రుల్ ఇస్లామ్‌ను పోల్చవలసింది బ్రేకటోవా అగ్నిపర్వతంతో, నయాగరా జలపాతంతో!

ఆ అగ్నిపర్వతం నేడు శాశ్వతంగా చల్లారిపోయింది. ఆ జలపాతం నేడు శాశ్వతంగా ఇంకి పోయింది.

టాగోర్ వ్రాసిన బెంగాలీలోనే నజ్రుల్ ఇస్లామ్ కూడా తన కవిత్వం వ్రాశారు. అయినా, భాషలో, భావాలలో ఉభయులకు ఉత్తర, దక్షిణ ధ్రువాల కున్నంత విభిన్నత.

టాగోర్ కవిత మధుర వీణాక్వాణం, మృదుల వేణుగానం. నజ్రుల్ గీతాలు సింహ గర్జనలు, భేరీ భాంకారాలు.

నజ్రుల్ విప్లవ కవి. భారతీయ సాహిత్యాలలో బహుశా తొలి విప్లవ కవి. బెంగాలీలో వ్రాసినా, టాగోర్ తర్వాత, టాగోర్ వలె, అంతగా సమకాలిక భారతీయ సాహిత్యాలను, సాహిత్య దృక్పథాలను ప్రభావితం చేసిన కవి మరొకడు లేడు.

ఆనాటి జాతీయోద్యమంతో ఆయన ఉత్తేజితు డయ్యాడు. గాంధీని ఆయన కంసారి అయిన కృష్ణునితో పోల్చాడు. చరఖా ధ్వనిని స్వరాజ్య రథ చక్ర ఘోషగా వర్ణించాడు. గాంధీజీ అహింసా సమర ప్రభావం ఆయనపై పడింది. కాని, అంతకంటె మిన్నగా ఆనాటి బెంగాలీ టెర్రరిస్టుల నుంచి ఆయన ఉత్తేజం పొందాడు.

ఆ ఉత్తేజం ఫలితమే అయిదున్నర దశాబ్దాల నాడు నజ్రుల్ ఇస్లామ్ ప్రచురించిన "విద్రోహి" గేయం. ఆయన విప్లవ గీతాలు ప్రళయ ఝంఝూనిలం వలె ఆనాటి భారతావనిని ఊపివేశాయి.

"నడవండిక మునుముందుకు!
రణభేరీ ధ్వానంతో
గగనసీమ మార్మోగెను!
పృథ్వీ తల మెత్లెదలా
ఒకే ఒక్క విరీక్షణ!
అరుణోదయ యువ
సైనికులారా!
నడవండిక మునుముందుకు!"

అని నజ్రుల్ ఆనాడు పెట్టిన పొలికేకకు బ్రిటిష్ ప్రభుత్వం అదిరిపడింది. నిద్రిత భారతి జాగృతమైంది. ఆయన పిలుపును అందుకున్న వారెందరో స్వాతంత్ర్య సమరాంగణంలోని కురికారు. "నజ్రుల్ గీతాలకు కదను తొక్కుతూ కదనానికి కదలి వెడతాము. ఆయన గీతాలు ఆలపిస్తూ చెరసాలకు చరచర అడుగులు వేస్తా"మని ఒక సారి సుభాస్‌చంద్ర బోసు అన్నాడట.

"విద్రోహి" ప్రచురణ తర్వాత మరి ఇరవై ఏళ్ళ పాటు నజ్రుల్ ఇస్లామ్ లేఖిని నుంచి పుంఖానుపుంఖంగా విప్లవగీతాలు వెలువడ్డాయి. ఇవికాక ఆయన మరెన్నో ప్రేమ గీతాలు, ముఖ్యంగా ఘజల్స్ వ్రాశాడు. నవలలు, నాటకాలు వ్రాశాడు. హాఫిజ్, ఖయ్యాముల పార్సీ కవితలకు అనువాదాలు చేశాడు. అయినా, విప్లవ మహాకవిగానే ఆయనకు బెంగాలీ సాహిత్యంలో అనితర లభ్యమైన స్థానం.

నజ్రుల్ ఇస్లామ్ జన్మతః మహమ్మదీయుడైనా, హిందూ—ముస్లిం సమైక్యాన్ని కోరినవాడు. దేశ విభజనను వ్యతిరేకించినవాడు ఒక హిందూ వనితను వివాహ మాడడమే కాదు, హిందూ సంస్కృతిపట్ల ఆయనకు ఎనలేని అభిమానం. తాంత్రిక, యోగ శాస్త్రాలను ఆయన అభ్యసించినాడని, ఉపనిషత్తులు పఠించే వాడని చెబుతారు.

ఆయన జన్మించింది నేటి పశ్చిమ బెంగాల్‌లోని బర్ద్వాన్ జిల్లాలో. మొన్న కన్ను మూసింది నేటి బంగ్లాదేశ్ రాజధాని ఢాకాలో. ఉభయ దేశాలకు ఆయన పర మాప్తుడు, అభిమాన పాత్రుడు. కనుకనే, భారతప్రభుత్వం ఆయనను "పద్మభూషణ్" అవార్డుతో సత్కరించింది. పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం ఆయనకు వార్షికవృత్తిని ఏర్పాటు చేసింది. ఏ దేశంలోని వారైనా, బెంగాలీలో ఏటేటా ఆయన జన్మదినోత్స వాలను సమానంగా జరుపుకుంటున్నారు. ఆయన మరణం ఉభయదేశాల వారికి సమానంగా దుఃఖ కారణం.

(అగస్టు 31, 1976)

# అంతమైన "లాంగ్‌మార్చ్"

ఆయన జన్మించింది హ్యూనాన్ రాష్ట్రంలోని సామాన్య కర్షక కుటుంబంలో; మరణించింది 80 కోట్ల చైనీస్ ప్రజల తిరుగులేని అధినేతగా.

మావో సే టుంగ్ నిశ్చయంగా అసాధారణ వ్యక్తి; చరిత్రాత్మక వ్యక్తి. ఈ శతాబ్దపు ప్రథమార్ధ భాగంలో ప్రపంచ రాజకీయాలను ప్రభావితం చేసినవారు లెనిన్, స్టాలిన్, గాంధీజీ, చర్చిల్, రూజ్‌వెల్టులు కాగా, ద్వితీయార్ధంలో నెహ్రూను మినహాయిస్తే, మావో వలె ప్రభావితం చేసినవారు మరొకరు లేరు.

చైనాలో రాజరికాన్ని కూలద్రోసిన తిరుగుబాటులో తన 18 వ ఏటనే పాల్గొన్న మావో నాటినుంచి నిర్విరామంగా రాజకీయోద్యమాలలో పాల్గొంటూనే వున్నారు. చైనాకు సంబంధించినంతవరకు సన్ యత్ సెన్ తర్వాత ప్రధాన పాత్ర మావోదే. చైనాలో మధ్యయుగాలనాటి వాతావరణాన్ని తొలగించి ఆధునికయుగాన్ని ప్రవేశపెట్టిన ఘనత సన్ యత్ సెన్‌ది కాగా, ఆ దేశాన్ని ప్రపంచంలో ఒక బలీయమైన శక్తిగా తీర్చిదిద్దిన ఘనత మావోదే. ఆయన కాలధర్మంతో చైనాలో అర్ధ శతాబ్ది క్రిందట ప్రారంభమైన ఒక శకం అంతరిస్తున్నది.

తాను 1920లో మార్క్సిస్టుగా మారినట్టు మావో స్వయంగా చెప్పుకున్నారు. సరిగా అప్పుడే ఆయన చైనీస్ కమ్యూనిస్టు పార్టీని స్థాపించారు. మధ్యలో కొద్ది కాలంపాటు ఆయనకు ప్రత్యర్థిగా చౌ ఎన్ లైది పైచెయ్యి అయినా, 1934—35 నాటి "లాంగ్ మార్చ్" తర్వాత చైనీస్ కమ్యూనిస్టు పార్టీకి మావోదే తిరుగులేని నాయకత్వం. ఆయన నిర్దేశించిన గెరిల్లా పద్ధతులతోనే కమ్యూనిస్టు పార్టీ, రెడ్ ఆర్మీలు ఒకవైపు జాపనీస్ దురాక్రమణదారులతోను, మరొక వైపు చాంకైషేక్ వర్గంతోను నిర్విరామంగా, విజయవంతంగా పోరాటం సాగించాయి.

చైనా 1949 లో పూర్తిగా కమ్యూనిస్టుల కైవసం కావడం మావో విజయాలకు పరాకాష్ఠ. మొదట రాజ్యాధినేతగా, 1959 నుంచి పార్టీ చైర్మన్‌గా చైనా అంతరంగిక, విదేశాంగ విధానాలన్నిటిపైన మావో ముద్ర వున్నది. ఇంతేకాదు. సోవియట్ యూనియన్‌లో స్టాలిన్ ఆరాధన ఒక ఉద్యమంగా జరిగినట్టు చైనాలో మావో వ్యక్తిపూజ ఒక ఉద్యమంగా ప్రారంభమై ఇటీవలి వరకు కొనసాగింది. ముఖ్యంగా, 1958 నాటి "గ్రేట్ లీప్" విఫలమైన తర్వాత తనపట్ల చైనాలో భయభక్తులు తగ్గుతున్నవని గ్రహించిన మావో 1976లో సాంస్కృతిక విప్లవం పేరుతో ఒక మహోద్యమాన్ని ప్రారంభించి తన సంపూర్ణాధిపత్యాన్ని పునఃప్రతిష్ఠించుకోవడానికి ప్రయత్నించారు. చైనాలో సమస్త సమస్యలకు పరిష్కారం మావో భావాలేనన్న ప్రచారం హాస్యాస్పదమైన స్థాయివరకు వెళ్ళింది ఆ కాలంలోనే.

కొంతకాలంగా అస్వస్థుడుగా వుండడంవల్ల, ముఖ్యంగా తనకు కుడిభుజం వంటి చౌ ఎన్‌లై, చిర సహచరుడు చూటేహ్ మరణం తర్వాత మావో తన పూర్వ ప్రాభవాన్ని కొంత కోల్పోయినట్టు కనిపిస్తుంది. భావి చరిత్రకారులు ఆయనకు ఏ స్థానం ఇవ్వగలరో ఇప్పుడు చెప్పలేము. బ్రతికి వున్నంతకాలం నియంతగా, నిరంకుశాధికారం చెల్లించుకున్న స్టాలిన్‌ను మరణానంతరం సాధారణ నాయకుడుగా దించివేయడం రష్యాలో జరిగింది. చైనాలో మరికొంతకాలం గడచిన తర్వాత మావో విషయంలో కూడా అంతే జరిగినా ఆశ్చర్యం లేదు. అయితే, ఎవరెంతగా నిరసించినా రష్యాను ఒక ఆధునిక మహాశక్తిగా తీర్చిదిద్దిన వ్యక్తి స్టాలిన్. అదే విధంగా చైనాను ఒక బలీయమైన, సుసంఘటితమైన శక్తిగా రూపొందించింది మావోయేనన్న విషయాన్ని ఏ చరిత్రకారుడూ కాదనలేడు.

(సెప్టెంబరు 10, 1976)

# విశ్వనాథ

నవ్యాంధ్ర సాహిత్య నిర్మాతలలో ఆయన ఒకరు. ఈ శతాబ్దిలోనే కాదు. ఏ శతాబ్దిలోనైనా తెలుగునాట మహాకవి పండితులలో ఆయన ఒకరు.

విశ్వనాథ సత్యనారాయణ దృక్పథంతో, అభిప్రాయాలతో విభేదించే వారైనా ఈ విషయాన్ని అంగీకరిస్తారు. ఎనభై ఒక్క సంవత్సరాల పరిపూర్ణ జీవితం తర్వాత సోమవారంనాడు ఆయన అస్తమయం నవ్యాంధ్ర సాహిత్య ప్రపంచంనుంచి ఒక మహామనీషి నిర్గమనం.

అర్ధ శతాబ్దికి పైగా తెలుగు సాహిత్యాన్ని విశ్వనాథ తన బహు రచనల ద్వారా, బహుముఖ రచనల ద్వారా సుసంపన్నం చేశారు. మంచికో, చెడుకో దాన్ని ప్రభావితం చేశారు.

తెలుగు సాహిత్యంలో ఆయన తడవని విషయం లేదు, చేపట్టని ప్రక్రియ లేదు. ఆయన వస్తుతః కవి, పండితుడు. కవి, పండితులైన వారు తక్కిన సాహిత్య శాఖల వైపు అంతగా వెళ్ళకపోవడం కద్దు. కాని, విశ్వనాథ పుంఖానుపుంఖంగా కవితలతో పాటు, నవలలు, నాటకాలు, నాటికలు, కథానికలు, విమర్శా గ్రంథాలు అసంఖ్యాకంగా రచించారు. అన్నిటిలోను ఆయనది ఒక ప్రత్యేక మార్గం, అన్నిటి పైన అచ్చుగుద్దినట్టు ఆయన స్వీయ ముద్ర.

గిరికుమారుని ప్రేమ గీతాలు, కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి, ఆంధ్ర ప్రశస్తి, ఋతు సంహారం, శృంగార వీథి, శశిదూతం—ఇవన్నీ ఆయన తొలినాళ్ళ రచనలు. అవి ఆంధ్ర భారతికి అమూల్యాలంకారాలు, శాశ్వతాలంకారాలు. అప్పటి

ఆయన కవిత ఎంత పాండిత్య ప్రకర్షకమో అంత రసోద్దీపకం. ఎంత ప్రౌఢమో అంత మృదు మధురం. ఎంత సాంప్రదాయికమో అంత నవీన మార్గానుసారిణి.

అయితే, ఆనాటి విశ్వనాథ వేరు, ఆ తరువాత విశ్వనాథ వేరు. తొలినాటి విశ్వనాథ పెక్కుమంది తన సహకవుల వలె సాహిత్యంలో ముందుకు దృష్టి సారించిన కవి. మలినాటి విశ్వనాథ వెనుకకు, ఇంకా ఇంకా వెనుకకు దృష్టి తిప్పిన కవి.

ఈ మలినాళ్ళ విశ్వనాథ అభిప్రాయాలన్నింటిని మేము హర్షించలేము. ఆయన అభిప్రాయాలు ప్రగతికి బద్ధ శత్రువులని మా నమ్మకం.

ఆయన మార్పును ఆహ్వానించ లేదు. మార్పును హర్షించలేదు. మన సమాజంలో ఇంగ్లీషు చదువులతోనే నవ్యచైతన్య స్ఫూర్తి కలిగింది. ఆయన ఇంగ్లీషు చదువులను నిరసించారు. ఇంగ్లీషు భాషను, చదువులనే కాదు. ఏ నూత్న భావ చైతన్యాన్నీ ఆయన ఆహ్వానించలేదు. హర్షించలేదు.

నడి వయస్సు నుంచి ఆయన వ్రాసిన ప్రతి రచనలో—అది కావ్యం కానివ్వండి, నవల కానివ్వండి, మరొకటి కానివ్వండి—అన్నింటిలో, అన్ని వేళల, సంప్రదాయాన్ని ఆయన సమర్థించిన ధోరణే ప్రస్ఫుటమైంది. కుల వ్యవస్థను ఆయన సమర్థించారు. ఫ్యూడల్ వ్యవస్థను సయితం సమర్థించారు. మంచి చెడులతో నిమిత్తం లేకుండా అది ఎంత పురాతన సంప్రదాయమైతే ఆయన దృష్టిలో అంత ఉత్తమ సంప్రదాయం.

అయినా విశ్వనాథ మహాకవి, మహాపండితుడు. ఆయనవలె అంత విస్తృతంగా, అంతటి వైవిధ్యంతో, అంతటి ప్రతిభతో సాహిత్య సృష్టి చేసినవారు అరుదుగా కనిపిస్తారు. ఆయన పాండిత్యం అపారమైనది. ఆయన భావన నిశితమైనది. ఆయన మృతితో ఆంధ్ర సాహితి ఒక అసాధారణ రచయితను, ప్రజ్ఞాశాలిని కోల్పోయింది.

(అక్టోబర్ 19, 1976)

# శివశంకర స్వామి

అయిదారు దశాబ్దాల క్రిందట ఆంధ్రలో వ్యాపించిన నవ్యసాహిత్యోద్యమాన్ని ఒక ప్రభంజనంతో పోల్చవచ్చు. ఈ ప్రభంజనం అనేక శతాబ్దాలుగా స్తబ్ధంగా వున్న ఆంధ్ర సాహిత్యంలో ఒక కొత్తకదలికను కలిగించింది. ఒక నూత్న చైత

వ్యాన్ని తీసుకు వచ్చింది. ఆనాటి యువకవులు పాత కవితా సంప్రదాయాలన్నూ, కవి సమయాలను త్రోసిరాజని, కొత్త భావాలను కొత్త గొంతుకలతో వినిపించడం మొదలు పెట్టారు.

అప్పటి నవ్యసాహిత్యోదయం ఒక వెల్లువ వంటిదైతే, దానిలోని కెరటాలుగా పేర్కొనదగువారు రాయప్రోలు, అబ్బూరి, విశ్వనాథ, దువ్వూరి, దేవులపల్లి, నాయని, వేదుల ప్రభృతులు. వీరిలోనే మరొక పెద్ద కెరటం మొన్న తమ 85 వ ఏట కన్ను మూసిన తల్లావఝుల శివశంకర శాస్త్రి.

ఆయనది కూలంకషమైన బహుభాషా పాండిత్యం. అంతులేని విజ్ఞానదాహం. ప్రతిభ ఎక్కడ వున్నా మనసారా మెచ్చుకునే సహృదయత. శివశంకర స్వామ్యులైన తర్వాత కూడా వసివాడని రసజ్ఞత. ఇవి శివశంకర శాస్త్రి గారితో ఏ కొద్ది పరిచయం కలవారినైనా ఆకర్షించే గుణాలు.

సాహితీ సమితి సభాపతిగా ఆయన ఆనాటి యువకవు లెందరికో నాయక స్థానంలో వుండేవారు. ఆయన హృదయ వాది. ఆయన ఖండ కవితా సంపుటి "హృదయేశ్వరి" ఆనాటి కవులెందరికో ప్రేరణ నిచ్చింది. సాహితి, సఖి, ప్రతిభ వంటి చక్కని సాహిత్య పత్రికలతో, నవ్యసాహిత్య పరిషత్తుతో ఆయనకు సన్నిహిత సంబంధం వుండేది.

ఇంగ్లీషులో పద్య నాటకాలు సర్వ సామాన్యం. ఆధునిక కాలంలో కూడా టి. ఎస్. ఇలియట్ వంటివారు పద్య నాటకాల ప్రక్రియను వదలి పెట్టలేదు. కాగా, తెలుగులో పద్య నాటకాలను మొదటిసారిగా ప్రవేశ పెట్టిన ఘనత శివశంకర శాస్త్రి గారిదే. జయదేవుని కథ ఆధారంగా ఆయన వ్రాసిన "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" పద్య నాటకం ఈ ప్రక్రియలో కొత్త ఒరవడి పెట్టింది. ఆ తర్వాత ఆయన సాహిత్య వ్యాసంగం బహుముఖంగా సాగింది. కవితలు, అనువాదాలు, విమర్శలు, పద్య నాటకాలు, బహుళంగా రచించి తెలుగు సాహితిని పరిపుష్టం చేశారు. ముఖ్యంగా నవ్య సాహిత్య వైతాళికులలో ఒకరుగా ఆయనను తెలుగువారు జ్ఞాపకం వుంచుకుంటారు.

(ఏప్రిల్ 5, 1977)

# ఉదయశంకర్

సోమవారంనాడు కలకత్తాలో ప్రఖ్యాత భారతీయ నాట్యాచార్యుడు ఉదయశంకర్ అస్తమయంతో భారతీయ నాట్య ప్రపంచం ఎంతగానో పేద పడింది.

భారతీయ నాట్యరీతికి ఆధునిక రూపమిచ్చి, దానికి పాశ్చాత్య ప్రపంచంలో ఒక గౌరవాన్ని - ఒక ఆకర్షణను — కూర్చినవాడు ఉదయశంకర్. సాహితీ ప్రపంచంలో ఒక టాగోర్‌కు, చలనచిత్ర జగతిలో ఒక సత్యజిత్‌రాయ్‌కి, తత్వశాస్త్ర రంగంలో ఒక రాధాకృష్ణన్‌కు అంతర్జాతీయంగా ఎంతటి ప్రఖ్యాతి కలదో నాట్య రంగంలో అంతగా ఖ్యాతిని గడించినవాడు ఉదయశంకర్.

సంప్రదాయ సిద్ధమైన భారతీయ నాట్యరీతిని ఆయన పక్కదారులు తొక్కిస్తున్నాడని కొందరు సంప్రదాయ వాదులు తనను ఆడి పోసుకున్నా, ఆయన లెక్క చేయలేదు. ఆధునిక దేశ కాలమాన పరిస్థితులను ఆకళింపు చేసుకుని, తదను గుణంగా కొత్త రూపురేఖలు దిద్దుకోనిదే భారతీయ నాట్యరీతి వర్ధిల్ల లేదని, దేశావధులను అధిగమించి, పాశ్చాత్య ప్రపంచానికి సయితం తన ప్రత్యేకతను ప్రదర్శించలేదని ఆయన భావించారు. ఈ దృష్టితోనే శాస్త్రీయమైన భారతీయ తాళాలను తానే రూపకల్పన చేసిన తన స్వీయ నృత్య రూపకాలకు అనుగుణంగా ఒదిగేటట్లు ఆయన చేయగలిగారు. ఆయన ఈ వినూత్న ప్రక్రియ ఆధునిక ప్రాచ్య, పాశ్చాత్య నృత్య విమర్శకుల ప్రశంసలు పొంద గలిగింది.

జాతి, మత, దేశావధులను అతిక్రమించి వర్ధిది ఉదయశంకర్ కళాసేవ. ప్రఖ్యాత రష్యన్ నర్తకి అనా పావ్లోవాతో కలిసి, ఆయన ఆ రోజుల్లో జరిపిన జైత్రయాత్ర భారతీయ నృత్యరీతికి ఒక స్వర్ణ యుగం. తానే రూపొందించిన "రాసలీల" నృత్యరూపకంలో తాను కృష్ణుడుగా, పావ్లోవా రాధగా ప్రదర్శించిన నాట్య విభవం ప్రాచ్య, పాశ్చాత్య రసజ్ఞ లోకాన్ని తన్మయం చేసింది.

భారతీయ నృత్యరీతిని ఉన్నతోన్నత శిఖరాలకు కొనిపోయి ప్రపంచ ఖ్యాతిని ఆర్జించి పెట్టిన ఉదయశంకర్ అస్తమయం నృత్య ప్రపంచానికి తీరనిలోటు.

(సెప్టెంబరు 27, 1977)

# నా య ని

నవ్యాంధ్ర సాహిత్యాకాశంలో అయిదు దశాబ్దాలకు పైగా ప్రకాశించిన మరొక ఉజ్వల నక్షత్రం నేడు రాలిపోయింది. ఆ నక్షత్రం పేరు నాయని సుబ్బారావు.

ఆయన పేరు స్మరించగానే స్ఫురించేది "సౌభద్రుని ప్రణయ యాత్ర". 1920-30 సంవత్సరాల మధ్య కలం పట్టిన ప్రతి యువకవి ఆలపించినట్లే ఆయన కూడా మృదు మధురంగా ప్రేమ గీతాలు ఆలపించారు. స్వచ్ఛమైన, హృదయదఘ్నమైన ప్రేమ భావానికి తన గీతాలలో పట్టాభిషేకం చేశారు. ఆనాటి కవులలో ఆయన స్థానం రాయప్రోలు, విశ్వనాథ, కృష్ణశాస్త్రి, కాటూరి, వేదుల మొదలైన వారి సరసన. "ఫలశ్రుతి", "నిత్యక్రీడ" మొదలైన ఖండికలలో ఆయన చూపిన భావనా నైశిత్యం అనితర సాధ్యమైనదిగా కనిపిస్తుంది. అంతేకాదు, తక్కిన భావ కవులు ఊహా ప్రేయసి కోసం విరహ గీతాలు వ్రాస్తుండగా ఆయన "పుడమికిన్ స్వర్గమును కొక్క- ముడి రచించి" తన ప్రేయసి దివ్య సాన్నిధ్యాన్ని అందుకున్న తన అదృష్టాన్ని కీర్తిస్తూ వ్రాశారు.

ఆ రోజులలోనే నాయని వ్రాసిన "మాతృగీతాలు" కూడా ఎంతో ప్రాచుర్యం పొంది ఆయన కీర్తిని ఇనుమడింపజేశాయి. ఆ తర్వాత కూడా ఆయన తన కవితా వ్యవసాయాన్ని కొనసాగించినా, పైన పేర్కొన్న రెండు కృతులు చాలు ఆయన పేరును తెలుగు సాహిత్య లోకంలో చిరస్థాయిగా నిలపడానికి. తన రచనలతో ఆయన ఒక తరాన్ని ఉర్రూత లూగించారు: ఆనాటి యువకులను ప్రభావితులను చేశారు. నిసర్గ సుందరమైన రచనలతో ఆంధ్ర భారతిని అలంకరించినందుకు ఆయనకు తెలుగు వారు సర్వదా ఋణపడి వుంటారు.

(జూలై 9, 1978)

# ఆదర్శమూర్తి

మన దేశంలో రాజకీయవేత్తలకు కొరతలేదు. ఎందరో వున్నారు. కాని, రాజాజీని పోలిన రాజకీయవేత్తలు ఎప్పుడూ అరుదే. కాగా, ఇప్పుడు మరీ అరుదు.

ఆయన వట్టి రాజకీయవేత్త కాదు. అసాధారణ రాజనీతివేత్త. రాజనీతిలోనే కాదు, సాహిత్య, సాంస్కృతిక, సాంఘిక రంగాలలో సయితం ఆయన దొక విశిష్ట పాత్ర. ఆయన ప్రజ్ఞా ప్రాభవాలు బహుముఖమైనవి.

స్వాతంత్ర్యసిద్ధికి ముందు, ఆ తర్వాత దేశ రాజకీయాలను రాజాజీ విశేషంగా ప్రభావితం చేశారు. గవర్నర్ జనరల్‌గా, గవర్నరుగా, కేంద్రమంత్రిగా, రెండు సార్లు మద్రాసు ముఖ్యమంత్రిగా ఆయన ఎన్నో ఉన్నత పదవులు నిర్వహించారు. కాని, దేశ రాజకీయాలపై ఆయన ప్రభావం కేవలం పదవులవల్ల వచ్చింది కాదు. సాధారణ రాజకీయవేత్తలు పదవిలో వున్నప్పుడు ఒక వెలుగు వెలిగి, తర్వాత విస్మృతి పథంలోకి వెళ్ళిపోతారు, కాని రాజాజీ పదవిలోవున్నా, లేకపోయినా— బహుశా పదవిలో వున్నప్పటి కంటె లేనప్పుడే ఎక్కువగా-రాజకీయ రంగంపై ఎన్నటికి చెరగని విధంగా తన ముద్ర వేశారు. పదవిలో వున్నప్పటి కంటె లేనప్పుడే ఆయన ప్రతి మాటను భారతజాతి ఎంతో ఆసక్తితో ఆలకించేది. వివిధ సమస్యలపై ఆయన తన సునిశిత మేధాశక్తితో చేసే విశ్లేషణకు రాజకీయ విభేదాలతో నిమిత్తం లేకుండా ఎంతో విలువ ఇచ్చేవారు.

రాజాజీ శతజయంతి సంవత్సరం ఈ నెల పదవ తేదీనుంచి ప్రారంభమైంది. ఈ సంవత్సర కాలంలో ఎన్నో సభలు జరుగుతాయి. ఎన్నో ఉపన్యాసాలు జరుగుతాయి. ఆయన శిలావిగ్రహాలు, చిత్రపటాల ఆవిష్కరణ జరుగుతుంది. ఆయన

స్మృతి చిహ్నంగా ఒక తపాలా బిళ్ళను ముద్రించడం కూడా జరిగింది. ఒక మహా వ్యక్తి స్మృతిపట్ల గౌరవార్థం ఇవన్నీ జరగవలసినవే. కాని, ఇవి కేవలం లాంఛన ప్రాయమైనవి. రాజాజీ స్మృతిపట్ల నిజమైన గౌరవ ప్రకటన ఆయన తన జీవిత కాలంలో పాటించిన కఠోర నైతిక నియమాలను, అనుసరించిన అత్యున్నతా దర్శాలను మన రాజకీయ, సాంఘిక రంగాలలో ప్రవేశపెట్టి పాలించడంవల్లనే జరుగుతుంది.

ఈ విషయమే రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి మొన్న రాజాజీ శత జయంతి ఉత్సవాలను ప్రారంభిస్తూ జాతికి జ్ఞాపకం చేశారు. ఈ సందర్భంలో ఆయన చేసిన ప్రసంగం రాజాజీ మహోన్నత వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా, ఉత్తేజకరంగా ఆవిష్కరిస్తున్నది. ఆ వ్యక్తిత్వం తన విశ్వాసాలకోసం ఎంత ఉన్నత పదవినైనా క్షణంలో తృణప్రాయంగా త్యాగం చేయగలిగినంతటిది; అభిప్రాయ విభేదం వస్తే తన నాయకుడు, గురువు, బంధువు అయిన గాంధీజీని సయితం ఎదురొడ్డి నిలవగలిగినంత టిది; తనకు ఆప్తమిత్రుడు, అనురాగపాత్రుడు అయిన నెహ్రూతో సయితం తెగ తెంపులు చేసుకొనడానికి వెనుకాడనంతటిది. తన అభిప్రాయాలను, సలహాలను ఎందరు అపార్థం చేసుకున్నా, వాటిని వెల్లడించడానికి జంకని ధీరోదాత్తతతో కూడి నట్టిది; కొన్ని విలువల కోసం ముఖ్యంగా రాజకీయ రంగంలో నైతికమైన విలువల కోసంఅహర్నిశలు ఆవేదన చెందినట్టిది. దైనందిన పరిపాలనలో, అధికార యంత్రాంగంలో ప్రజాసేవా పరాయణత్వాన్ని, కర్తవ్యదీక్షను పాదుకొల్పాలని పరితపించి నట్టిది. మచ్చుకైనా మచ్చలేని విశుద్ధ, నిరాడంబర వ్యక్తిత్వం అది.

రాజాజీ రాజకీయాదర్శాలతో, ఆచరణతో పోలిక తేవడానికైనా తగనివి నేటి రాజకీయాలు. కొద్ది మినహాయింపులతో, అధికార వ్యామోహమే నేటి రాజకీయాలకు ప్రాతిపదిక. మన రాజకీయ జీవితంలో నీతికి, నిజాయితీకి, దృఢ విశ్వాసాలకు, ఉన్నతాదర్శాలకు తావులేకుండా పోయింది. మన రాజకీయ జీవితమే కలుషితమై పోయింది. రాష్ట్రపతిగా ఈనాటి రాజకీయాలపై వ్యాఖ్యానించడం సంప్రదాయం కాకపోయినా జాతి శ్రేయస్సును, భవిష్యత్తును దృష్టిలో పెట్టుకుని, శ్రీ సంజీవ రెడ్డి తమ ప్రసంగంలో అన్యాపదేశంగా చేసిన నిశితవిమర్శ నేటి రాజకీయవేత్త లకు కనువిప్పుగా పనిచేయగలదని ఆశించాలి.

(డిసెంబరు 12, 1978)

# రాళ్ళపల్లివారు

సంస్కృత, ప్రాకృతాలలో, ఆంధ్ర, కన్నడ భాషలలో అపారమైన పాండితీ విభవం, ప్రాచీనార్వాచీన సాహిత్యాలపై నిశితమైన విమర్శా పాటవం, సంగీత కళా, శాస్త్రాలలో వైశారద్యం, సహృదయత, రసజ్ఞత - ఇవన్నీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి సొత్తు. ఆయన 87 సంవత్సరాల నిండు వార్ధకంలో పండుటాకు వలె రాలిపోయినా, ఆంధ్ర విద్వల్లోకానికి అది సంతాపకర వార్త.

హాలుని గాథాసప్తశతికి రాళ్ళపల్లి వారి తెలిగింపు తెలుగు భాషకొక అమూల్యమైన కావ్యం. కేవలం పిల్లల పాఠ్య పుస్తకాలకే పరిమితమైన వేమన కవిత్వపు తత్వాన్ని మథించి ఆయన చేసిన ఉపన్యాస సంగ్రహం తెలుగు విమర్శా సాహిత్యానికే శిరోభూషణమైన కృషి. తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తనలను పరిష్కరించడంలో, స్వరపరచడంలో రాళ్ళపల్లి వారు చూపిన ప్రజ్ఞ సాహిత్య సంగీతాలు రెంటింటిలోను సమానంగా ఆయనకు గల అసమాన వైదుష్యానికి నిదర్శనం.

అయిదారు దశాబ్దాలకు పైగా తామే ఒక సాహిత్య అకాడమీగా విరాజిల్లిన విద్వన్మణి అనంతకృష్ణశర్మ గారు. ఎందరో రచయితలను, పరిశోధకులను ఆయన ప్రోత్సహించారు. ఆయన పీఠికల సంకలనమే ఇందుకు సాక్షి. వక్తగా ఆయన వాగ్ధాటి, వ్యక్తిగా ఆయన సరసత, హాస్యచాతుర్యం ఎందరినో ప్రభావితులను చేశాయి.

సాహిత్య విమర్శలో కొత్త పుంతలు తొక్కిన సి. ఆర్. రెడ్డి గారికి, రాళ్ళపల్లి వారికి మధ్య అభిప్రాయ భేదాలున్నా వాటికి అతీతమైన సన్నిహిత మైత్రి వారిది. ఒకరి నొకరు తమకు గురువుగా సంభావించు కొనేవారట. తెలుగు సాహిత్య విమర్శక లోకంలో కట్టమంచి వారి సరసనే రాళ్ళపల్లి వారికి శాశ్వత స్థానం వుంటుంది.

(మార్చి 13, 1979)

# అబ్బూరి

నవ్యాంధ్ర సాహిత్యానికి 1910-30 సంవత్సరాల మధ్యకాలం స్వర్ణయుగం. ఆంగ్ల, వంగ కవిత్వ ప్రభావితులయిన ఎందరో యువకవులు తెలుగు కవితను ప్రబంధ బంధాల నుంచి విడిపించి కొత్త గొంతులతో, కొత్త రీతులతో కొత్త గీతులు ఆలపించిన కాలం అది. ఆ యుగానికి చెందిన ఉత్తమ కవులలో ఒకరు

అబ్బూరి రామకృష్ణరావుగారు. ఆయన అస్తమయం సాహిత్యాభిమానులకు సంతాప కారణం.

రాయప్రోలుకు అబ్బూరి సమకాలికుడు. ఆయనవలె ఈయన నయితం తెలుగులో ఖండకావ్య ప్రక్రియకు ఆద్యులలో ఒకరు. ఆనాడు నవ్య కవిత్వం పేరుతో, భావ కవిత్వం పేరుతో వెల్లివిరిసిన తెలుగు కవిత ఇంకా సంప్రదాయ శృంఖలాల నుంచి విడివడవిదిగానే ఈనాటి వారికి కనిపించినప్పటికీ, చారిత్రక దృష్టితో చూస్తే అది ఆనాటికి విప్లవాత్మకమయిన మార్గమే. భావాలలో, భావనలో, భాషలో, శైలిలో, ఛందస్సులో—అన్నిటిలోను ఆనాటి తెలుగు కవిత కొత్త పుంతలు తొక్కింది. దానికి దోహదం చేసిన కవులలో అబ్బూరి వారిది ప్రముఖ పాత్ర.

ఆయన బహు వ్యాపకుడు. వ్రాసినవి కొద్ది కావ్యాలే. రాజకీయాలలో తిరిగారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. ఎం.ఎన్. రాయ్ సిద్ధాంతాల వ్యాప్తికి విశేషంగా పనిచేశారు. అభ్యుదయ రచయితల సంఘ స్థాపనకు తోడ్పడ్డారు. నాటక రంగానికి సేవ చేశారు. ఈ బహు వ్యాపృతులలో ఆయన కవితా వ్యాసంగం సన్నగిలినా, ఆయన ప్రభావం ఆనాటి యువకవులపై ఎంతగానో వున్నది. ముఖ్యంగా ఛందస్సులలో ఆయన పోయినన్ని కొత్తపోకడలు వేరెవ్వరు పోలేదు. ఆయన ఛందశ్శిల్పి, శబ్ద చిత్రకారుడు.

అబ్బూరి వివిధ భాషా పరిజ్ఞానం, వివిధ సాహిత్యాభినివేశం, విమర్శా పాటవం, కవితా వైభవం అటుంచి వ్యక్తిగా ఆయనను ఎరిగిన వారెవ్వరు ఆయన సహృదయతను, సంభాషణా చాతురిని, సరస వాగ్ధోరణిని మరచిపోలేరు. వృద్ధాప్యం ఆయన మనస్సుకు అంటలేదు. సంప్రదాయం ఆయన మనస్సుకు సంకెళ్ళు వేయ లేదు. ఆయన మూడు తరాల క్రిందటి వారైనా యువకులలో యువకులుగా, వితో్త్సాహంతో మెలగేవారు. అధునాతన సాహిత్య, తాత్విక, రాజకీయ ధోరణులను ఎప్పటి కప్పుడు ఆకళించుకునే వారు, వాటిపై ఒక ద్రష్టవలె వ్యాఖ్యానించేవారు. కాలంతోపాటు ముందుకు నడిచిన మేధావి అబ్బూరి. నవ్యాంధ్ర సాహిత్య చరిత్రలో ఆయన స్థానం కలకాలం పదిలంగా వుండిపోతుంది.

(మే 1, 1979)

అబ్బూరి రామకృష్ణరావుగారు. ఆయన అస్తమయం సాహిత్యాభిమానులకు సంతాప కారణం.

రాయప్రోలుకు అబ్బూరి సమకాలికుడు. ఆయనవలె ఈయన నయితం తెలుగులో ఖండకావ్య ప్రక్రియకు ఆద్యులలో ఒకరు. ఆనాడు నవ్య కవిత్వం పేరుతో, భావ కవిత్వం పేరుతో వెల్లివిరిసిన తెలుగు కవిత ఇంకా సంప్రదాయ శృంఖలాల నుంచి విడివడనిదిగానే ఈనాటి వారికి కనిపించినప్పటికీ, చారిత్రక దృష్టితో చూస్తే అది ఆనాటికి విప్లవాత్మకమయిన మార్గమే. భావాలలో, భావనలో, భాషలో, శైలిలో, ఛందస్సులో—అన్నిటిలోను ఆనాటి తెలుగు కవిత కొత్త పుంతలు తొక్కింది. దానికి దోహదం చేసిన కవులలో అబ్బూరి వారిది ప్రముఖ పాత్ర.

ఆయన బహు వ్యాపకుడు. వ్రాసినవి కొద్ది కావ్యాలే. రాజకీయాలలో తిరిగారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. ఎం.ఎన్. రాయ్ సిద్ధాంతాల వ్యాప్తికి విశేషంగా పనిచేశారు. అభ్యుదయ రచయితల సంఘ స్థాపనకు తోడ్పడ్డారు. నాటక రంగానికి సేవ చేశారు. ఈ బహు వ్యాపృతులలో ఆయన కవితా వ్యాసంగం సన్నగిలినా, ఆయన ప్రభావం ఆనాటి యువకవులపై ఎంతగానో వున్నది. ముఖ్యంగా ఛందస్సులలో ఆయన పోయినన్ని కొత్తపోకడలు వేరెవ్వరు పోలేదు. ఆయన ఛందశ్శిల్పి, శబ్ద చిత్రకారుడు.

అబ్బూరి వివిధ భాషా పరిజ్ఞానం, వివిధ సాహిత్యాభినివేశం, విమర్శా పాటవం, కవితా వైభవం అటువంటి వ్యక్తిగా ఆయనను ఎరిగిన వారెవ్వరు ఆయన సహృదయతను, సంభాషణా చాతురిని, సరస వాగ్ధోరణిని మరచిపోలేరు. వృద్ధాప్యం ఆయన మనస్సుకు అంటలేదు. సంప్రదాయం ఆయన మనస్సుకు సంకెళ్ళు వేయలేదు. ఆయన మూడు తరాల క్రిందటి వారైనా యువకులలో యువకులుగా, నిత్యోత్సాహంతో మెలగేవారు. అధునాతన సాహిత్య, తాత్విక, రాజకీయ ధోరణులను ఎప్పటి కప్పుడు ఆకళించుకునే వారు, వాటిపై ఒక ద్రష్టవలె వ్యాఖ్యానించేవారు. కాలంతోపాటు ముందుకు నడిచిన మేధావి అబ్బూరి. నవ్యాంధ్ర సాహిత్య చరిత్రలో ఆయన స్థానం కలకాలం పదిలంగా వుండిపోతుంది.

(మే 1, 1979)

# అసాధారణ రచయిత

చలంగారిని పోలిస్తే ఒక నిశ్ఛిద్ర సముద్రంతో పోల్చాలి. ఒక మహా జల పాతంతో పోల్చాలి. ఒక ఝంఝూనిలంతో పోల్చాలి.

చలంగారి అస్తమయంతో ఒక సముద్రం స్తంభించినట్లు, ఒక జలపాతం నిశ్చలమై పోయినట్లు, ఒక ఝంఝూనిలం శాంతించినట్లు.

అరవై ఏళ్ళనాడు గుడిపాటి వెంకటచలం గారు ఆంధ్ర సాహిత్యంలో ఒక సుడిగాలి వలె, ఒక పెద్ద వరదవలె ప్రవేశించారు. సంఘంలో, సాహిత్యంలో, ప్రజల ఆలోచనలో తరతరాలుగా పేరుకుపోయిన కశ్మలాన్ని కడిగి వేశారు. చెత్తా చెదారం, దుమ్మూ దూగర ఎగర గొట్టారు. కొత్త గాలికి తలుపులు తెరిచారు, కొత్త భావాలకు లాకులు ఎత్తివేశారు.

ఒక గొప్ప రచయిత ప్రవేశం తర్వాత ఏ సాహిత్యం యథాతథంగా మిగలదు. దాని స్వరూపం మారిపోతుంది. దాని స్వభావం మారిపోతుంది. సాహిత్యంపై అతడు తన ప్రభావాన్ని ఎన్నటికి చెరగని విధంగా ముద్రిస్తాడు.

చలంగారు చేసిన పని అదే. తెలుగు వచన స్వరూపాన్ని, రచనా స్వభావాన్ని పూర్తిగా మార్చివేశారు. సమకాలిక రచయితల పైన, తరువాత తరం వారిపైన తన ప్రభావ ముద్ర వేశారు.

ఆనాడు ఆయనను గురించి రెండే రెండు అభిప్రాయాలు. విమర్శిస్తే అతి తీవ్రంగా విమర్శించడం, లేదా అంతే గాఢంగా అభిమానించడం. మరొక అభిప్రాయానికి—ఫరవాలేదు బాగానే వ్రాస్తాడు అనో, లేదా ఏమి వ్రాశాడు లెద్దూ అనో చప్పరించి వేయడానికి—వీలులేని రచనలు ఆయన చేశారు.

"చలం ఏమిటి, ఇలా వ్రాస్తాడు? ఇంత పచ్చి బూతులా? ఇంత బరి తెగింపా? అవినీతిని, విశృంఖలత్వాన్ని బోధిస్తున్నాడే! సంఘాన్ని, ముఖ్యంగా వివాహ వ్యవస్థను మూకటి వేళ్ళతో సహా కూలద్రోయడానికి యత్నిస్తున్నాడే! హిందూ సంప్రదాయాన్ని, ఆచారాలను, విశ్వాసాలను, కులభేదాలను మంట గలుపుతున్నాడే!"—ఆయనను ద్వేషించిన వారి విమర్శ ఇది.

కాని ఈ విమర్శలకు చలంగారు చలించలేదు. తాను నమ్మిన సిద్ధాంతాల కోసం సంఘానికి, వ్యక్తులకు ఏది శ్రేయస్కరమని తాను భావించారో ఆ విలువల కోసం ఆయన పుంఖానుపుంఖంగా రచనలు చేస్తూనే పోయారు.

"సెక్సుతో సహా అన్ని విషయాలలోను స్త్రీకి పురుషునితో సమానమైన హక్కు ఉండాలి. యుగయుగాలుగా పురుషుడికి స్త్రీ బానిసగా పడి వుంది. పురుష సమాజం స్త్రీని అణగద్రొక్కి వేసింది. ఆమె ఒక వ్యక్తి అని, ఆమెకొక వ్యక్తిత్వం వుంటుందని, ఆమెకు కూడా సొంత ఇష్టానిష్టాలు, అభిరుచులు, స్వేచ్ఛాసురక్తి వుంటాయని ఊహించలేదు. కేవలం పిల్లలను కని, వంట చేసిపెట్టే మరబొమ్మగానే స్త్రీని పురుషుడు పరిగణించాడు. ఇది అన్యాయం. పురుషునికున్న స్వేచ్ఛ స్త్రీకీ వుండాలి. అప్పుడుగాని ఆమె వ్యక్తిత్వం పరిపూర్ణత్వం చెందదు" అని చలంగారు చాటి ఘోషించారు. కాలానికి ఎదురీదుతూ, గొప్ప ఆత్మ విశ్వాసంతో, అచంచల ధైర్య సాహసాలతో ఆయన తన భావాలను ప్రచారం చేశారు. తన మొత్తం సాహిత్యాన్ని తన సాంఘిక విశ్వాసాలకు అంకితం చేశారు.

ఎన్ని రచనలు? ఒక పెద్ద ఉప్పెన వలె చలం గారి రచనలు ఆంధ్రదేశంపై విరుచుకు పడ్డాయి. ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, మైదానం, బ్రాహ్మణీకం, అమీనా, అరుణ—ఇంకా ఇంకా ఎన్నో అసంఖ్యాకమైన నవలలు, నాటకాలు, కథలు, ఇతర రచనలతో, వాటిలోని అసాంప్రదాయిక భావాలతో ఆయన తెలుగువారిని ఉక్కిరి బిక్కిరి చేశారు.

తన భావాలను కాదంటూ, తన వచన శైలిని ఎవరైనా మెచ్చుకుంటే ఆయన సహించేవారు కాదు. "నా భావాలనుంచి, నా ఆవేశాల నుంచి నా శైలిని విడదీయవద్దు. అవి పరస్పరాశ్రితాలు" అని ఆయన అనేవారు. అయినా, తెలుగులో వ్యావహారిక వచనాన్ని తీర్చిదిద్దిన కొద్ది మందిలో ఒకరుగా ఆయన చరిత్రలో నిలిచిపోతారు. ఒకసారి ఆప్యాయంగా కబుర్లు చెబుతున్నట్టు, మరొకసారి అదలిస్తున్నట్టు, ఒకసారి మృదువుగా, మరొకసారి తీక్షణంగా వుండేది ఆయన భాష. తెలుగుదేశపు ప్రకృతిని అంత అందంగా, అనురక్తితో వర్ణించిన ఆధునిక రచయిత మరొకరు లేరనడం అతిశయోక్తి కాదు. ఆయన ఛందోబద్ధంగా వ్రాయలేదుగాని, వచనంలోనే కవితా సౌరభాన్ని గుబాళింప జేశారు.

తొలినుంచి ఆయనలో ఒక ద్వైధీభావం వుండేది. ఒకటి హేతు వాదం, రెండవది విశ్వాస వాదం. చివరకు రెండవదే గెలిచింది. ముప్ఫైయేళ్ళనాడు ఆయన ఆంధ్రదేశాన్ని వదలి అరవ దేశానికి మహాభినిష్క్రమణం చేశారు. తిరువణ్ణామలైలో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు. జీవిత ప్రథమార్థంలో నిరీశ్వర వాదిగా, లేదా అజ్ఞేయ వాదిగా పేరు పొందిన చలంగారు మలి దశలో పూర్తిగా ఈశ్వర వాదిగా మారిపోయారు. ఇదొక విచిత్ర పరిణామం.

చలంగారిని తెలుగువారు చిరకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు కాని, హేతువాదం నుంచి భగవద్విశ్వాసానికి మారిన చలంగారిని కాదు. సంఘ దురాచారాల మీద, మూఢ విశ్వాసాల మీద, కులం మీద, మతం మీద ధ్వజమెత్తి, స్త్రీల స్వేచ్ఛ కోసం, వారికి సాంఘిక న్యాయంకోసం పరితపించిన మానవతావాదిగా చలంగారిని జ్ఞాపకం పెట్టుకుంటారు. సమకాలికుల ఆలోచనా ధోరణిని సమూలంగా మార్చి వేయడానికి కలం పట్టిన అసాధారణ రచయితగా ఆయనను కలకాలం జ్ఞాపకం పెట్టుకుంటారు.

(మే 6, 1979)

# లోక్‌నాయక్

జయప్రకాశ్ నారాయణ్ మరి లేరు. ఆయన సమ్మోహన రూపం మరి మనకు కనబడదు. ఆయన గంభీరవాణి మరి వినబడదు.

ఆయన శాశ్వతంగా.... .... శాశ్వతంగా మన లోకం నుంచి నిష్క్రమించారు. అశేష భారత ప్రజానీకాన్ని అమేయ దుఃఖపారావారంలో ముంచి వెళ్ళిపోయారు.

ఇది తీరని దుఃఖం, తీరని వెలితి, ఎన్నటికీ! ఎన్నటికీ .... ....

మూడేళ్ళుగా ఆయన మృత్యువుతో పోరాడుతున్నారు. అనుక్షణం పోరాడుతూనే వున్నారు. దీర్ఘవ్యాధితో నిత్య శయ్యాగతులైన ఆయన ప్రక్కనే అదృశ్యంగా మృత్యువు పొంచి వుండగా ఒక్కొక్కరోజు ఏ క్షణానికి ఆ క్షణమే అదే అంతిమ క్షణమా అనిపించే విధంగా, భారంగా, బాధామయంగా గడిచింది. చివరికి మృత్యువే జయించింది. జన్మించిన ప్రతి ప్రాణిని కబళించినట్టే ఆ మహాపురుషుని కూడా మృత్యువు నిర్దయగా గ్రసించింది. ఒక మహావ్యక్తి జీవితగ్రంథం పరిసమాప్తమైంది. భారతదేశ చరిత్రలో మరొక సువర్ణాధ్యాయం అంతమైంది.

మృత్యువుతో ఆయన ఓడిపోయారు. కాని, జీవితంలో జరిపిన పోరాటాలలో ఆయన ఓడిపోలేదు. సాధారణ దృష్టికి గెలుపు వేరు, ఓటమి వేరు. కాని, మహాపురుషులకు ఓటమి లేదు. జీవితంలో వారు జరిపే పోరాటాలే వారి విజయాలు. తమ విశ్వాసాల కోసం, ఆదర్శాల కోసం, లక్ష్యాల కోసం పోరాడడంలోనే వారి

జీవితాలకు సాఫల్యం. అన్యాయానికి, అధర్మానికి, అజ్ఞానానికి, అసత్యానికి వ్యతిరేకంగా విరతి లేని పోరాటం సాగించడంలోనే వారి విజయ రహస్యం గర్భితమై వుంటుంది.

జయప్రకాశ్ నారాయణ్ జీవితమే ఒక ధర్మక్షేత్రం. ఆయన బ్రతుకే ఒక కురుక్షేత్రం. ఎన్ని పోరాటాలు .... స్వాతంత్ర్య సిద్ధికి ముందు, ఆ వెనుక....

1940 ప్రాంతాలలో యువకులుగా, విద్యార్థులుగా కళ్ళు తెరచిన వారికి 1942 నాటి క్విట్ ఇండియా ఉద్యమాన్ని స్మరిస్తే స్మృతి వీథిలో మెదిలేది మొదటగా గాంధీజీ రూపమైతే, రెండవది జయప్రకాశ్ రూపమే. అనాటి ఆయన సాహస గాథలను జ్ఞప్తికి తెచ్చుకుంటే శరీరం హర్షరోమాంచిత మౌతుంది. మనస్సు ఉత్తేజిత మౌతుంది.

స్వాతంత్ర్య సిద్ధికి తర్వాత కూడా ఆయన జాతి జీవితంలో నిర్వహించిన పాత్ర సామాన్యమైంది కాదు. కొందరు ఎల్లప్పుడు ప్రతిపక్షంలోనే వుండడానికి జన్మిస్తారా అనిపిస్తుంది. వారికి పదవి విషతుల్యం, అధికారం అంధకార సమానం. భోగభాగ్యాలు తృణప్రాయాలు. వారికి ఒకటే చింత. అది దళిత ప్రజల బాధల చింత. ఒకే చింతన. అది లోకహిత చింతన.

స్వాతంత్ర్య సిద్ధి తర్వాత జయప్రకాశ్ కోరుకుంటే ఉన్నత పదవిని అలంకరించే వారే. కాని, పదవి జోలికి ఆయన పోలేదు. పదవి కంటక కిరీటమని, అధికారం బంగరు పంజరమని ఆయనకు తెలుసు. కనుకనే ఆయన పోషలిస్టు ప్రతిపక్షంలోనే వుండిపోయారు. ఆ పిదప రాజకీయాల పట్ల విరక్తితో సర్వోదయోద్యమంలో పాల్గొన్నా, నాగ ప్రాంతంలో శాంతిస్థాపన, చంబల్‌లోయ బందిపోటు దొంగలలో హృదయ పరివర్తన, ఇండో – పాక్ సామరస్యం, ఇంకా ఏమేవో ఎన్నెన్నో సమస్యలను ఆయన చేపట్టకపోలేదు. కాని సుమారుగా 1974 వరకు ఆయనది రాజకీయంగా అజ్ఞాతవాసమే. ఆ సంవత్సరంలో ఆయన దేశం సర్వవిధాల భ్రష్టమైపోతున్నదనే బాధతో తన రాజకీయ సన్యాసాన్ని విరమించి బీహార్ ఉద్యమంలోకి దూకారు. సంపూర్ణ విప్లవ సాధన తన ధ్యేయమని సింహానాదం చేశారు. ఆ తర్వాత ఆత్యయిక పరిస్థితి కాలంలో కారాగార వాసం, విడుదల, జనతా పార్టీ స్థాపనలో, దాని విజయంలో ఆయన ప్రముఖపాత్ర – ఇవన్నీ అందరికీ నిన్న మొన్నటి స్మృతులు.

# మహాకవి అస్తమయం

"ప్రాణసఖుడె నా కోసమై పంపినాడు
వల్లకీ యవ హృదయమ్ము ఝల్లుమనియె
పీడని వియోగమున వేగు ప్రోడు మేను
తలిరుతోరణమై సుమదామమాయె"

అని కృష్ణశాస్త్రిగారు ఏనాడో వ్రాశారు. ఆయన కోసం ఏ అదృశ్య ప్రాణ సఖుడో పంపిన ఆ వల్లకి ఇప్పుడు వచ్చింది. ఎనభై రెండు సంవత్సరాల నిండు

వయస్సులో ఆయన ప్రణయ పల్లకి వంటి ఆ పూలపల్లకిలో పూలమాల వలె, కొనరు నడలకు తూగాడుతూ కూర్చుని వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపోయారంటే అసంఖ్యాకులైన ఆయన కవితా ప్రియులకు అప్తులకు నమ్మశక్యం కాని దుఃఖకర దుర్వార్త. శారీరకంగానే ఆయనకు వృద్ధాప్యం. మానసికంగా నిత్య యౌవనం, నిత్యోల్లాసం. గొంతు మూగవోయినా గుండె పాడుతూనే వుండేది. "ముసలితనంలో మూగతనం భయంకరం—శిథిల మందిరంలో అంధకారం లాగున" అని ఆయనే వ్రాసుకున్నారు. కనుకనే ఎన్నడు శీతవేళను దరికి రానిచ్చేవారు కాదు! "వీధి వాకిటను జరాపద ధ్వని వినబడగానే వీట లేడని చెప్పించి" నట్టుగా వుండేవారు. ఎప్పుడూ పదిమందిలో కూర్చుని, కాగితంపై కలంతో ఆయన కురిపించే ఛలోక్తుల మరంద ధారలలో తడియని వారు వుండేవారు కారు. చివరి వరకు తన జీవితమే ఒక "ప్రియానవాన్వేషణోత్సవ యాత్ర"గా ఆయన కొనసాగించారు.

కృష్ణశాస్త్రిగారి పేరు చెప్పగానే అరవై ఏళ్ళనాటి ఆంధ్ర సాహిత్య చరిత్ర కమల ముందు ముసురుకుంది. ఆయన సాహిత్య ప్రవేశంతో ఒక చీకటింటి లోనికి ఉదయ సూర్య కిరణం తొంగిచూచినట్టు అయింది. చల్లని పిల్ల తెమ్మెర వీచినట్టు అయింది. ఒక విరహ వీణ తరళ తరళ తంత్రీగతులతో మ్రోగినట్టు అయింది.

అది రాయప్రోలు, విశ్వనాథ, అబ్బూరి, నాయని, దువ్వూరి, తల్లావఝుల, నండూరి, వేదుల మొదలైన కవుల స్వర్ణయుగం. ఆనాడు వారి సహచరుడుగా, వారి కవిత్వ ప్రచారకుడుగా కృష్ణశాస్త్రిగారు తెలుగు నేల నాలుగు చెరగుల పర్యటిస్తూ, అవర్గళ వాగ్ధాటితో ప్రసంగిస్తూ నవ్య కవిత్వానికి ఎనలేని ప్రచారం కల్పించారు.

ఆయన పేరు భావ కవిత్వానికి పర్యాయ పదమైంది. గిరజాల జుట్టు, మెరుగు కళ్ళజోడు, తెల్లని లాల్చీ, పంచె, ఉల్లిపాటుతో ఆయన భావ కవికి మారు పేరైనారు. సుకుమారమయిన భావనతో, ఒక జయదేవుడికో, ఒక రవీంద్రుడికో మాత్రమే సాధ్యమనిపించే "లలిత కోమల కాంత పదావళి"తో ఆయన విరచించిన కృష్ణపక్షం, ఊర్వశి, ప్రవాసం, మహతి వంటి ఖండకావ్యాలు ఆనాటి యువతరాన్ని ఉర్రూత లూగించాయి. పెళ్లి ప్రభావంలో జీవన విషాదంలోని మాధుర్యాన్ని, స్వేచ్ఛా తత్వాన్ని గానం చేశారు. రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శుశ్రూషలో బ్రాహ్మ సమాజ ప్రార్థన గీతాలుగా—

"అంతరాంతరము నీ యమృత వీణేమైన
మాట కీర్తనమౌను, మునికి నర్తనమౌను!
ఈ యనంతపథాన ఏచోటి కాచోటు
నీ యాలయమ్మౌను, నీ యోలగమ్మౌను"....

వంటి భక్తి మధుర గేయాలెన్నో లిఖించారు. టాగోర్ విరచిత జాతీయగీతంతో పోల్చదగిన "జయ జయ జయ ప్రియ భారత జనయిత్రీ దివ్య ధాత్రి!" వంటి దేశ భక్తి గీతాలెన్నో వ్రాశారు. అసదృశ భావనా ప్రౌఢిమతో ఎన్నో రేడియో రూపకాలు పద్య శైలికి తీసిపోని గద్య శైలిలో ఎన్నో ప్రసంగ వ్యాసాలు వ్రాశారు.

ఇక చలన చిత్ర కవిగా ఆయన రచించిన పాటలు వాటికవే సాటి. మూడు దశాబ్దాల నాటి "మల్లీశ్వరి"కి ఆయన కూర్చిన గీతాల మాధుర్యం నేటికి కూడా తెలుగు వారిని అలరిస్తూనే వున్నది. తుది వరకు ఆయన చలన చిత్రాలకు మధుర గీతాలను అందిస్తూనే వున్నారు. ఏ మాత్రం సాహిత్యాభిరుచి గల నిర్మాత అయినా, కృష్ణశాస్త్రి గారి తీయని పాట ఒకటైనా లేనిదే తన చిత్రం పూర్తి అయినట్టు భావించే వాడు కాదంటే అతిశయోక్తి కాదు. ఆయన లేని వెలితి అటు సాహిత్య రంగానికి, ఇటు చలన చిత్ర సీమకు ఎన్నడూ తీరనిది.

కృష్ణశాస్త్రిగారిలో ఎన్నదగిన మరొక విశేషం—తన తరం కవులలో చెక్కు మందివలె ఆయన 1920ల లోనో, 1930ల లోనో ఆగిపోలేదు. కాలం నిత్య పరిణామం ప్రగతి శీలమయిందని ఆయనకు తెలుసు. కనుకనే, ఆయన కాలంతో పాటు ముందుకు నడచారు. కొత్త వెలుగులను, కొత్త గాలులను ఆయన నిండు గుండెతో ఆహ్వా నించారు. అభ్యుదయ వాదాలకు ఆయన ఎప్పటి కప్పుడు స్వాగతం చెప్పారు. కనుకనే ఆయన రచనా వ్యాసంగం పోను పోను నవనవోన్మేషంగా, బహు ముఖంగా వికసించింది. యువకులలో యువకుడుగా వారితో ఆయన చేతులు కలిపి ముందుకు సాగిపోయారు. వివిధ సాహిత్య వేదికలపై నుంచి కడచిన మూడు, నాలుగు దశాబ్దాలుగా ఆయన చేసిన ప్రసంగాలు, వాటిలో వ్యక్తమయిన కవిత్వతత్వ వివేచన, హేతువాద పటిమ, అభ్యుదయ భావస్ఫూర్తి నేటి యువతరం ఆకళింపుచేసుకోదగినవి.

వ్యక్తిగా కృష్ణశాస్త్రి మరి లేరు. కాని, కవిగా ఆయనకు మృత్యువు లేదు. ఆయన కవిత తెలుగు భాష వున్నంతకాలం వెలుగొందుతూనే వుంటుంది.

(ఫిబ్రవరి 25, 1980)

# మానవతావాది సార్త్రి

ఇతరులకు తత్వబోధ చేసేవారు ఎందరైనా వున్నారు. కాని, తమ తాత్విక విశ్వాసాలకు అనుగుణంగా జీవించే వారు అరుదు. ఆ విధంగా తన తాత్విక సిద్ధాంతాలను తన జీవితంలోనే ఆచరించి చూపిన మహా వ్యక్తిగా మొన్న తన 75వ ఏట శాశ్వతంగా కన్ను మూసిన ఫ్రెంచి మేధావి, రచయిత జాఁ పోల్ సార్త్రిను ప్రపంచం కలకాలం జ్ఞాపకం పెట్టుకుంటుంది.

“దేవుడు లేడు. ఒకవేళ దేవుడు వున్నా, అతడి ఉనికివల్ల మానవుడికి ఒరిగేదేమీలేదు. మనిషి సర్వ స్వతంత్రుడు. అతడి చర్యలకు అతడే బాధ్యుడు. వాటి ఫలితాలకు కూడా అతడే బాధ్యుడు. మంచి పని చేయాలో, చెడు పని చేయాలో నిర్ణయించుకోవలసిన బాధ్యత అతనిదే. ఈ స్వయం నిర్ణయ స్వేచ్ఛవల్ల మానవుడు అంతులేని ఆవేదన (యాంగ్విష్)కు లోనవుతాడు. ప్రపంచానికి అర్థం లేదు. దానికొక

అర్థాన్ని కల్పించవలసిన బాధ్యత మనిషిదే. అతనికి మార్గదర్శకు లంటూ ఎవరూ లేరు. తనకు తానే మార్గ దర్శకుడు. మనిషికి మార్గదర్శక సూత్రాలంటూ ఏవీ లేవు. తన మార్గదర్శక సూత్రాలను తానే రూపొందించుకోవాలి. ఒక విధంగా మనిషి స్వేచ్ఛా శాపగ్రస్తుడు........"

ఇటువంటి విచిత్ర భావాలతో 1940 ప్రాంతాలలో ఒక వినూతన తాత్విక సిద్ధాంత మహాసౌధాన్ని నిర్మించిన మేధావి సార్త్రె. అతని తాత్విక చింతన అస్తిత్వ వాదం (ఎగ్జిస్టెన్షలిజం) పేరుతో జగత్ప్రసిద్ధమైంది. ఈ శతాబ్దంలో సమకాలికులపై, ముఖ్యంగా సమకాలిక సాహిత్యంపై అంతగా ప్రభావాన్ని ప్రసరించిన తత్వవేత్తలు అరుదు.

సార్త్రె 1964లో నోబెల్ సాహిత్య బహుమతిని తిరస్కరించిన సంఘటన అందరికీ విదితమే. బహుమతులు, సన్మానాలు, సనదులు వ్యక్తి స్వేచ్ఛను పరిమితం చేస్తాయని, ఒక వ్యక్తి చేసిన పనులను గౌరవించాలి గాని వ్యక్తిని కాదని సార్త్రె విశ్వాసం. ఈ సందర్భంలోనే ఆయన "జాఁ పోల్ సార్త్రె అని సంతకం పెట్టడానికి, జాఁ పోల్ సార్త్రె—నోబెల్ బహుమతి గ్రహీత అని సంతకం పెట్టడానికి ఎంతో తేడా వుంది" అని పేర్కొన్నాడు.

సార్త్రె వట్టి తాత్వికుడు మాత్రమే కాదు, క్రియా వీరుడు కూడా. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో ఫ్రెంచి సేనలో చేరి నాజీలతో పోరాడాడు. ఖయిదీగా జర్మనీలో కొన్నాళ్ళున్నాడు. ఆ తర్వాత పారిస్ ప్రతిఘటనోద్యమంలో పాల్గొన్నాడు. ఫ్రెంచి వాడై వుండి కూడా ఫ్రెంచి వలసవాదాన్ని తీవ్రంగా నిరసించాడు. అల్జీరియా స్వాతంత్ర్యోద్యమాన్ని బలపరిచాడు. ఇందుకై ఆతడిని జైలులో పెట్టాలని కొందరు ఒత్తిడి తేగా ప్రెసిడెంట్ డిగోల్ "సార్త్రె కూడా ఫ్రాన్సు దేశమే" (సార్త్రె ఈజ్ అల్సో ఫ్రాన్స్) అంటూ నిరాకరించాడు.

తాను వ్రాసిన అనేక నాటకాలలో, నవలలలో, కథానికలలో, ముఖ్యంగా తన "అస్తిత్వ వాద" తాత్విక గ్రంథాలలో వ్యక్తిస్వేచ్ఛకు అన్నిటికంటె అగ్రస్థాన మిచ్చిన సార్త్రె చివరి వరకు మార్క్సిస్టుగా, రాజకీయాలలో తీవ్ర సామ్యవాదిగా వుండడం ఒక విశేషం. మార్క్సిజం నిజమైన మానవతావాదానికి దారితీయగలదని ఆయన విశ్వాసం. ఈ కారణంగా ఆయన ఎన్నో వివాదాలలో చిక్కుకున్నాడు. ఒక తత్వవేత్తగా, మహా రచయితగా చరిత్రలో ఆయన పేరు చిరస్థాయిగా నిలిచి పోతుంది.

(ఏప్రిల్ 17, 1980)

# వి. వి. గిరి

నేడు మరొక విషాద వార్త: మాజీ రాష్ట్రపతి వరాహగిరి వెంకటగిరి అస్తమయం.

ఆయన మృతితో ఒక గొప్ప దేశభక్తుడు, స్వాతంత్ర్యయోద్ధ, రాజనీతి విశారదుడు, కార్మికోద్యమ పితామహుడు మన మధ్య నుంచి విశ్రాంతి గ్రహించారు.

తొలుత గోఖలే మితవాదం, తర్వాత తిలక్ తీవ్రవాదం, పిదప గాంధీజీ అహింసావాదం, దానికి కొంతముందుగా కొద్దికాలంపాటు ఐరిష్ స్వాతంత్ర్య వీరుల హింసాత్మక విప్లవవాదం—ఇన్ని ప్రభావాలు గిరి విశిష్ట వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దాయి. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుతో కలిసి స్వాతంత్ర్యోద్యమంలో పని చేస్తున్న రోజులలో ఆయన ప్రభావం కూడా గిరి గారిపై పడింది. తాను ప్రకాశం అనుచరుడనని గిరి చెప్పుకునే వారు. ఇన్ని ప్రభావాలను కలిపి బంధించిన ఏకసూత్రం అచంచల దేశభక్తి, స్వాతంత్ర్య రక్తి.

గిరి జీవితంలో తొలి దశ చాలా ఉత్తేజకరమైనది. బారిస్టరు చదువు కోసం ఇంగ్లెండ్ వెళ్ళారు. అవి ఐరిష్ ప్రజలు బ్రిటిష్ వలస పాలన నుంచి విముక్తి కోసం స్వాతంత్ర్య విప్లవం సాగిస్తున్న రోజులు. ప్రపంచ ప్రసిద్ధమైన "ఈస్టర్ ఆవ్

రైజింగ్" ఆనాటిదే. అప్పటిలో అక్కడే వున్న గిరికి నాటి ఐరిష్ నాయకుడు డి వెలేరాతో పరిచయం కలిగింది. ఐరిష్ ప్రజల పద్ధతిలోనే ఇండియాలో కూడా స్వాతంత్ర్య సమరం జరగాలని ఆయన కలలు కనేవారు కూడా.

ఇండియా తిరిగి వచ్చిన తర్వాత ఆయన గాంధీజీ ప్రభావానికి లోనై సత్యాగ్రహోద్యమాలలో పాల్గొనడం జరిగింది. ఆ రోజులలోనే ఆయన దృష్టి కార్మిక సమస్యలపై, కార్మికోద్యమం ఆవశ్యకతపై పడింది. రైల్వే కార్మికుల ఫెడరేషన్, అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ల అధ్యక్షుడుగా మన కార్మికోద్యమ సారథులలో గిరి ఒకరయ్యారు. కార్మిక రంగంలో అనుభవమే ఆయనను మద్రాసులో రాజాజీ తొలి మంత్రివర్గంలోను, తర్వాత ప్రకాశం మంత్రివర్గంలో, ఆ పిదప నెహ్రూ క్యాబినెట్‌లో కార్మిక మంత్రిత్వ శాఖను చేపట్టేటట్టు చేసింది.

గిరి తన జీవిత కాలంలో ఎన్నెన్నో ఉన్నత పదవులందుకున్నారు. సింహళంలో హైకమిషనర్‌గా, యు. పి, కేరళ, మైసూరు రాష్ట్రాల గవర్నరుగా, ఉపరాష్ట్రపతిగా పనిచేసి చివరకు అత్యంతాసక్తికరంగా జరిగిన రాష్ట్రపతి పదవికి ఎన్నికలలో అఖండ విజయం సాధించారు.

ఎన్ని ఉన్నత పదవులను అధిష్ఠించినా గిరి తన స్వతంత్ర వ్యక్తిత్వాన్ని, సాహస ప్రవృత్తిని మాత్రం విడనాడలేదు. ఒక ఘట్టంలో గాంధీజీతో ఆయన విభేదించారు. మరొకసారి నెహ్రూతో వివాదపడి మంత్రి పదవిని తృణప్రాయంగా త్యజించారు కూడా. ఒకసారి తనకు ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి లభించే అవకాశం వచ్చినప్పటికి, తన రాజకీయ గురువైన ప్రకాశం గారుండగా తాను ఆ పదవిని ఆశించడం అనుచితమని తిరస్కరించారు.

గిరి 85 ఏళ్ళ వృద్ధాప్యంలో కూడా దేశ వ్యవహారాలలో ఆసక్తిని చూపుతూనే వున్నారు. ఎప్పుడూ ఏవో వివాదాస్పదమైన అభిప్రాయాలను ప్రకటిస్తూనే వుండేవారు. వీటిలో ఒకటి దేశానికి అధ్యక్ష పద్ధతి పరిపాలనా వ్యవస్థ సముచితమైనదన్నది. మరొకటి దేశానికి భాషా ప్రయుక్త రాష్ట్రాలు తగవని, కొన్ని మండలాలుగా పునర్వ్యవస్థీకరించడం మంచిదన్నది. ఆయన అభిప్రాయాలతో ఏకీభవించలేనివారు కూడా ఆయన చిత్తశుద్ధిని, మేధాశక్తిని కాదనలేరు. ఆయన అస్తమయంతో నెహ్రూ తరానికి చెందిన మరొక మనీషిని దేశం కోల్పోయింది.

(జూన్ 25, 1980)

# మధుర గాయకుడు రఫీ

ఒక మహాకవి మరణిస్తే, ఒక మధుర గాయకుడు కన్నుమూస్తే, లేదా మరే కళారంగంలో నైనా అద్భుత కౌశలం ప్రదర్శించి, మానవ శిఖరాలను అధిరోహించి, ప్రజా హృదయ సామ్రాజ్యాన్ని పరిపాలించిన మహనీయుడెవరైనా కను

మరుగైతే అభిమానులకు చెప్పలేని విచారం కలుగుతుంది. ఎంతటి రసస్రష్టలైనా, ఎంతటి సౌందర్య స్రష్టలైనా చివరికి మృత్యు గహ్వరంలో మటుమాయం కావలసిందే కదా అన్న వేదాంత ధోరణి కాసేపు ఆవహిస్తుంది.

అలనాడు ఒక సైగల్ మరణించినప్పుడు, ఆ మధ్య ఒక బడే గులాం అలీ ఖాన్ అస్తమించినప్పుడు, ఇటీవల ఒక ఘంటసాల, ఒక ముఖేష్ మన మధ్య నుంచి నిష్క్రమించినప్పుడు వారి అభిమానులను ఎంత విచారం పెనవేసుకున్నదో, మొన్న మధుర గాయకుడు మహమ్మద్ రఫీ మరణవార్త ఆయన అభిమానులను అంతే గాఢ విచారంలో ముంచెత్తుతుంది.

ఏనాటివాడు రఫీ? రెండు తరాలుగా భాషా భేదం లేకుండా లక్షలాది భారతీయులకు ఆయన ప్రియతమ గాయకుడు. ముప్పదెనిమిది ఏళ్ళనాడు - అప్పటికింకా సైగల్ ఉజ్జ్వల తారగా ప్రకాశిస్తుండగానే — రఫీ సినీ రంగంలో నేపథ్య గాయకుడుగా అడుగుపెట్టాడు. నాటి నుంచి నేటి వరకు - మధ్యలో 1972 ప్రాంతాలలో కొంత వెనుకబడినా - అవిచ్ఛిన్నంగా, సినీ సంగీత ప్రపంచంలో సాటిలేని గాయకుడుగా వెలుగొందాడు. స్వదేశంలో, విదేశాలలో అసంఖ్యాక సంగీత ప్రియులను తన మధురగానంతో ఉర్రూతలూగించాడు.

ఎన్ని పాటలు! ఎంత గొప్ప పాటలు! గుండెను చీల్చుకుని వచ్చే ఉద్వేగంతో, ఎంత వైవిధ్యం, 'వర్సటిలిటీ', 'రేంజ్', మాధుర్యం, శ్రావ్యత గల పాటలు! సుమారు ౩౫ సంవత్సరాల నాడు నూర్జహాన్‌తో పోటా పోటీగా పాడిన యుగళ గీతం 'యహా బద్‌లా వఫా కా' లో ఆయన కంఠ మార్దవం ఇప్పటికీ శ్రోతృ హృదయాలను రసార్ద్రం చేస్తున్నది. 'బైజూ బావ్రా'లో "హరి ఓం", 'దునియా కే రఖ్ వాలే', ఇంకా 'తేరీ ప్యారీ ప్యారీ సూరత్ కో', 'సుహానీ రాత్ ఢల్ చుకీ', 'చౌద్వీకా చాంద్ హో' వంటి వందలాది పాటలు ఎన్నేళ్ళు గడిచినా, ప్రజల అభిరుచులు ఎంతగా మారిపోయినా, శ్రోతలను అలరిస్తూనే వుంటాయి.

మరొక మధుర గాయకుని కోల్పోవడంతో హిందీ చిత్రరంగం నేడు మరింతగా పేదవడింది.

(ఆగస్టు 2, 1980)

# రాఘవ శతజయంతి

తెలుగు నాటక రంగం పేరు చెప్పగానే ఆంధ్రేలకు, ఆంధ్రేతరులకు ప్రముఖంగా జ్ఞాపకం వచ్చే పేర్లలో ఒకటి బళ్ళారి రాఘవాచార్యులది. తెలుగు నాటకరంగం అభివృద్ధికి, దాన్ని ఆధునికం చేయడానికి ఆయన సాగించిన కృషి చిరస్మరణీయమైంది.

నేడు ఆయన శత జయంతి. బళ్లారిలో పెద్ద ఎత్తున ఉత్సవాలు జరుపుతున్నారు. ఆయన కార్యస్థానం బళ్లారి కనుక అక్కడ రాఘవ శత జయంతిని ఘనంగా జరపడం సముచితమే. పైగా, ఆయన కన్నడిగులకు కూడా కావలసిన వాడే. కాని, ఆంధ్రప్రదేశ్‌లో ఏవో కొద్దిచోట్ల తప్ప, జరగవలసినంత ఉత్సాహంగా రాఘవ శత జయంత్యుత్సవాలు జరుగుతున్నట్టు లేదు. తెలుగు నాటకరంగానికి ఆయన చేసిన నిరుపమాన సేవ దృష్ట్యా ఇది విచారకరం.

రాఘవ సమకాలికులలో మన నాటకరంగంలో ప్రసిద్ధులైనవారు, బహుశా ఆయన కంటె అధిక ప్రజాదరం పొందిన వారు పలువురు లేకపోలేదు. కాని, ఆయనకు, వారికి ఒక ముఖ్య భేదం వున్నది. ఆయన మహానటుడే. కాని, వట్టి నటుడు మాత్రమే కాదు. మేధావి, తత్వజిజ్ఞాసువు కూడా. నాటకం, రంగస్థలం, నాటక కళ, నటన—వీటి తత్వాన్ని గురించి లోతుగా ఆలోచించినవాడు. వాటి అభివృద్ధి గురించి మథనపడిన వాడు. దేశంలో ఇతర ప్రాంతాల రంగస్థలాన్ని, పాశ్చాత్య దేశాల రంగస్థలాన్ని అధ్యయనం చేసి తెలుగు నాటకరంగంలో నూత్న ధోరణులను ప్రవేశపెట్టడానికి ప్రయత్నించినవాడు. ఆయన ప్రభావం ఆయన తర్వాత తెలుగు నాటకరంగంపై ఎంతైనా వున్నది.

ఉదాహరణకు, నాటకాలలో సంగీతానికి, ముఖ్యంగా పద్యాలకు, పాటలకు తావు లేదని ఆయన విశ్వాసం. అవి పౌరాణిక నాటకాల రోజులు. డజన్ల కొలది పద్యాలుంటేనే నాటకమని, ప్రతి పద్యాన్ని పావుగంటకు తక్కువ కాకుండా ఆలాపన చేయగలిగినవాడే నటుడని ఒక భ్రమ బలంగా వున్న కాలం. ఈ భ్రమను ఆయన స్వీయోదాహరణతో విజయవంతంగా ఛేదించాడు. అలాగే నటన సహజత్వానికి దగ్గరగా వుండాలని ఆయన విశ్వసించి, తిరిగి స్వీయోదాహరణ ద్వారా దాన్ని ప్రదర్శించాడు. ఈ రోజులలో కనీసం సాంఘిక నాటకాలలో పాటలను, పద్యాలను, నటనలో కృత్రిమత్వాన్ని పరిహరించడం ఆయన ప్రభావ ఫలితమేనని చెప్పవచ్చు.

కాని, అనేక ఇతర విషయాలలో మన నాటకరంగం ఇంకా వెనుకబడే వున్నదనడంలో సందేహం లేదు. ఊరూరా నాటక సమాజాలు వెలుస్తున్న మాట నిజమే. నాటకాలపట్ల పూర్వం కంటె ఆసక్తి పెరిగినదనడానికి ఇది సూచన. ఎన్నో సంస్థలు, పరిషత్తులు బయలుదేరి పోటీలు పెట్టి, బహుమతులిచ్చి నాటక కళను ప్రోత్సహిస్తున్నాయి. ప్రభుత్వ సహాయంతో సంగీత నాటక అకాడెమీ నెలకొని యథాశక్తిగా

ప్రోత్సాహాన్ని అందజేస్తున్నది. నాటకాలు, నాటికలు కుప్పతెప్పలుగా వెలువడు తున్నాయి. ఇవన్నీ నిజమే.

అయినా, మనకు చెప్పుకోదగిన ఉత్తమ నాటకాలు ఎందువల్ల రాలేదో తెలియదు. డెబ్భై ఏళ్ళనాడు మన నాటక కళ ఇంకా ప్రాథమిక దశలో వున్న రోజులలో వ్రాసిన "కన్యాశుల్కం" తర్వాత గొప్ప నాటకమేదీ తెలుగులో రాలేదనేవారు కూడా వున్నారు. పాత్ర చిత్రణలో, సంభాషణలలో, సన్నివేశాలలో, సాంఘిక ప్రయోజనంలో, వాస్తవికతలో, ఇతివృత్త కల్పనలో దానికి సాటిరాగల నాటకం లేదనడంలో సందేహం లేదు కాని, అది సాహిత్యాన్ని తప్ప ప్రదర్శనానుకూల్యాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాసింది కాకపోవడం ఒక దురదృష్టం. ఉత్తమ నాటకం అటు సాహిత్యపు విలువలను, ఇటు రంగస్థల శిల్పాన్ని సమానంగా దృష్టిలో పెట్టుకున్నప్పుడే వెలువడుతుంది. తెలుగులో వెలువడిన వందలాది పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలలో రంగస్థల శిల్పదృష్టి నుంచి పరిగణించ దగినవి వున్నవేమో తప్ప సాహిత్యపు విలువలు గలిగినవి చాలా అరుదు. ఇబ్సెన్, చెకోవ్, షా, పిరాండెల్లో, బ్రెక్ట్, ఓ నీల్ మొదలైన వారి నుంచి ఇటీవలి బెకెట్, ఆర్థర్ మిల్లర్, ఎడ్వర్డ్ ఆల్బీల వరకు ఎందరో మహామహుల నాటక రచనలకు గల ప్రదర్శనానుకూలత అటుంచి వాటి శాశ్వత సాహిత్య గౌరవాన్ని ఈ సందర్భంలో గుర్తు చేసుకోవడం ఎంతైనా అవసరం.

పోతే, రంగస్థలానికి సంబంధించిన అభివృద్ధి తెలుగునాట దాదాపుగా జరగ లేదనే చెప్పాలి. ఈ విషయంలో తక్కిన భారతీయ భాషా ప్రాంతాలతో కూడా మనకసలు పోల్చుకొనడానికి లేదు. రాష్ట్రంలోని పెద్ద పట్టణాలలోనైనా నాటక ప్రదర్శనలకు అనువైన థియేటర్లు లేవు, హంగులు లేవు. నాటక కళాభివృద్ధికి ముఖ్యమైన ఈ అంశాన్ని గురించి పట్టించుకొంటున్నవారే లేరు.

బళ్ళారి రాఘవ తెలుగులో ఉత్తమ నాటకాలు, ఆధునిక నాటక మందిరాలు లేని లోటును గురించి ఎంతో మథనపడుతూ వుండేవారని చెబుతారు. ఆయన తెలుగు నాటక కళ అభివృద్ధి కృషికి తన జీవితాన్ని అంకితం చేసిన మహామనీషి. ఆయన శతజయంతి ఒక ప్రేరణగా, ఆయన ఆశయాలను, కళా సిద్ధాంతాలను అధ్యయనం చేయడం, వాటి సాఫల్యానికి కృషిచేయడం మన నాటక కళాభిమానుల కర్తవ్యం.

(ఆగస్టు 3, 1980)

# కొడవటిగంటి

తెలుగు కథా సాహిత్యంలో కొడవటిగంటి కుటుంబరావు స్థానం అద్వితీయ మైనది. ఒక తరం రచయితలపై, ఒక తరం యువకుల ఆలోచనా ధోరణిపై ఆయన ప్రభావం అమేయమైనది. ఆయన అస్తమయం అసంఖ్యాకులైన అభిమానులకు అమిత విచారం కలిగిస్తుంది.

తెలుగులో మన కింతవరకు సర్వాంగ పరిపుష్టమైన గొప్ప నాటకం, గొప్ప నవల రాలేదేమోనన్న సంశయానికి తావు లేకపోలేదు. కాని, ఆధునిక కవితలో, ఆధునిక కథలో మాత్రం తెలుగు సాహిత్యం ఏ ఇతర భారతీయ వాఙ్మయానికీ తీసి పోదని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఇందుకు దోహదం చేసిన కథా రచయితలలో కొడవటిగంటి ఒకరు.

గురజాడ తర్వాత— చలం, చింతా దీక్షితులు, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మొక్కపాటి, మల్లాది మొదలైన వారిది ఒక తరం. ఆ తర్వాత తరానికి కుటుంబ రావుగారే నాయకుడు.

చలం తన ప్రపంచానికి కేంద్ర స్థానంలో స్త్రీని నిలబెట్టాడు. స్త్రీ స్వాతంత్ర్యం, ముఖ్యంగా సెక్స్ స్వాతంత్ర్యం దృష్టి నుంచి సకల సామాజిక సమ స్యలను పరిశీలించాడు. కథా రచనలో ఒక విధంగా ఆయన వారసుడు కొడవటిగంటి. కాని చలం ప్రారంభించిన భావ విప్లవాన్ని ఈయన విశ్వతోముఖంగా విస్తరింప జేశారు. మార్క్సిస్టు సామాజిక దృక్పథాన్ని సంపూర్ణంగా స్వీకరించారు. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణలోని సంకుచితత్వాన్ని నిరాకరించి, ఆ ప్రక్రియను మానవుడి సామా జిక వ్యక్తిత్వావగాహనకు వర్తింపజేశారు. మానవుడి ఆర్థిక, రాజకీయ, లైంగిక

కవితర సమస్యా సామస్త్యాన్ని తన సాహిత్య వస్తువుగా తీసుకుని తన హేతువాద దృక్పథంనుంచి నిశితంగా, నిర్దాక్షిణ్యంగా, విశ్లేషిస్తూ రచనలు సాగించారు.

ఆయన దృష్టి కథా శిల్పంపై కాదు, భాషా సౌందర్యంపై కాదు. ఆయనను ప్రభావితుడిని చేసిన రచయితలలో బెర్నార్డ్ షా ఒకడు. షా నాటకాలలో వలె కుటుంబరావుగారి కథలలో కూడా భావాలు ప్రధాన పాత్ర వహిస్తాయి. షా శైలీ విన్యాసంలోని వ్యంగ్య వైభవం, హాస్యం, అపహాస్యం, నైశిత్యం-ఇవన్నీ కుటుంబ రావు తెలుగు శైలిని పరిపుష్టం చేశాయి. గొప్ప తెలుగు వచనం వ్రాస్తున్నట్లు పైకి కనిపించకుండా తెలుగు వచన శైలిని తీర్చిదిద్దిన మన అగ్ర రచయితలలో కుటుంబ రావు ఒకరు.

కొడవటిగంటిలో ఒక ముఖ్య విశేషం — ఆయన వలె కరడు కట్టిన హేతు వాదులుగానో, తీవ్రవాదులుగానో జీవితాన్ని ప్రారంభించిన అనేకులు జీవిత ద్వితీ యార్థంలో ప్రవేశిస్తూనే కాలం తాకిడికి ఆధ్యాత్మిక వాదులుగా, ఛాందస మతవాదు లుగా తిరోగమించారు. కుటుంబరావుగారు మాత్రం చివరి వరకు హేతువాదిగా, వైజ్ఞానికవాదిగా, మార్క్సిస్టుగా కొనసాగారు. జీవిత చరమ దశకంలో "విప్లవ రచ యితల సంఘం"లో ప్రముఖ పాత్ర వహించడం వరకు ఆయన విశ్వాస నైశ్చల్యం కొనసాగింది. తుది దశలో ఆయన దృష్టి అతీంద్రియ ప్రపంచం వైపు మళ్ళక పోలేదు. కాని, దాన్ని సయితం కుటుంబరావుగారు ఒక హేతువాదిగా, తార్కి కుడుగా, మార్క్సిస్టుగా పరిశీలించడానికి, అతీంద్రియానుభవ జ్ఞానానికి పూర్తిగా ఆధు నిక వైజ్ఞాని కాధారాలను కనుగొనడానికి ప్రయత్నించారు.

తెలుగు పత్రికా రంగానికి ముఖ్యంగా "పీరియాడికల్ జర్నలిజానికి" కుటుంబరావుగారి సేవ సర్వదా స్మరణీయమైనది. ఏ పత్రికలో సంపాదకత్వ బాధ్యత వహించినా ఒక "మిషనరీ" ఉత్సాహంతో పని చేశారు. తుదివరకు ఆయన దైనం దిన రాజకీయ, సాంస్కృతిక, సామాజిక సమస్యలకు ప్రతిస్పందిస్తూ, పత్రికలలో శరపరంపరగా వ్రాస్తూ తన ఆలోచనలను ఇతరులతో పంచుకుంటూనే వెళ్ళిపోయారు. ఆయన మరణంతో తెలుగువాడు ఒక మేధావిని, గొప్ప రచయితను, మంచితనం మూర్తీభవించిన మనిషిని కోల్పోయింది.

(ఆగష్టు 18, 1980)

# బహుముఖ ప్రజ్ఞాశాలి

సర్ సి. ఆర్. రెడ్డిని ఎలా వర్ణించాలి? ఏమని వర్ణించాలి? కవిగా, పండితుడుగానా? మేధావిగా, విద్యావేత్తగానా? పరిపాలనాదక్షుడుగా, మహావక్తగానా?

ఈ వర్ణనలన్నీ ఆయనకు వర్తిస్తాయి. నిస్సందేహంగా ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. నేడు ఆయన శత జయంతి. ఈ మహా ప్రతిభాశాలిని నేడు తెలుగు జాతి ప్రేమ పూర్వకంగా స్మరిస్తున్నది. శ్రద్ధాంజలి ఘటిస్తున్నది. ముఖ్యంగా కోస్తా జిల్లాల లోని విద్యావంతులలో ఒక తరాన్ని ప్రభావితం చేసిన మహామనీషిగా ఆయన స్మృతిని గౌరవిస్తున్నది.

హిందీ, బెంగాలీ భాషల తర్వాత దేశంలో అధిక సంఖ్యాకులు మాట్లాడే భాష తెలుగు. అయినా, చాలాకాలం వరకు తెలుగు వారికి భాషా ప్రయుక్తరాష్ట్రం లేక పోతే మానె, ప్రత్యేక విశ్వవిద్యాలయమైనా వుండేది కాదంటే ఆశ్చర్యం కలుగు

తుంది. ఆ తర్వాత కాలంలో ప్రత్యేక రాష్ట్రం కోసం వలె, అంతకు ముందు — బ్రిటిష్ ప్రభుత్వపు కాలంలో - ప్రత్యేక విశ్వవిద్యాలయం సాధించుకోవడానికి తెలుగువారు ఎంతో శ్రమపడవలసి వచ్చింది. చివరికి 1926 లో ఆంధ్ర విశ్వ విద్యాలయం స్థాపన జరిగింది. దానికి ప్రధాన కారకులైన వారిలో అగ్రగణ్యులు కట్టమంచి రామలింగారెడ్డిగారు.

అప్పటిలో తాడు బొంగరం ఏమీ లేకుండా బెజవాడలో ఒక చిన్న సంస్థగా ప్రారంభమైన ఆంధ్ర విశ్వ విద్యాలయం ఆ తర్వాత కాలంలో వాల్తేరులో ఒక మహాసంస్థగా అభివృద్ధి చెందడానికి, దేశంలోని పురోగామి విశ్వ విద్యాలయాలలో ఒకటిగా పేరు పొందడానికి కూడా ఏకైక దోహదం రెడ్డిగారిదే. స్థాపనతో ప్రారంభించి, మధ్యలో అయిదేళ్ళు తప్ప, 1949 వరకు ఆ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా ఆయన పనిచేశారు. ఆయన పరిపాలనలో అది మూడు పువ్వులు, ఆరు కాయలుగా విలసిల్లింది. దానికొక విశిష్ట రూపాన్ని సంతరించడానికి, పురోభివృద్ధి మార్గాన్ని నిర్దేశించడానికి ఆయన ఎంతో శ్రమించారు. ఆ రోజులలో అది క్రమశిక్షణకు మారుపేరుగా వుండేది.

విద్యావేత్తగా సి. ఆర్. రెడ్డిగారి ప్రతిభా విశేషాలు ఒక ఎత్తు, పండిత కవిగా, విమర్శకుడుగా, వక్తగా ఆయన శేముషీవిభవం మరొక ఎత్తు. పందొమ్మిదవ శతాబ్దపు చివరి రోజుల నాటికే, అంటే తన పందొమ్మిదవ యేట - ఆయన ప్రబంధ రచనా మార్గాన్ని విడనాడి "ముసలమ్మ మరణం" అనే కావ్య రచన ద్వారా ఆధునికాంధ్ర కవితారీతికి మార్గదర్శకులలో ఒకరయ్యారు. సాహిత్య విమర్శలో కూడా ఆయన మార్గదర్శకులయ్యారు. తెలుగు భారతం ఆయన అభిమాన గ్రంథాలలో ఒకటి. నన్నయ, తిక్కనల కవితారీతుల ప్రత్యేకతలను, గుణ దోషాలను ఎత్తి చూపుతూ ఆయన లేఖిని నుంచి వెలువడిన విమర్శలు తెలుగులో ఒక కొత్త రకం సాహిత్య పరామర్శకు ఒరవడిదిద్దాయి. ఇక ఇంగ్లీషులో ఆయన రచనా కౌశలం, పాండిత్యం, వక్తృత్వ పాటవం ఇంగ్లీషు వారికే ఆశ్చర్యం కలిగించేవి. ఛలోక్తులతో, చతురోక్తులతో అనర్గళంగా, అద్భుత భాషా విన్యాసంతో సాగిపోయే ఆయన ఆంగ్లోపన్యాసాలు శ్రోతలను పరవశులను చేసేవి.

ఇంతటి బహుముఖ ప్రజ్ఞాశాలి రాజకీయ రంగంలో మాత్రం రాణించలేక

పోవడం విచిత్రం. కొన్నాళ్ళు జస్టిస్ పార్టీలో వున్నారు. మరికొన్నాళ్ళు కాంగ్రెస్‌లో వుండేవారు. కాని, ఏ పార్టీలోనూ ఆయన ఎక్కువకాలం వుండలేకపోయారు. ఎవరి నాయకత్వాన్ని అంగీకరించలేక పోవడమే దీనికి కారణమై వుండాలి. బ్రిటిష్ ప్రభుత్వంతోనైనా ఆయనకు సరిపడిందని చెప్పలేము. ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్ష పదవికి ఆయన 19౩0 లో రాజీనామా ఇవ్వడానికి కారణం అప్పటి సత్యాగ్రహాన్ని అణచివేయడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయోగించిన దమననీతి.

ఆ తర్వాత ద్వితీయ ప్రపంచ యుద్ధకాలంలో ఆయన బ్రిటిష్ ప్రభుత్వపు యుద్ధ కృషిని సమర్థించారనుకోండి. అయితే, ఆ యుద్ధంలో బ్రిటన్, దాని మిత్ర రాజ్యాలు విజయం పొందడం, నాజీ జర్మనీ ఓడిపోవడం అవసరమన్న దృఢ విశ్వాసంతోనే ఆ వైఖరిని ఆయన అవలంబించడం జరిగింది. మొత్తంపై రాజకీయాలలో ఆయన మితవాది. కాంగ్రెసు రాజకీయాలు, గాంధీజీ విధానాలు ఆయనకు నచ్చలేదు. గాంధీజీని, కాంగ్రెసును కాదని భారత రాజకీయాలలో పైకి రాలేకపోయిన మరి పెక్కుమంది వలె రామలింగారెడ్డిగారు కూడా రాజకీయ రంగంలో రాణించలేక పోయారు. ఆయన స్వతంత్ర వ్యక్తిత్వమే దీనికి కారణం.

మరొక విషయంలో కూడా కట్టమంచి వారి మితవాదం కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. గిడుగు వారి వ్యావహారిక భాషా వాదాన్ని ఆయన అంగీకరించలేదు. విశ్వవిద్యాలయం ఆవరణలోనికి వ్యావహారిక భాషను రానీయలేదు. ఇది తెలుగు భాష త్వరితంగా ఆధునికం కావడానికి అవరోధమైందనడంలో సందేహం లేదు. రామలింగారెడ్డిగారు ఇంగ్లండు, అమెరికాలలో విద్యాభ్యాసం చేసి వచ్చారు. ఆధునిక భావాలెన్నో అలవరచుకున్నారు. కాని, భాషా విషయంలో ఆయన మితవాదిగానే వుండి పోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది. ప్రాచీనాంధ్ర సాహిత్య సంప్రదాయాలపట్ల ఆయన చిన్ననాటి నుంచి పెంచుకున్న మక్కువ ఇందుకు కారణమై వుండాలి.

ఆయనది విలక్షణ వ్యక్తిత్వం, నిశితమైన మేధాశక్తి. ఆంధ్ర సంస్కృతిలోని ఉత్తమోత్తమ లక్షణాలన్నిటిని పుణికి పుచ్చుకున్న మహామనీషి. తన రచనల ద్వారా ఆంధ్ర సాహిత్యానికి, ఆంధ్ర విశ్వవిద్యాలయం ద్వారా ఆంధ్ర విద్యారంగానికి కట్టమంచివారు చేసిన సేవలను తెలుగువారు చిరకాలం అభిమాన పూర్వకంగా స్మరించుకుంటూనే వుంటారు.

(డిసెంబరు 10, 1980)

వెయ్యేళ్ళ ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఎందరు లేరు మహాకవులు?

అందరిలోకి తెలుగు వారికి ప్రీతిపాత్రుడైన కవి, తెలుగు గుండెకు దగ్గరగా వచ్చిన కవి పోతన.

అయిదు శతాబ్దాలు గడిచినా తెలుగు వారి అంతశ్చేతన
అనే భాండం నిండా తరతరాలకూ తరగని తన
పద్య మందార మకరంద నిత్య నూతన
మాధుర్యాన్ని నింపి పోయిన మహాకవి పోతన.

బమ్మెర పోతన గురించి ఎన్నో కథలు చిరకాలంగా తెలుగు నాట ప్రచారంలో వున్నాయి. వాటిలో ఏవి నిజమో, ఎన్ని నిజమో తెలియదు. కాని, కనీసం ఒక్క కథనైనా నిజమనే నమ్మాలని అనిపిస్తుంది.

అది ఏ మాత్రం కవిత అల్ల గలిగిన వాడైనా, ఏ రాజుకో, మంత్రికో, మరొక ధనికునికో, ఇంద్రుడవు, చంద్రుడవని కీర్తిస్తూ, తన కబ్బం అంకితమిచ్చి పబ్బం గడుపుకోవడానికి తహతహ లాడిన యుగం. మరి ఆ రోజులలోనే ప్రవాహానికి ఎదు రీదిన ఏకైక మహాకవి పోతన.

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు, వాహనంబులున్, సొమ్ములు గొన్ని పుచ్చుకొని సొక్కి" బోనని శపథం పట్టి రాజుకు కాకుండా తన ఇష్ట దైవానికే తన మహాభాగవతాన్ని అంకితమిచ్చి, నిత్య దారిద్ర్యంతో నిష్ఠుర జీవితాన్ని

గడిపి,

ఆంధ్ర సరస్వతి పురాతన నికేతన
ప్రాంగణాన తన స్వతంత్రతా కేతన
మెగర వేసిన కవిశేఖరుడు పోతన.
ఆ విధంగా ఆ కవితా హాలికుడు
తెలుగు జాతి స్మృతి సీమలలో సార్వ కాలికుడు.

పెక్కుచోట్ల పోతన రచనలో శబ్ద లోలుపత అర్థస్ఫూర్తికి అడ్డు వస్తుంది. పుంఖాను పుంఖంగా వచ్చిపడే అనుప్రాసలు, అంత్యప్రాసలు మరెన్నో శబ్దాలంకారాల పట్ల చాపల్యం మితి మీరినట్టు అనిపిస్తుంది. ఎడ నెడ ఔచిత్య భంగాలు కనుక్కొన గుచ్చుకోవచ్చు కూడా. కొండొకచో ఛందోల్లంఘనలు, భాషా దోషాలు బాధించవచ్చు కూడా.

అయినా, పోతన తెలుగువారి "ఇష్ట కవి". ఆయన పద్యాల శబ్ద గత మాధు ర్యానికి తెలుగుజాతి పరవశించింది. కల్పనా చాతుర్యానికి మురిసిపోయింది. అసాధారణ భావ చిత్రాల సౌందర్యానికి జోహార్లు పలికింది. ఆయన భక్తి పారవశ్య ప్రవాహంలో పడి తానూ కొట్టుకుపోయింది.

తెలుగు భాగవతం తిరగవేస్తే ఎన్ని మృదు మధుర పద్యాలు? అవి తెలుగు సరస్వతికి నిత్య నైవేద్యాలు. పండితులకైనా, పామరులకైనా అక్షరాస్యులైన ప్రతి తెలుగు వాడికీ ఎల్లప్పుడూ ఆస్వాద్యాలు.

"త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింప, ప్రాభాత నీరజబంధు ప్రభమైన చేలము వయిన్ రంజిల్ల...."

"తప్పించి మెగసిన కుండలంబుల కాంతి గగన భాగం బెల్ల గప్పి కొనగ...."

"అల వైకుంఠ పురంబులో, నగరిలో...."

"సిరికిన్ జెప్పడు, శంఖ చక్ర యుగమున్ జేదోయి సంధింపడు...."

"మందార మకరంద మాధుర్యమున దేలు మధుపంబు వోవునే మదన ములకు...."

"నల్లనివాడు పద్మనయనంబుల వాడు...."

ఇలా ఎన్నని స్మరించడం ఆయన పద్యాలు? అవి తెలుగు గుండెలలో తర తరాలుగా మారుమ్రోగిన వీణా, వేణు వాద్యాలు.

పోతన భాగవతం తిరగవేస్తే తెలుగు పలుకుబడిలో విడదీయరాని విధంగా కలగలిసిపోయి నానుడులుగా, జాతీయాలుగా స్థిరపడిపోయిన వెన్నో పద్యాలు కనిపిస్తాయి.

"కలయో వైష్ణవ మాయయో...."

"ఇంతింతై వటుడింతయై...."

"వారిజాక్షులందు వైవాహికము లందు...."

"లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె...."

"ఇందుగల డందు లేడని సందేహము వలదు...."

"కలడు కలం డనెడు వాడు కలడో లేడో...."

"కారే రాజులు రాజ్యముల్ గెలువరే...."

"ఊరక రారు మహాత్ములు...."

"విబుధ వరుల వలన విన్నంత కన్నంత...."

ఇంకా ఎన్నిటినని ఇలా ఉదహరించగలం? ఇంత విస్తారంగా తమ పద్యాలు, పద్య పాదాలు జన వ్యవహారంలోకి వచ్చి భాషను సుసంపన్నం చేసిన కొద్దిమంది కవులలో పోతన ఒకడు.

పోతన కమనీయ కవితా హారతి

అందుకుని పులకించింది ఆంధ్రభారతి —

ఆయనను ఈనాడు, మరీ ముఖ్యంగా, ఆప్యాయంగా స్మరించా లనడానికి మరొక ప్రబల హేతువు —

ఆయన భాగవతం ఏ ప్రాంతంలో ఎక్కడెక్కడ నివసిస్తున్న వారైనా అయిదు కోట్ల తెలుగు ప్రజల మధ్య తెంచుకోరాని అనుబంధపు పేటువు.

నేడు వరంగల్లులో జరుగుతున్నది పోతన పంచశతి జయంతి.

ఆయన కవితా ప్రతిభకు తెలుగుజాతి అర్పిస్తున్నది కృతజ్ఞతా పారిజాతాల పై జయంతి.

(మార్చి 14, 1982)

# "రమ్యాలోకి" రాయప్రోలు

"కలదయేని పునర్జన్మ కలుగు గాక
మధుర మధురంబయిన తెన్గు మాతృభాష"

అని తెలుగు భాషా మాధుర్యానికి కమ్మోర నీరాజన మిత్తిన కవి చంద్రుడు రాయప్రోలు సుబ్బారావు మొన్న 90వ ఏట అడుగు పెట్టిన సందర్భంలో ఆయనకు మా శుభాశివందనలు.

గురజాడ, రాయప్రోలు—వీరిరువురిలో తెలుగు ఆధునిక కవితకు శ్రీకారం చుట్టిన దెవరన్నది నేటికి కూడా కవి పండిత గోష్ఠులలో ఆసక్తికరమైన చర్చ నీయాంశమే. ఉభయులు అట్టి గౌరవానికి పాత్రులే ననడంకంటె ఈ వివాదానికి మరొక సమాధానం లేదు. గురజాడ 1910లో ఆధునిక కవితా సరస్వతికి "ముత్యాల సరాలు" వేయగా, ఇంచుమించు ఆ రోజులలోనే రాయప్రోలువారు "తృణ కంకణం" తొడిగారు. గురజాడది సాంఘిక దృష్టి. రాయప్రోలుది సౌందర్య దృష్టి. ఉభయులు నవ్య కవితలో చెరొక మార్గానికి అద్యులు.

దేశభక్తి, ప్రణయరక్తి, స్వభాషానురక్తి—ఇవి రాయప్రోలు వారి కవితా లక్షణాలు. ప్రకృతి నుంచి, జీవితం నుంచి రామణీయకాన్ని పంచించడానికే ఆయన కవితా వ్యవసాయం చేశారు. నేటి రాజకీయాల రొదలో రాయప్రోలు కవిత ఎన్నటికి తిరిగిరాని ఒకానొక పాత తరానికి చెందినదిగా, సమకాలిక ప్రాధాన్యం లేనిదిగా వినిపించవచ్చు. కాని, అది తెలుగు సాహిత్యాన్ని పరిపుష్టం చేసిన చరిత్రాత్మక కృషి అన్నమాట మరువరానిది.

తెలుగు కవిత నుంచి భాషా మాధుర్యం, శైలీ ప్రాగల్భ్యం క్రమంగా కను మరుగవుతున్న ఈ రోజులలో "భాషకంటె నవ్యులకు తపస్సు లేదు" అన్న రాయప్రోలు సూక్తి నేటి యువతరానికి సర్వదా శిరోధార్యం.

(మార్చి 29, 1981)

# నూరేళ్ళనాడు

వైద్యశాస్త్ర చరిత్రలో మహత్తర విజయంగా కీర్తించదగిన ఒక సంఘటన శత వార్షికోత్సవం నేడు ప్రపంచ వ్యాప్తంగా పెక్కు దేశాలలో జరుగుతున్నది. సరిగా నూరేళ్ళనాడు ఈ రోజునే (1882 మార్చి 24 వ తేదీ) రాబర్ట్ కోచ్ అనే జర్మన్ శాస్త్రవేత్త క్షయ వ్యాధికి కారణమైన సూక్ష్మజీవిని కనుగొన్నాడు.

క్షయ వ్యాధి మానవ జాతిని అనాదిగా పట్టి పీడిస్తున్న భయంకర రోగాలలో ఒకటి. వైద్యశాస్త్రజ్ఞులు అంటు వ్యాధులలో ప్రథమ స్థానాన్ని దీనికే ఇస్తారు. సాధారణ వ్యాధులలో అదొకటి అయినా, దానికి కారణాన్ని చాలాకాలంపాటు వైద్యవేత్తలు కనుగొనలేకపోయారు. వంశ పారంపర్యంగా వచ్చే వ్యాధిగానో, అపరిశుభ్ర వాతావరణంలో జీవించే వారికి తప్పనిసరిగా వచ్చే వ్యాధిగానో దాన్ని పరిగణించేవారు.

కాగా, సరిగా నూరేళ్ళనాడు రాబర్ట్ కోచ్ క్షయపీడితుల కఫాన్ని మైక్రోస్కోపులో పరిశీలిస్తుండగా, వ్యాధి కారకమైన సూక్ష్మజీవులు అసంఖ్యాకంగా కనబడ్డాయి. ఆ సంఘటనతో వైద్యశాస్త్ర చరిత్ర ఒక మలుపు తిరిగింది. అంతకు ముందు, ఆ తర్వాత రాబర్ట్ కోచ్ కలరా, ప్లేగు, మలేరియా, కంజంక్టివైటిస్ మొదలైన పెక్కు వ్యాధులపై పరిశోధనలు చేసి అమూల్య విశేషాలు కనుగొన్నారు. కాని, అన్నిటిలోకి ఆయన కనుగొన్న "బాసిలస్ ట్యుబర్క్యులోసిస్" (క్షయ కారక సూక్ష్మ జీవి) ఆయనకు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించి పెట్టింది. 1905 లో ఆయనకు నోబెల్ బహుమానం సయితం లభించింది. ఫ్రెంచి శాస్త్రవేత్త లూయీ పాశ్చర్తో పాటు రాబర్ట్ కోచ్ను కూడా బాక్టీరియాలజీ అనే వైద్యశాస్త్ర విభాగానికి పితామహుడుగా పరిగణిస్తారు.

ఆనాటినుంచి క్షయవ్యాధి నివారణకు, చికిత్సకు, వ్యాప్తి నిరోధానికి ఔషధాలను కనుగొనడానికి ముమ్మరంగా పరిశోధనలు, ప్రయోగాలు జరిగాయి. వాటి ఫలితాలలో 1921 లో కనుగొన్న బి.సి.జి. వ్యాక్సిన్ ఒకటి కాగా, 1944 లో కనుగొన్న స్ట్రెప్టోమైసిన్ మరొకటి. ఆ పిదప మరెన్నో రకాల ఔషధాలను, చికిత్సా ప్రక్రియలను కనుగొన్నారు. ఇవి క్షయవ్యాధిపై దాదాపుగా పూర్తి విజయాన్ని సాధించాయనే చెప్పవచ్చు.

వ్యాధి నివారణోపాయాన్ని, చికిత్సా పద్ధతులను కనుగొన్నంత మాత్రాన, క్షయవ్యాధి పూర్తిగా అదుపులోనికి వచ్చిందని భ్రమపడరాదు. ఈ వ్యాధి ఒకప్పటి వలె ఉధృతంగా లేకపోయినా, దానికి ఒకప్పటి వలె భయపడవలసిన అవసరం లేకపోయినా, అది నిర్మూలన కాలేదు. 1920 దశాబ్దంలో ప్రపంచంలో 15 కోట్ల మంది క్షయ వ్యాధిగ్రస్తు లుండేవారని ఒక అంచనా. (ఆ రోజులలోనే ప్రసిద్ధ జర్మన్ రచయిత, నోబెల్ బహుమతి గ్రహీత థామస్ మాన్ ఒక క్షయగ్రస్తుడిని ప్రధాన

పాత్రగా తీసుకుని "మ్యాజిక్ మౌంటెన్" అనే గొప్ప నవల వ్రాశాడు). చికిత్సా విధానాలు వృద్ధి అయిన కొద్దీ క్షయవ్యాధి ముఖ్యంగా సంపన్న దేశాలలో బాగా తగ్గిపోయింది. కాని, వెనుకబడిన దేశాలలో మాత్రం అది ఇంకా చెప్పుకోదగినంత విస్తృతంగానే వుంది. ప్రపంచంలో నేడు రెండు కోట్లమంది క్షయవ్యాధి పీడితులున్నారని అంచనా వేస్తున్నారు.

నూతన వైద్య విధానాలు వాడుకలోనికి రావడంతో, ఇండియాలో ఈ వ్యాధి పట్ల పూర్వపు భయం చాలవరకు తగ్గిపోయినప్పటికి సగటున లక్షమంది జనాభాలో 80 మంది క్షయతో మరణిస్తున్నారట. ప్రభుత్వం 1949 నుంచి బి. సి. జి. వ్యాక్సినేషన్ ద్వారా కోటానుకోట్ల ప్రజలకు వ్యాధి నిరోధక శక్తిని పెంపొందించడం జరిగింది. పూర్వం కంటె విస్తృతంగా ఔషధాలు లభ్యమవుతున్నాయి. అయినా, ఇవి ఎక్కువగా పట్టణాలకే పరిమితమై వున్నాయి. గ్రామ ప్రాంతాలకు ఎక్కువగా ప్రయోజనం కలగలేదని చెప్పాలి. క్షయగ్రస్తులలో నూటికి 80 మంది గ్రామ ప్రాంతాలలోనే వున్నారని అంచనా. ప్రజల పేదరికం, అవిద్య, అనారోగ్యకర పరిసరాలలో నివాసం, పుష్టికర ఆహార లోపం మొదలైనవి ఈ వ్యాధి నిరోధానికి అడ్డుగా నిలుస్తున్నాయి.

నూరేళ్ళనాడు రాబర్ట్ కోచ్ వైద్యశాస్త్ర రంగంలో చరిత్ర సృష్టించిన సంఘటన సంస్మరణ సందర్భంగా భారత ప్రభుత్వపు తంతి, తపాలా శాఖ నేడు స్పెషల్ స్టాంపును విడుదల చేస్తున్నది. ఈ ఏడాది పొడుగునా ఈ వ్యాధి నివారణకు, చికిత్సకు అనుసరించదగు విధానాలపై, చేయదగు నూతన పరిశోధనలపై నిపుణుల గోష్ఠులు మొదలైన కార్యక్రమాలను భారత ప్రభుత్వం నిర్వహించబోతున్నది. ఇది ముదావహమే. కాని, గోష్ఠులతో, ప్రసంగాలతోనే సంతృప్తి పడరాదు. వైద్యశాస్త్రంలో సాధించిన అభివృద్ధి ఫలితాలను దేశంలో పల్లెపల్లెకు, మొత్తం ప్రజలందరికి అందజేయడానికి బృహత్తరమైన కృషిని ప్రభుత్వం చేపట్టవలసి వున్నది. ముఖ్యంగా చికిత్సా సదుపాయాలను ప్రతి గ్రామానికి అందుబాటులో వుంచడం, వ్యాధిని గురించిన పరిజ్ఞానాన్ని, దాని నివారణకు అనుసరించదగు ఆరోగ్య పద్ధతులను విస్తృతంగా ప్రచారం చేయడం ప్రభుత్వం విధి.

(మార్చి 24, 1982)

# "పులి పంజా"

తెలుగు వచన కవితా పితామహుడు కుందుర్తి ఆకస్మిక మృతికి తెలుగు సాహితీ లోకం కుందుతున్న సమయంలో— ప్రసిద్ధ పరిశోధకుడు బిం. గో. రె. విషాదాంతపు ఛాయలు ఇంకా సమసిపోకుండానే — ప్రఖ్యాత అభ్యుదయ కవి, గ్రాంథిక భాషావాదంపై "పులి పంజా" విసిరిన పురిపండా అప్పలస్వామిగారి ఆకస్మిక మరణంతో నవంబర్ నెల తెలుగు సాహితికి దుర్దినమా? అనిపిస్తున్నది.

ఆదిలో వీరగ్రాంథిక వాదిగానే తన కవితకు శ్రీకారం చుట్టినా, ఆనాడు తెలుగు కవితా వీధులలో వీస్తున్న కొత్తగాలులను ఆకళింపు చేసుకుని, ఆహ్వానించి, వ్యావహారిక భాషావాదానికి పట్టం కట్టాలని విప్లవ శంఖం పూరించిన ప్రగతిశీలి పురిపండా.

గ్రంథ సంఖ్యలో సయితం షష్టిపూర్తి చేసుకున్న పురిపండా, గిడుగు, గురజాడల అడుగు జాడలలో వ్యావహారిక భాషావాదాన్ని మహోద్యమంగా నిర్వహించి, మొన్న మొన్నటి వరకు గ్రాంథిక భాషా మార్గంలోనే పయనిస్తున్న ఆంధ్ర విశ్వ విద్యాలయాన్ని వ్యావహారిక మార్గానికి మళ్ళించిన సాహితీవేత్త ఆయన.

తెలుగు మాత్రమే కాక, ఒరియా, బెంగాలీ, సంస్కృతం, హిందీ మొదలైన వివిధ భాషలను అధ్యయనం చేసి, ఆయా సాహిత్యాలలోని సొంపు సొగసులను మాతృకల జిగి, బిగి సడలకుండా తెలుగులోకి అందించిన అనువాదకుడు పురిపండా.

భారత, భాగవత, రామాయణాలను తేట తెనుగులో, వ్యావహారిక భాషలో రచించి, ఆ భాషావాదానికి ఆయన ఎవ్వరూ చేయని సేవ చేశారు.

ఆయన కేవలం కవి మాత్రమే కాదు. ఆనాడు వీస్తున్న స్వాతంత్ర్యోద్యమ వాయువుల ప్రభావం తనపై పడగా, ఆ ఉద్యమంలో దుమికి, ఖాదీ ప్రచారంలో అగ్రశ్రేణిలో నిలిచి, ఎన్నోసార్లు శ్రీ కృష్ణ జన్మస్థానాన్ని సందర్శించిన జాతీయ వాది.

ఆయన రచించిన "పులి పంజా" కవితా సంపుటి ఆధునిక తెలుగు సాహిత్యంలో మణిపూస. దాన్ని లండన్‌లోని విదేశాంధ్ర ప్రచురణల సంస్థ ప్రచురించడమే దాని ప్రాశస్త్యానికి నిదర్శనం.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, కవితా సమితి వంటి సాహితీ సంస్థలతో చిరకాల సంబంధాలు వున్న ఈ బహుముఖ సాహితీవేత్త లేని లోటు తీరనిది.

(నవంబర్ 20, 1982)

# నన్నయ ఉత్సవాలు

భారతం, భాగవతం తెలుగు వారి ఇష్ట కావ్యాలు. ఏవో కొన్ని భారత పద్యాలో, భాగవత పద్యాలో నోటికి రానివారు, కవిత్వం విని ఆనందించనివారు తెలుగు వారు వుండరు. అవి కవిత్రయం, పోతన తెలుగు వారికి పెట్టిన సాహిత్య భిక్ష, ఆంధ్ర సరస్వతికి అమూల్యాలంకారాలు.

గత సంవత్సరం పోతన పంచశతి ఉత్సవాలు ఆ మహాకవి సంచరించిన ప్రాంతమైన వరంగల్లులో వైభవోపేతంగా జరిగాయి. ఇప్పుడు నన్నయ సహస్రాబ్ది ఉత్సవాలు ఆయన మహాభారతాంధ్రీకరణతో పునీతమైన రాజమండ్రిలో జరుగుతున్నాయి.

అయితే, అప్పుడు పోతన ఉత్సవాలంత ఉత్సాహంగా ఇప్పుడు నన్నయ ఉత్సవాలు జరగడంలేదని, సాంస్కృతిక వ్యవహారాలశాఖ ఆధ్వర్యంలో జరుగుతున్నా, తెలుగు భాషా సంస్కృతుల అభ్యున్నతికి కంకణం కట్టుకున్న రాష్ట్ర ప్రభుత్వం ఈ ఉత్సవాలపట్ల చూపవలసినంత శ్రద్ధానక్తులు చూపడం లేదని ఒక విమర్శ కూడా వచ్చింది. ఈ ఉత్సవాలు రెండుసార్లు వాయిదాపడి, ఇప్పుడు ఏదో మొక్కుబడిగా, కన్నీటి తుడుపుగా జరుగుతున్నవని కొందరు అంటున్నారు.

"తింటే గారెలు తినాలి, వింటే భారతం వినాలి" అని లోకోక్తి. ఈ నానుడికి కారణమైన ఆంధ్ర మహాభారతంలో రెండున్నర పర్వాలను శ్రవణ పర్వాలుగా రచించి అజరామరుడైన మహాకవి నన్నయ.

తెలుగువారు తమ ఆది కవిగా, తమ వాగనుశాసనుడుగా నన్నయను పేర్కొనడం అనూచానంగా పరిపాటి.

నన్నయ ఆదికవి అవునా, కాదా ? ఆయనకు ముందు తెలుగులో కవిత్వం లేదా? ఆయన ఎక్కడివాడు? తెలుగువాడా, తమిళుడా, కన్నడిగుడా? ఆయన కంటె తిక్కన గొప్పవాడు కాదా? ఆయన భారతాంధ్రీకరణంలో గొప్ప ఏముంది ? సంస్కృతంలో వున్న దాన్ని తెలుగులో పెట్టడమే కదా? ఆయన రచనలో వ్యాకరణ దోషాలు, ఛందో భంగాలు లేవా? సంస్కృతం ఎక్కువ ఉపయోగించి తెలుగుకు అపకారం చేయలేదా? వర్ణాశ్రమ ధర్మాలను సమర్థించలేదా?

ఇవీ, ఇంకా ఇటువంటివి చాలాకాలంగా వింటున్న ప్రశ్నలే, విమర్శలే. ఏ కవీ ప్రశ్నలకు, విమర్శలకు అతీతుడు కాడు. ఏ ప్రాచీన కవినైనా ఏ అనంతర తరంవారైనా తమ సమకాలపు విలువల దృక్పథం నుంచి పునస్సమీక్ష చేయడంలో, చేయగోరడంలో తప్పులేదు. అది అవసరం కూడాను. ఒక కవిని గురించి కొన్ని శతా

బ్దాల తర్వాత కొత్తగా సమీక్షించడం జరుగుతున్నదంటేనే ఆ కవి ప్రాధాన్యాన్ని గుర్తిస్తున్నామని అర్థం.

అయినా, నన్నయ ప్రతిభా నిరూపణలో ఇటువంటి ప్రశ్నలు, విమర్శలు అప్రధానమైనవి. కవిత్వ మహత్వం వీటికి అతీతమైనది. కావ్యరసాస్వాదనకు అవి అడ్డురావు. అదే నిజం కాకపోతే వాల్మీకి రామాయణం, వ్యాసభారతం, హోమర్ కావ్యాలు, షేక్స్పియర్ నాటకాలు ఇన్ని శతాబ్దాల తర్వాత నేటికీ సజీవంగా నిలిచి వుండడం జరగనేరదు. గుణదోష విమర్శనం వేరు. కావ్యంలోని కవితాగుణం వేరు. అందుకే ఆంగ్ల కవి, విమర్శకుడు మాథ్యూ ఆర్నాల్డ్ షేక్స్పియర్‌ను ఉద్దేశించి "ఇతరులు మా ప్రశ్నకు కట్టుపడతారు. నీవు కొరకవు మేము నిన్ను ప్రశ్నిస్తాము. కాని, నీవు చిరునవ్వు నవ్వుతూ మా విజ్ఞానానికి అతీతంగా, విశ్వంలో నిలబడతావు" అని కీర్తించాడు.

నన్నయకు ముందు తెలుగులో కవిత్వం లేదని, ఛందస్సు లేదని ఎవరూ అనలేరు. నన్నయ ముందుకాలపు శాసనాలలో తరువోజ, మధ్యాక్కర, సీసం, ఉత్పల, చంపక మాలాదులలో పద్యాలు లభించాయి. విస్తారమైన జానపద వాఙ్మయం కూడా వుండే వుండాలి. బహుశా ఏవైనా కావ్యాలు కూడా వుండి వుండవచ్చు. ఏ భాషలోను కవిత్వం ఆకాశం నుంచి వూడిపడినట్టు హఠాత్తుగా ఒక వ్యక్తితో ప్రారంభం కాదు. అది పరిణామ సిద్ధాంతానికి విరుద్ధం. ఒకానొకడు ఒకానొక రోజున తెలుగు భాషను సృష్టించాడనడం ఎంత అవివేకమో, ఏ పూర్వరంగం లేకుండా నన్నయ వున్నట్టుండి తెలుగులో కావ్యసృష్టి చేశాడనడం అంత అసంబద్ధం.

నిజమే. కాని, నన్నయ పూర్వరంగంలో అసలు కావ్యాలున్నాయో లేదో, వుంటే వాటిలో తెలుగు ఏ విధంగా వుండేదో మనకు తెలియదు. లభ్యమైనంతవరకు సర్వలక్షణ లక్షితమైన మొదటి మహాకావ్యం నన్నయ భారతం కనుకనే, ఆయనను ఆది కవిగా, ఆయన భారతాన్ని ఆదికావ్యంగా పేర్కొనడం తెలుగునాట వాడుక అయింది.

లభ్యమైన శాసనాలనుబట్టి అంతకుముందు కొనటపీనటగా వున్న తెలుగు భాష నన్నయలో సుసంస్కృతమై, అక్షరరమ్యమై, అద్భుత సౌందర్య సమన్వితమై

దర్శనమిస్తుంది. అదివరకు కనబడినవి కాక, మరెన్నో దేశీచ్ఛందస్సులు, సంస్కృత చ్ఛందస్సులు ఆయన భారతంలో ప్రత్యక్షమవుతాయి. ఒకవైపు తెలుగు భాషను సంస్కరించుకుని, మరొకవైపు అనేక నూతన చ్ఛందస్సులను సమకూర్చుకుని మహా భారత సంహితా రచనకు ఆయన ఉపక్రమించాడు.

బహుశా ఏ ఇతర భారతీయ భాషలోను లేనంత అందమైన పద్య నిర్మాణ శిల్పం తెలుగు భాషలోని ఒక ప్రత్యేకత. దానికి మార్గం చూపినవాడు నన్నయ. సంస్కృత పదాన్ని ఇలా తత్సమం చేయాలి, తెలుగు పద్యాన్ని ఇలా నిర్మించాలి, మహాకావ్యం ఇలా వ్రాయాలి అని సుమారు వెయ్యేళ్ళనాడు నన్నయ అనుశాసించి నట్టుగా ఆయన భారతం కనిపిస్తుంది. ఇన్ని వందల సంవత్సరాలలోను తెలుగు కవులు ఆయన గీచిన గీటు దాటలేదు. ఇప్పటికీ తెలుగు పద్యం ఆయన ఒరవడిలో వ్రాయవలసిందే. కనుకనే, ఆయన తెలుగు వారికి ఆదికవి.

కాలం మారింది. సాంఘిక, రాజకీయ పరిస్థితులు, దృక్పథాలు మారాయి. భాషలో సయితం ఎన్నో మార్పులు వచ్చాయి. దీనితో కవితాభిరుచులు, కవితా స్వరూపం మారిపోయాయి. ఇది సహజం, అనివార్యం, అభిలషణీయం కూడా. కాలం ఏ ఒక్కరి వద్దనో ఆగిపోదు. ఇప్పటికీ నన్నయ కవితా పద్ధతి, కావ్య లక్ష్యం, భాష, శైలి, ఛందస్సు, ఆయన కాలపు సాంఘికమైన విలువలు యథాతథంగా కొన సాగాలని కోరేవారు అరుదుగా తప్ప వుండరు.

అంత మాత్రాన నన్నయ తెలుగు వారికి ఆరాధ్యుడు, ఆదర్శపాత్రుడు కాకుండా పోడు. సాహిత్య భిక్ష పెట్టినదే ఆయన అయినప్పుడు ఆయన విస్మరణీయుడు ఎలా అవుతాడు? ఆయన సహస్రాబ్ది స్మృతికి ఆంధ్ర జాతి అంజలి ఘటించకుండా ఎలా అలక్ష్యం చేస్తుంది? నన్నయ ఉత్సవాలు ఇంతకంటె ఘనంగా, శ్రద్ధాన్వితంగా జరగటం తెలుగువారు తమ్ము తాము సమ్మానించు కోవడమే అవుతుంది.

(ఏప్రిల్ 10, 1983)

# ఇరువురు మహనీయులు

భారత ప్రభుత్వపు తంతి, తపాలా శాఖ ఈ నెలలో ఇరువురు మహనీయుల సంస్మరణార్థం రెండు తపాలా బిళ్ళలు ముద్రించింది. ఇరువురూ భారతీయేతరులే, గత శతాబ్దివారే.

ఒకరు జీవశాస్త్రవేత్త ఛార్లెస్ డార్విన్. మరొకరు సాంఘిక—రాజకీయ దార్శనికుడు కారల్ మార్క్స్. డార్విన్ ఇంగ్లీషు జాతీయుడు కాగా, మార్క్స్ జర్మన్ జాతీయుడైనా దీర్ఘకాలం లండన్‌లో ప్రవాస జీవితం గడిపి అక్కడే కాలధర్మం చెందినవాడు. ఉభయుల సిద్ధాంతాలు తమ దేశాలను, కాలాన్ని అధిగమించి ఈనాటికి కూడా యావత్ప్రపంచాన్ని ప్రభావితం చేస్తున్నాయి.

జర్మన్ తత్వవేత్త హెగెల్ నుంచి గతితార్కిక వాదాన్ని స్వీకరించి దాన్ని భౌతికవాద దృక్పథంతో మానవ సమాజ చరిత్రకు అన్వయించినవాడు మార్క్స్.

ఇంతవరకు నడచిన మానవ సమాజ చరిత్ర సమస్తాన్ని ఆయన వర్గ సంఘర్షణ చరిత్రగా దర్శించాడు. చరిత్ర గతిని, సమాజ స్వభావాన్ని నిర్ణయించేవి మానవుల ఆలోచనలు, కళలు, మతం మొదలయినవి కావు; ఉత్పత్తి, పంపిణీ విధానం మాత్రమే. సమాజంలో రెండే రెండు ప్రధాన వర్గాలు—పీడకులు, పీడితులు. ప్రతి చారిత్రక పరిణామ ఘట్టంలోను ఉత్పత్తి విధానాన్నిబట్టి ఒక వర్గం ముందుకు వచ్చి, అభ్యుదయ కర పాత్రను నిర్వహిస్తుంది. అయితే ఆ వర్గం తనను అంతమొందించే వర్గాన్ని తానే సృష్టించుకుంటుంది. క్రమంగా రెండవవర్గం మొదటివాన్ని అణగద్రొక్కి తాను సమాజంలో బలీయమయిన వర్గం అవుతుంది.

మార్క్స్ తన కాలంనాటి బూర్జువా సమాజాన్ని గతి తార్కిక దృక్పథం నుంచి విశ్లేషించాడు. ఉత్పత్తి సంబంధాలలోని వైరుధ్యాల కారణంగా క్రమంగా కార్మికవర్గం బలపడి బూర్జువావర్గాన్ని విప్లవం ద్వారా తొలగించి వేస్తుంది. అయితే, కార్మికవర్గ స్వభావాన్ని బట్టి అది సమాజంలోని ఇతర వర్గాలతో పాటు తనను కూడా తాను అంతం చేసుకుంటుంది. చివరకు వర్గ రహిత సమాజం ఏర్పడడమేకాక, రాజ్యం (స్టేట్) కూడా క్రమంగా అంతరించి పోతుందని మార్క్స్ ఊహించాడు.

ఆయన గతించి సరిగా నూరేళ్ళయింది. ఈ నూరేళ్ళలోను మార్క్సిజం, కమ్యూనిజం, సైంటిఫిక్ సోషలిజం మొదలైన పేర్లతో ప్రసిద్ధమైన ఆయన సిద్ధాంతాలు ప్రపంచంపై ప్రసరించిన ప్రభావం ఇంతింత అనరానిది. దానికి కారణం ఆచరణాత్మక మయినదే అసలైన తాత్విక సిద్ధాంతమని ఆయన సూత్రీకరించడం. "తత్వవేత్తలు ప్రపంచాన్ని బహు విధాలుగా వ్యాఖ్యానించారు. కాని, ప్రపంచాన్ని మార్చడం ముఖ్యం" అని మార్క్స్ ఒక చోట వ్రాశాడు. ఆయన సిద్ధాంత ప్రేరణతో ఈ శతాబ్దంలో రష్యాతో మొదలుపెట్టి కొన్ని దేశాలు విప్లవ మార్గాన నూతన రాజకీయ, ఆర్థిక వ్యవస్థలను నిర్మించుకున్నాయి.

మార్క్స్, ఆయన సహచరుడు ఎంగెల్స్ పందొమ్మిదవ శతాబ్దిలో తమ సమకాలీన సమాజాలను చూసి చేసిన సిద్ధాంతాలు ఈ శతాబ్దానికి వర్తించవని, మార్క్స్ జోస్యాలలో అనేకం నిజం కాలేదని, మార్క్సిజానికి కాలదోషం పట్టిందని, అదొకవిధమైన ఉటోపియన్ సోషలిజమేనని, స్వభావతః ఆయన సిద్ధాంతం నియంతృత్వానికి దారితీస్తుందని, నిజంగానే అలా దారి తీసిందని అనంతర కాలంలో అనేకులు

విమర్శించారు. ఆయన సిద్ధాంతాలకు ఎన్నో మార్పులు, చేర్పులు, నూతన వ్యాఖ్యానాలు కూడా వచ్చాయి. అయినా నేటికి కూడా మార్క్స్ మౌలిక చింతన పోషలిస్టు దేశాలలోనే కాక, పెట్టుబడిదారీ దేశాలలో కూడా ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక దృక్పథాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభావితం చేస్తున్నది. ఇక ముందు కూడా ప్రభావితం చేస్తూనే వుంటుం దనడంలో సందేహం లేదు.

భారత ప్రభుత్వం స్పెషల్ స్టాంపు ద్వారా గౌరవిస్తున్న మరొక మేధావి ఛార్లెస్ డార్విన్. మార్క్సిజం వలె డార్విసిజం కూడా భౌతికవాద దృక్పథానికి ప్రోది చేసింది. విజానికి మార్క్స్, ఎంగెల్స్ కూడా డార్విన్ అభిమానులే. భూమిపై గల జీవజాతులు తొలినుంచి ఈనాడున్న విధంగానే లేవని, కాలక్రమాన ఒకప్పటి జీవజాతులు నశించి, వాటి నుంచి, వాటి స్థానంలో కొత్తవి ఆవిర్భవించాయన్నది పరిణామ వాదం. దీన్ని మొదటగా ప్రతిపాదించినవాడు డార్విన్ కాదు. ఆయనకు ముందు నుంచి అది వున్నది. అయితే, జీవజాతుల పరిణామం ఏ విధంగా జరిగిందో మొదటిసారిగా తన పరిశోధనల ద్వారా సహేతుకంగా నిరూపించిన శాస్త్రవేత్త డార్విన్.

ఉదాహరణకు డార్విన్‌కు ముందు లామార్క్ అనే శాస్త్రవేత్త జీవులు తమ పరిసరాలకు అనుగుణంగా తమను తాము పరిణమింప జేసుకుంటాయని, పరిసరాల ప్రభావంవల్ల వాటిలో కలిగిన మార్పులు అనువంశికంగా కొనసాగుతాయని ఊహించాడు. కాని, ఇందుకు భిన్నంగా డార్విన్ పరిసరాలకు అనుగుణమయిన అవయవ నిర్మాణం కలిగిన జీవజాతులే వృద్ధి చెందుతాయని, వాటినే ప్రకృతి ప్రోత్సహిస్తుందని, పరిసరాలకు అనుగుణంగా లేనివి నశించిపోతాయని సిద్ధాంతీకరించాడు. "నేచురల్ సెలెక్షన్" పేరిట ప్రసిద్ధమైన ఈ సిద్ధాంత పరిణామవాదానికి తిరుగులేని సాక్ష్యంను సమకూర్చింది. అనంతర కాలంలో జరిగిన పరిశోధనలవల్ల డార్విసిజం కూడా ఎన్నో మార్పులు, చేర్పులకు లోనైనప్పటికి, మొత్తంపై దాని మౌలిక సూత్రాన్ని నేటికీ కూడా జీవ శాస్త్రవేత్త లందరు శిరోధార్యంగా అంగీకరిస్తున్నారు.

మార్క్సిజం వలె డార్విసిజం కూడా ఆధునిక మానవుని చింతనా స్రవంతిలో అంతర్వాహిని అయిపోయింది. ముఖ్యంగా మానవుని ప్రపంచ దృక్పథాన్ని మార్చి వేసింది. జీవ పరిణామానికి భౌతిక కారణాలను అన్వేషించడానికి దోహదకరమైంది. ఈ నూతన దృక్పథ మార్గదర్శకుడుగా డార్విన్ చిరస్మరణీయుడు.

(మే 15, 1983)

# యుగకర్త నిర్యాణం

శ్రీశ్రీ లేని ఆధునికాంధ్ర కవిత్వాన్ని ఊహించుకోవడం కష్టం. అర్ధ శతాబ్ది పాటు ఆయన తెలుగు కవిత్వాన్ని శాసించారు. వందలాది యువ కవులకు దేశికుడు, పథనిర్దేశకుడు అయ్యాడు. అక్షరాలా అసంఖ్యాక పాఠకులకు అభిమాన కవి అయ్యాడు.

తెలుగు కవిత్వంలో ఒక ఉజ్వల యుగానికి కర్త శ్రీశ్రీ. ఆయన మరణంతో ఆ యుగం అంతం కాబోవడం లేదు. తెలుగు కవిత్వం రానున్న తరాలలో ఎన్ని మలుపులు తిరిగినా, దానిపై ఆయన ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కొనసాగుతుంది.

ఆధునికాంధ్ర సాహిత్యానికి ఆదిపై తాళికుడు గురజాడ. ఆధునికత్వానికి ఆయన తలుపులు తెరిచాడు. ఆంధ్ర సరస్వతికి ఆయన "ముత్యాల సరాలు" వంకరించిన సంవత్సరమే శ్రీ శ్రీ ప్రభవించాడు. గురజాడ అడుగుజాడలో ముమ్ముందుకు సాగి పోయాడు.

శ్రీశ్రీ కళ్ళు తెరిచేనాటికి తెలుగులో భావ కవితా మార్గానిదే ప్రాబల్యం. దాని ప్రభావంలోనే శ్రీశ్రీ తన కవిత్వ సౌధానికి పునాదులు నిర్మించుకున్నాడు. ఆ రోజులలో విశ్వనాథ, కృష్ణశాస్త్రి ప్రభృతుల రచనలకు ప్రతిధ్వని లనదగిన వృత్తాలు, గీతాలు రచించాడు. అనతికాలంలోనే ఆయనకు దానిపై మొగం మొత్తింది. పూర్తిగా తనదే అనిపించుకోదగిన మానవ వ్యక్తిత్వానికై అన్వేషిం చాడు. ఆ అన్వేషణ ఫలితమే 1933 లో ఆయన రచించిన "నేను సైతం ప్రపం చాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను...." అని ప్రారంభమయ్యే అపూర్వ గీతం. ఆధునికుల వ్యష్టివాదానికి, ప్రాచీనుల సమష్టి వాదానికి అవినాభావాన్ని అంత కవితాత్మ కంగా సంభావించిన గీతం సాహిత్య చరిత్రలోనే కనబడదు. పాత కొత్తలకు వారధి వంటి ఆ గీతానికి ఇది స్వర్ణోత్సవ సంవత్సరం కూడా.

ఆ మరునటి సంవత్సరమే శ్రీ శ్రీ పూర్తిగా మానవ మార్గానికి మరలి "మరో ప్రపంచం మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది...." అనే సుప్రసిద్ధ గీతంతో ఒక నవశకాన్ని ఆవిష్కరించాడు. ముద్దుకృష్ణగారి 'జ్వాల' లో ప్రచురిత మైన ఆ గీతం ఆనాడు గొప్ప సంచలనం కలిగించింది; ఎందరో యువకవులకు స్ఫూర్తి నిచ్చింది. తెలుగులో అభ్యుదయ కవితా ప్రవంతికి అది జన్మగీతమైంది.

ఆ తర్వాత శ్రీ శ్రీ వెనుదిరిగి చూడలేదు. ముమ్ముందుకే ప్రయాణించాడు. తెలుగునాట అప్పుడప్పుడే వామపక్ష భావాలు వ్యాపిస్తున్నాయి. ఆ భావాల ప్రభావం శ్రీ శ్రీపై పడింది. ఒకవైపు మార్క్సిస్టు దార్శనికతను పుణికిపుచ్చుకున్నాడు. మరొక వైపు సంఘంలో దగాపడిన తమ్ముల బాధల గాథలు ఆకళించుకున్నాడు. వేరొకవైపు ప్రాచీనాధునాతనాంధ్ర సాహిత్యావలోడనంవల్ల కలిగిన వ్యుత్పత్తి, భావుకత వుండనే వున్నాయి. ఇంకొకవైపు పాశ్చాత్య వాఙ్మయ మథనంవల్ల కలిగిన ఆధునిక దృక్పథం వున్నది. ఇన్ని ప్రభావాల సమ్మేళనం నుంచి తర్వాత కాలంలో యుగకర్తగా గుర్తింపదగిన శ్రీశ్రీ ఆవిర్భవించాడు.

"మహా ప్రస్థానం" గీత సంపుటి తెలుగు ఆధునిక కవిత్వంలో ఒక మైలు రాయి. దాని తర్వాత శ్రీ శ్రీ ఎన్నో కవితా ఖండికలు, వచన రచనలు—ప్రయో

గాత్మకమైనవి, ప్రయోజనాత్మకమైనవి, ప్రచారాత్మకమైనవి—రచించాడు. వాటిలో ఆయన గాఢ ప్రతిభ, విలక్షణ వ్యక్తిత్వ ముద్ర ప్రస్ఫుటంగా ప్రత్యక్షమవుతాయి. కాని, అనంతర కాలంలో ఎన్ని వ్రాసినా "మహాప్రస్థానం" గీతాలలో ఆయన అందుకున్న ప్రతిభా శిఖరాల ఔన్నత్యం ఈ నాటికీ కూడా పఠితలను ఆశ్చర్య పరుస్తుంది.

ఒక తాత్విక సిద్ధాంతాన్ని కవితామయంగా పలకడం సాధారణులకు సాధ్యం కాదు. ఆ విధంగా మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కవితాత్మకంగా పలికినవారిలో ముఖ్యుడుగా జర్మన్ కవి బెర్టాల్ట్ బ్రెక్ట్‌ను పేర్కొంటారు. తిరిగి తెలుగులో శ్రీ శ్రీ ఆ "ఫీట్" చేశాడు. "ఏ దేశ చరిత్ర చూసినా ఏ మున్నది గర్వకారణం—నరజాతి చరిత్ర సమస్తం పర పీడన పరాయణత్వం" అని ప్రారంభమయ్యే గీతం "కమ్యూనిస్టు మ్యానిఫెస్టో"లో ఇప్పటివరకు నడిచిన సమాజ చరిత్ర అంతా వర్గ సంఘర్షణల చరిత్ర అని ధ్వనించే ప్రారంభ వాక్యాలను కవనీకరించినట్లు వుంటుంది. "కాదేదీ కవిత కనర్హం, ఔనౌను శిల్పమనర్ఘం" అనే పాదాలతో కూడిన శ్రీ శ్రీ రచన "ఋక్కులు"—రమ్యమైనదైనా, జుగుప్సితమైనదైనా, ఏదైనా కవి భావుక భావ్యమానమై రసస్ఫోరక మవుతుందని సూత్రీకరించే సంస్కృతాలంకారిక శ్లోకానికి ఆధునిక రూపంవలె భాసిస్తుంది.

"ఏకో రసః కరుణ ఏవ" అని భవభూతి వాక్యం. అన్ని నదులు సముద్రంలో విలీనమైనట్లు అన్ని రసాలు కరుణ రసంలో పర్యవసిస్తాయి. శ్రీ శ్రీ కవితలో స్థూల దృష్టికి ఎంత రౌద్రం, బీభత్సం కనిపించినా అంతర్లీనంగా కరుణ రసం ప్రవహిస్తూనే వుంటుంది. మానవతావాదం ప్రచలిస్తూనే వుంటుంది. "మానవుడే నా సందేశం, మనుష్యుడే నా సంగీతం" అని ఎలుగెత్తి చాటిన కవి శ్రీ శ్రీ.

తన రచనలలో లోకం ప్రతిఫలించాలని, తన గీతాన్ని తన జాతి జనమంతా పాడుకునే మంత్రంగా ప్రయోగించాలని, తన ఆశాలను లోకానికి చేరువగా, తన ఆదర్శాలను సోదరులంతా పంచుకునే వెలుగుల రవ్వలజడిగా కురిపించాలని జీవితమంతా ఒక తపస్సుగా గడిపిన మహాకవి శ్రీ శ్రీ. ఆయన మహాప్రస్థానం చేసినా ఆయన కవితకు, ఆదర్శాలకు "మహాప్రస్థానం" లేదు. ఏ వెలుగులకో, ఏ స్వప్నానికో, ఏ దిగ్విజయానికో మార్గసూచికలై అవి మనలను నిత్యం మంత్రిస్తూనే వుంటాయి, ఆమంత్రిస్తూనే వుంటాయి.

(జూన్ 17, 1983)

చిరంజీవ్యశ్రీ

# నవ్యకవితా పితామహుడు

"అడుగులు బొబ్బలెత్త, వదనాంచల మందున చిన్కు చెమ్మటల్ మడుగు గట్టి........" అని ఇరవై ఏళ్ళ ఒక యువకవి ఒక ఖండ కావ్యం ప్రారంభించాడు. అది అభినవాంధ్ర కవిత్వానికి ఆద్య పద్యమైంది. అది 1912—13 నాటి మాట.

ఆ ఖండకావ్యం పేరు "తృణకంకణము". అది రచించిన ఆనాటి ఆ యువకవి పేరు నవ్యాంధ్ర కవితా పితామహుడుగా ప్రసిద్ధుడైన రాయప్రోలు సుబ్బారావు.

తెలుగు కవిత్వంలో ఒక నవ్యయుగానికి కారకులైన విశ్వనాథ, దేవులపల్లి తల్లావఝుల, దువ్వూరి, వేదుల మొదలైన మహామహులందరు ఇంతకుముందే మన మధ్యనుంచి నిష్క్రమించారు. కాగా, వారందరికి ముందు నడిచి, వారందరికి మార్గ దర్శకుడైన రాయప్రోలువారు అందరికంటె వెనుకగా, ఆ యుగానికి చెందిన అంతిమ మధుర సౌరభతరంగాన్ని కూడా తనతో తీసుకుపోతూ నిన్న శాశ్వతంగా కన్ను మూశారు.

గురజాడ, రాయప్రోలు — వీరిరువురిలో నవ్యకవిత్వానికి నాంది పలికినవా రెవ్వరని కొంతకాలం తెలుగునాట ఒక వివాదం రేగింది. ఆ ఇరువురు ఉత్తర, దక్షిణ ధ్రువాల వంటివారు. వారివి భిన్న మార్గాలు. అయినా, ఇరువురు తమ కాలపు ప్రబంధ సంప్రదాయంమీద తిరుగుబాటు చేసిన వారే. ఆంగ్ల సాహిత్యంతో ప్రభా వితులైనవారే. నూతన కవితారీతులను ప్రారంభించినవారే. తరువాతి కవులపై

అపార ప్రభావాన్ని ప్రసరించినవారే. అందుచేత ఆ ఇరువురిని నవ్యాంధ్ర కవిత్వ యుగకర్తలుగానే పేర్కొనాలి. రాయప్రోలువారి నిర్యాణంతో తెలుగు కవిత్వంలో ఒక యుగకర్త అస్తమించారు.

రాయప్రోలు వారు గేయచ్ఛందస్సులలో ఎన్నెన్నో మధుర గీతాలు ఆలపించకపోలేదు. అయినా, ఆయన ప్రతిభ వృత్తచ్ఛందస్సులలో మరింతగా రాణించింది. ఆధునికులలో సరళ సుందరంగా వృత్త రచన చేసినవారు పలువురున్నారుగాని, వారికి మార్గం చూపినవారు రాయప్రోలు వారే. ప్రబంధ కవిత్వానికి భిన్నంగా, వుండీ లేదనిపించేటంత చిన్న ఇతివృత్తంతో, సందేశాత్మకమైన ఖండ కావ్యాల రచనకు ఆయనే వరవడి పెట్టారు. నాయికల అంగాంగ వర్ణన, చంద్రోపాలంభం, మదనోపాలంభం, రతివర్ణన మొదలైన సంప్రదాయాలను కాలదన్ని, అమలిన శృంగార భావనకు తెలుగు కవిత్వంలో పట్టాభిషేకం చేసి భావకవిత్వమనే పేరుతో ప్రచారం పొందిన పద్ధతికి మార్గదర్శకుడైనది కూడా ఆయనే.

"ఆధునిక కవిత్వమునకు తృణకంకణము ఆది గ్రంథమని అస్మదాదుల ఆశయము" అని దాని రజతోత్సవ సందర్భంలో తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు అన్నారు. పాతికేళ్ళ తర్వాత ఆ మాట అనడంలో విశేషం లేదు. "తృణకంకణము" వెలువడిన కొద్ది నెలలకే 1913 అక్టోబరులో జయంతి రామయ్యగారు "This little poem purports to make the beginning of a new school of Telugu poetry........" అని ప్రస్తుతించారు. అలాగే 1916 లో కట్టమంచి వారు "He is almost entitled to be acclaimed as the founder of a new school of poetry" అని కీర్తించారు. సమకాలికులైన ఉద్దండ పండితులు, అందులో ఇరవై ఏళ్ళ యువకవిని ఒక నూతన కవితా మార్గానికి కర్తగా ప్రశంసించడం గొప్ప విశేషం.

తృణకంకణం తర్వాత రాయప్రోలు వారి లేఖినినుంచి స్నేహలతాదేవి, కష్టకమల, స్వప్న కుమారము, ఆంధ్రావళి, జడకుచ్చులు, తెనుగుతోట వంటి ఖండకావ్య సంపుటాలెన్నో వెలువడి ఆంధ్రరసిక లోకాన్ని అలరించాయి. అన్నిటిలోను ఆయన అమలిన శృంగార సిద్ధాంతం—ప్లేటోనిక్ లవ్‌గా పేర్కొనదగిన ప్రేమభావం — ప్రముఖంగా భాసిస్తుంది. వీటిలో వరకట్నపు దురాచారాన్ని ఖండించిన స్నేహలతా దేవి ఒక విలక్షణ ఖండకావ్యం.

ఇక రాయప్రోలు వారి పేరు చెబితే ఆయన మహావేశంతో, మహాశక్తితో పలికిన ఎన్నో దేశభక్తి పద్యాలు జ్ఞాపకం వస్తాయి.

"ఏదేశ మేగినా ఎందుకాలిడిన, ఏ పీఠ మెక్కినా ఎవ్వరెదురయిన, పొగడరా నీ తల్లిభూమి భారతిని, నిలుపరా నీ జాతి నిండు గౌరవము" అని ప్రారంభమయ్యే ప్రసిద్ధగీతం స్వాతంత్ర్య సమరకాలంలో తన పాత్ర తాను నిర్వహించింది.

"........చావలేదు చావలేదు ఆంధ్రుల మహోజ్వల చరిత్ర, హృదయములు చీల్చి చదువుడో సదయులార!" మొదలైన పద్యాలు ఆనాటి ఆంధ్రోద్యమానికి చేసిన దోహదం సాటిలేనిది.

"కలదయేని పుణ్యవశ్య కలుగగాక, మధుర మధురంబయిన తెన్గు మాతృభాష" అని తెలుగు వారిలో రాయప్రోలు వారు రేకెత్తించిన స్వభాషాభిమానం యెన్నటికీ మరువరానిది.

రాయప్రోలు వారి తక్కిన అంత కావ్యాలన్నీ ఒక ఎత్తు. వారి రమ్యాలోకం, మాధురీ దర్శనం ఒక ఎత్తు. అందులో రమ్యాలోకం మరీని. నవ్యకవితా లక్షణాలను, ఆశయాలను, ఆదర్శాలను సూత్రీకరించే అలంకారశాస్త్ర గ్రంథంగా దాన్ని ఉద్దేశించినప్పటికీ "రమ్యాలోకం" ఒక గొప్ప రసాత్మక కావ్యంగా కూడా భాసిస్తుంది.

ఆయన ఏది వ్రాసినా మధుర మధురంగా వ్రాశారు. ఆర్ద్రంగా వ్రాశారు, ఉదాత్త శైలిలో ఒక ఋషివలె వ్రాశారు. "మామిడి కొమ్మమీద కలమంత్ర పరాయణుడైన కోకిల స్వామికి మ్రొక్కి యా యభినవ స్వర కల్పన కుద్యమించితిన్...." అని ఆయనే చెప్పుతున్నారు. ఆ కోకిలస్వామి రాయప్రోలు వారే. ఆయన జపించింది కల మంత్రమే. ఆయన ఆలపించింది అభినవ స్వరమే.

తెలుగు భాషలోని తీయదనమంతా ఆయన కవితలో గూడు కట్టుకున్నది. అవధాన ప్రక్రియా కృత్రిమత్వం నుంచి మరల్చి, తెలుగు కవిత్వాన్ని రమ్యాంతర కోటిగా మార్చిన ఘనత ఆయనది. ఒక తరం తెలుగు కవిత్వాన్ని ప్రభావితం చేసి, తొంభయి రెండేళ్ళ పరిపూర్ణ జీవితం గడిపి కన్నుమూసిన రాయప్రోలు వారికి తెలుగు వారు ఎంతైనా ఋణపడి వున్నారు.

(జూలై 1, 1984)

# నేల కొరిగిన గులాబి

ఆమె మరి మనకు కనబడదు. చిరునవ్వులు చిందే ఆమె సుందరవదనం శాశ్వతంగా మాయమైంది.

ఆమె పేరే ఇందిరా ప్రియదర్శిని! ఇందిర ప్రియదర్శనం మరి మనకు లేదు.

తన ప్రజల కష్ట సుఖాలు తెలుసుకొనడానికి, వారిని సాదరంగా పలకరించడానికి, ఆసేతు శీతనగ పర్యంతం అహర్నిశలు విసుగు, విరతి లేకుండా సంచరించిన భారత ప్రియతమ ప్రధాని శ్రీమతి ఇందిరా గాంధి నేటి నుంచి మన మధ్య తిరగరు.

కోట్ల కొలది భారతీయులు—అట్టడుగు వర్గాల ప్రజలు—"అమ్మ!" అని నోరారా ఆప్యాయంగా పిలుచుకునే శతసహస్ర వరనారీ హృదయనేత్రి ఇక ఎన్నటికి తిరిగిరాదు.

పద్దెనిమిదేళ్ళ క్రిందట మొదటిసారిగా భారత ప్రధాని పదవిని అధిష్ఠించి,

మధ్యలో మూడేళ్ళు తప్ప విశ్రాంతి లేకుండా దేశాన్ని శత్రు దుర్నిరీక్ష్యంగా పరిపాలించిన మహారాజ నీతిజ్ఞురాలు మరి తన ప్రజలకు దర్శన మివ్వదు.

చిన్ననాట విశ్వకవి శాంతినికేతనంలోను, మరి కొన్ని చోట్ల, విద్యాభ్యాసం చేసినా, తండ్రి జవహర్లాల్ నెహ్రూయే ఆమె ప్రధాన గురువు. ఆయన కలం నుంచి వెలువడిన లేఖల రూపంలో ఇందిర ప్రపంచ పరిణామ చరిత్రను, మానవజాతి వికాస గాథను అవలోడనం చేసింది. తన లేత మెదడును పరిపుష్టం చేసుకున్నది. తండ్రి వెంట దేశదేశాలు తిరిగింది. ప్రపంచ రాజకీయ నాయకులను, మేధావులను పరిచయం చేసుకున్నది. భారత స్వాతంత్ర్యోద్యమంలో తన కుటుంబ సభ్యులందరితో పాటు తాను కూడా ఓపిన మేరకు పాల్గొన్నది. చిన్ననాటి నుంచి దేశసేవా నిరతిని పెంచుకున్నది. వీటన్నింటితో వచ్చిన ఒకానొక హృదయ- మేధా సంస్కారంతో ఆమె ప్రధాని అయిన తర్వాత ప్రపంచ రాజకీయ ప్రముఖులలో అగ్రశ్రేణికి చెందిన వ్యక్తిగా గణన కెక్కింది. అలీనోద్యమ అధ్యక్షురాలుగా ప్రాక్పశ్చిమ రాజ్యకూటాల మధ్య అణ్వాస్త్రయుద్ధ ప్రమాద నివారణకు ఆమె ఎంతగానో కృషి చేసింది. ఆ మహా రాజనీతివేత్రి నేడు శాశ్వతంగా అంతర్ధానమైంది.

"తల్లీ! ధైర్యం అలవరుచుకో! ప్రపంచం నీ వెంట వస్తుంది!" అని తండ్రి ఆమెకు ఉపదేశించాడు. అలాగే శ్రీమతి ఇందిర అమిత ధైర్య సాహసాలతో జీవిత రణరంగంలో ఎవరికీ వెరవక, ఏ క్లిష్ట పరిస్థితికీ వెన్నివ్వక నిలిచింది. దేశాభ్యుదయ మహా కార్యక్రమానికి తన జీవితాన్ని అంకితం చేసింది. ఎన్ని అవాంతరాలు ఎదురైనా ఆ కృషిలో ముమ్ముందుకే సాగిపోయింది. ఆ మేరునగధీరురాలు నేడు నేల కొరిగింది.

మొన్న మొన్న పంజాబులో సిక్కుమతోన్మాదులు, ఉగ్రవాదులు చెలరేగి రాష్ట్రాన్ని నానా బీభత్సం చేస్తుండగా, ఆమె వారిపై కఠిన చర్యలు గైకొనక తప్ప లేదు. అమృత్‌సర్ స్వర్ణాలయంలో దాగిన దుండగులను వెతలగొట్టడానికి సైన్యాన్ని ప్రయోగించడం అనివార్యమైంది. ఆ చర్యలో పెక్కుమంది ఉగ్రవాదులు నిహతు లయ్యారు. అకాల్‌తఖ్త్ దెబ్బతిన్నది. నాటి నుంచి సిక్కు ఉగ్రవాదులు ఆమెపై పగ బట్టారు. ఆమెను హత్య చేయడానికి ప్రతిజ్ఞ వహించారు. అయినా, ఆమె చలించ లేదు. దేశ సమైక్యం, సమగ్రత—వీటిని తన ప్రాణాధికాలుగా భావించి వాటి పరి రక్షణకు దీక్ష వహించింది. చివరికి ఆ కిరాతక మతోన్మాదుల తుపాకి తూటాలకే

ఆమె బలి అయింది. అలనాడు మహాత్మా గాంధివలె నేడు ఇందిరాగాంధి మృతి కూడా వీరోచిత మరణం.

తన తండ్రి అసంపూర్తిగా వదలి వెళ్ళిన దేశాభివృద్ధి కృషిని శ్రీమతి గాంధి అకుంఠిత దీక్షతో, అప్రతిమాన దీక్షతో కొనసాగించింది. ఆ కృషి తిరిగి ఆమె విషాద మరణంతో అసంపూర్తిగానే మిగిలిపోతున్నది. దేశం ఎన్నడూ ఎరుగనంతటి అత్యంత క్లిష్ట సరిస్థితిలో వుండగా జీవిత రంగం నుంచి ఆమె నిష్క్రమించడం జాతికి ఎన్నటికీ తీరని లోటు.

రాజకీయాలలో వున్న వారికి, ముఖ్యంగా ప్రభుత్వాధికారంలో వున్నవారికి శత్రువులు ఎందరో వుంటారు. ప్రాణాపాయం అడుగడుగునా పొంచి చూస్తూ వుంటుంది. ఎంత జాగరూకతతో వున్నా, ఎటు నుంచి ఏ ప్రమాదం వచ్చిపడుతుందో తెలియదు. అయినా, శ్రీమతి గాంధి భద్రత విషయంలో ఎందుకింత ప్రమత్తత సంభవించిందో ఆమెను ఆమె భద్రత సిబ్బందిలోని వారే హత్య చేయడం ఎలా జరిగిందో, ఆశ్చర్యం.

రాజకీయ విభేదాలు ఎంత తీవ్రంగానైనా వుండవచ్చు. అయినా, రాజకీయ వేత్తల హత్యలతో విభేదాలు పరిష్కారం కావు. ప్రజాస్వామ్యంలో ప్రతీకార రాజకీయాలకు తావు లేదు. సిక్కు ఉగ్రవాదులు భారత ప్రధానిని రాజకీయంగా ఎదుర్కొనలేక హత్యకు పాల్పడడంకంటె పిరికితనం మరిలేదు. వారి ఘాతుకాన్ని సర్వ సభ్య ప్రపంచం ముక్తకంఠంతో ఖండిస్తుంది. ఆమె ఆకస్మిక విషాద మరణానికి బాధాసంతప్త హృదయంతో స్పందిస్తుంది.

దేశ సమగ్రత, జాతి సమైక్యం కోసం శ్రీమతి గాంధి తన జీవితాన్ని బలి చేశారు. ఆమె జీవిత ధ్యేయం కోసం పునరంకితం కావడం నేడు ప్రతి భారత పౌరుని పవిత్ర కర్తవ్యం. అదే సమయంలో శ్రీమతి గాంధి నిష్క్రమణతో దేశంలో ఏర్పడిన ఈనాటి క్లిష్ట పరిస్థితిని నిబ్బరంగా, సహనం కోల్పోక నిగ్రహంతో, విజ్ఞతతో, వివేకంతో ఎదుర్కోవడం కూడా ప్రతి భారతీయుని పునీత విధి. అంతకంటె తమ ప్రియతమ నేత్రికి భారతజాతి నేడు అర్పించగలిగిన నివాళి మరి లేదు.

(నవంబరు 1, 1984)

# "ఇందిరా అమర్ రహే!"

భారత ప్రజల ప్రియాతి ప్రియనేత్రి శ్రీమతి ఇందిరా గాంధి భౌతికకాయం పంచభూతాలలో విలీనమైంది. ఇక ఆమె తన యశశ్శరీరంతో జాతి స్మృతి ప్రపంచంలో శాశ్వతంగా జీవిస్తారు.

కడచిన మూడు రోజులుగా లక్షలాది ప్రజలు, తమ ప్రియతమ నాయకురాలిని ఢిల్లీలో కడసారిగా దర్శించి సాశ్రునేత్రాలతో శ్రద్ధాంజలి ఘటించారు. దిక్కులు పిక్కటిల్లే విధంగా "ఇందిరాగాంధి అమర్ రహే!" అనే నినాదాలతో, "ఇందిరా! సూర్యచంద్రులున్నంత వరకు నీ పేరు నిలిచిపోతుంది" అనే ఆలాపనలతో శనివారం సాయంత్రం ఆమెకు ప్రజలు తుది వీడ్కోలు చెప్పారు.

ఖండఖండాంతరాలలోని దేశదేశాల అధినేతలు కడచిన రెండు దశాబ్దాలలో తమకు అతిథిగా వచ్చిన శ్రీమతి గాంధికి ఎన్నోసార్లు వీడ్కోలు చెప్పివుంటారు. నిన్న తమ మంచి తుదిసారిగా సెలవు తీసుకొంటున్న ఆమెకు తుదిసారిగా వీడ్కోలు చెప్పడానికి వారు ఢిల్లీ వచ్చారు.

గాంధి, నెహ్రూల నిర్యాణం తర్వాత జాతిని ఇంతగా కుదిపి వేసిన విషాద సంఘటన మరొకటి జరుగలేదు.

అద్భుతమైనది ఆమె జీవిత యాత్ర. అంతకంటె అద్భుతమైనది ఆమె అంతిమ యాత్ర.

జీవితంలో ఆమె మహోన్నత శిఖరాలు అందుకొంది. మరణంలో మరింత ఉన్నతోన్నత శిఖరాలను ఆరోహించింది.

ఎవరు జీవించారు అంత ధీరోదాత్త జీవితం? ఎందరు మరణించారు అంత వీరోచిత మరణం!

పగటి వెలుగు వెనుకనే రేయి చీకటి పొంచి వుంటుంది. వెలుగు చీకట్ల సమ్మేళనమే జీవితం. ఆమె విజయాలు ఎన్నో సాధించింది. అలాగే ఎన్నో అపజయాలు చవిచూసింది. అయినా, గీతాకారుడు చెప్పినట్టు, జయాపజయాలను సమానంగా పరిగణించింది. వాటికన్న మిన్నయైనవిగా ఆమె తన లక్ష్యాలను, విశ్వాసాలను, సిద్ధాంతాలను, ఆదర్శాలను సంభావించింది.

అందుకే ఆమె జయాపజయాలను, సాఫల్య వైఫల్యాలను లెక్కచేయక తాను నమ్మిన సిద్ధాంతాలకోసం అంతిమ శ్వాస వరకు అచంచల ధైర్యసాహసాలతో పోరాడింది.

తన విద్యాభ్యాస కాలంలో శాంతినికేతన స్నిగ్ధ తరుచ్ఛాయలలో ప్రతిధ్వనించిన "ఏక్‌లా చలో, ఏక్‌లా చలో, ఏక్‌లా చలోరే...." అన్న రవీంద్రుని గీతాన్ని అనంతర జీవిత కాలంలో మననం చేసుకుంటూ ఒంటరిగా — ఒంటరి—ఒంటరిగానే— ముందుముందుకు సాగిపోయింది.

ఆమె ప్రధానమంత్రిత్వ కాలంలో దేశం సాధించిన విజయాలు ఒకటా, రెండా? అసూయావిష్టులైన వారు, మత్సర గ్రస్తులైనవారు ఆమె సాధించినది శూన్యమని, దేశం మరింత వెనుకకు పోయిందని నిందించని రోజు లేదు. అయినా, కళ్ళుండీ చూడలేని వారికి తప్ప దేశం కడచిన మూడు దశాబ్దాలలో, లేదా రెండు దశాబ్దాలలో సాధించిన అభివృద్ధి కనబడకుండా వుండదు. స్వాతంత్ర్యం సిద్ధించిన రోజులలో పరిశ్రమలు, వ్యవసాయం, నీటిపారుదల సౌకర్యాలు, విద్యుదుత్పత్తి, విద్యాలయాలు, వైద్యశాలలు, అక్షరాస్యత—ఇంకా ఎన్నో విషయాలలో దేశం ఎలా వున్నది? ఈనాడు ఆయా రంగాలలో ఎలా వున్నది? అన్న ప్రశ్న వేసుకొని పరిశీలించిన వారికి దేశం సాధించిన అభివృద్ధి కొట్టవచ్చినట్టు కనబడకుండా పోదు.

ఈ అభివృద్ధి అంతా కాగితాల మీదనే తప్ప, అంకెలలోనే తప్ప, జనజీవితాం లోనికి ఇంకలేదనే వాదంకూడా కేవలం మత్సర ప్రేరితమైనది తప్ప అన్యం కాదు. నిస్సందేహంగా ప్రజల జీవన ప్రమాణం పెరిగింది. సంవత్సరానికి ఒక ఆస్ట్రేలియా ఖండంతో పోల్చదగినంతగా జనాభా పెరుగుతున్న దేశంలో ఎంతగా పెరగడానికి వీలున్నదో దాదాపు అంతగాను పెరిగింది.

నిజమే, నేటికి కూడా కొన్ని కోట్లమంది ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన అల్లాడిపోతున్నారు. త్రాగడానికి మంచినీరు సయితం లేని గ్రామాలు వేలాదిగా వున్నాయి. వానలు కురిస్తేనే పంట. లేకపోతే కరవు తప్పని ప్రాంతాలు ఇంకా ఎన్నో వున్నాయి. అక్షరాస్యత ఇప్పటికీ 40 శాతం లోపునే వుండిపోయింది. అజ్ఞానం, అవిద్య, అనారోగ్యం తాండవించే పల్లెపట్టులు లెక్కకు మిక్కిలిగా వున్నాయి.

ఇది కాదనలేని సత్యమే. ఇంకా సాధించవలసింది ఎంతో వున్నదన్న మాట నిజమే. ఆ దృక్పథంతోనే, ఆ లక్ష్యంతోనే శ్రీమతి గాంధి ఒకనాడు తన తండ్రి ప్రారంభించి అసంపూర్తిగా వదలి వెళ్ళిన అభ్యుదయ మహాయజ్ఞాన్ని కొనసాగించింది. నెహ్రూ వేసిన పునాదులపై దేశ సౌభాగ్య సౌధాన్ని నిర్మించడానికి ఉద్యమించింది.

దేశాభివృద్ధిని క్షణాలలో, రోజులలో సాధించగల మంత్రదండం ఏదీ తన వద్ద లేదని పండిట్ నెహ్రూ అనేవారు. శ్రీమతి గాంధి కూడా అదే మాట వునరుద్ఘాటిస్తూ వుండేవారు.

రోమ్ నగరం ఒక రోజులో కట్టింది కాదని అంటారు. అలాగే నవభారత సౌభాగ్యసౌధం కూడా ఇటుకపై ఇటుకగా పేర్చుకుంటూ దశాబ్దాల తరబడి నిర్మించుకుంటూ పోవలసిందే తప్ప "మహంకాళీ!" అని మంత్రదండం వూపగానే ప్రత్యక్షమయ్యేది కాదు.

మనది శతాబ్దాలుగా అంధయుగంలో జీవించిన జాతి. మితవాదం, మతవాదం కలిసి కట్టిన జాతి. కొత్తదనాన్ని ఒకంతట ఆహ్వానించలేని జాతి. మూఢ విశ్వాసాల బురదలో కూరుకుపోయిన జాతి. "ఇప్పటి సైన్స్ మనకు తగదు. అసలైన సైన్సు వేదాలలోనే వుంది. వేదాలు చదువుకుంటే చాలు" అని వాదించే పరమ

ఛాందసాలు ఇంకా వేనవేలు వున్న జాతి. వానలు కురవకపోతే చెట్టుకు, పుట్టకు, గుట్టకు పూజలు చేసే జాతి.

మనిషి ఒకవ్యక్తి ఒక మతంలో, ఒక కులంలో జన్మించినంత మాత్రాన మ్లేచ్ఛుడుగా, లేదా అంటరానివాడుగా పరిగణించే జాతి. బాల్య వివాహాలు, సతీ సహ గమనాలు, వరకట్నాల దురాచారాలను ఇంకా వదలలేకపోతున్న జాతి. ఆడదాన్ని ఆటవస్తువుగా తప్ప మరొక విధంగా చూడలేక పోతున్న జాతి. కుటుంబ నియంత్రణ వంటి ప్రాథమిక విషయాన్ని కూడా మత, రాజకీయ సమస్యగా చేసి అలక్ష్యం చేస్తున్న జాతి.

ఇటువంటి జాతికి చెందిన దేశాన్ని కేవలం పదహారేళ్ళలో అగ్రరాజ్యాల సరసన నిలపలేక పోయినందుకు శ్రీమతి గాంధిని నిందించడం కంటె రాజకీయ మాత్సర్యానికి పరాకాష్ఠ లేదు. ఒక వ్యక్తి తన జీవిత కాలంలో, తన పదవీ కాలంలో ఎంత కృషిచేయగలదో అంత కృషి ఆమె చేశారు. తాను పదవికి వచ్చిన క్షణం నుంచి ప్రత్యర్థులు, ప్రతీపశక్తులు అడుగడుగున కల్పించిన అవాంతరాల మధ్య, అభ్యంతరాల మధ్య ఎంత అభివృద్ధి సాధించడానికి వీలున్నదో అంతగాను సాధించ డానికి ఆమె కృషి చేశారు.

ఆమె కృషి ఫలితాలను అంచనా వేయడానికి ఇది సమయం కాదు. ఆమె నాయకత్వ వైశిష్ట్యాన్ని చారిత్రక దృష్టితో అంచనా వేయడానికి మరికొంత కాలం గడవాలి.

అయినా, జీవించి వుండగానే ఆమె చారిత్రక వ్యక్తిగా ప్రజాభిమానానికి పాత్రురాలయ్యారు. ఎన్నో వివాదాల మధ్య, విభేదాల మధ్య కూడా భారత జాతి ఆమెను తన ప్రియాతి ప్రియ నేత్రిగా సంభావించుకున్నది.

కనుకనే ఆమె మృదు సుకుమార భౌతిక కాయం అగ్నికీలలకు ఆహుతియై, పంచభూతాలలో విలీనమవుతున్న సమయంలో ఆసేతుశీతాచలం అసంఖ్యాక జన హృదయాలు "ఇందిరా గాంధి అమర్ రహే!" అనే నినాదాల తరంగాలతో దుఃఖ సముద్రాలవలె ఘూర్ణిల్లుతున్నాయి. శ్రీమతి ఇందిరా గాంధి ధన్యజీవి, మృత్యుంజయి.

(నవంబర్ 4, 1984)

# మానవతావాద కవి

కొందరు కవులు చనిపోయినప్పటి నుంచి జీవించడం ప్రారంభిస్తారు. తెలుగు ఆధునిక కవుల్లో తిలక్ అటువంటి వాడు. బైరాగి మరొకడు.

బ్రతికి వుండగా వీరికి రావలసినంత పేరు రాలేదు. సమకాలికులు వీరిని పట్టించుకోవలసినంతగా పట్టించుకోలేదు. ముఖ్యంగా బైరాగి తన కవిత్వంలాగే తాను కూడా సమాజానికి, దేశానికి కాస్త ఎడంగా వుండడం ఇందుకొక కారణమేమో.

చనిపోయిన తరవాత నుంచి తిలక్, బైరాగి కవితలకు ఆధునిక కవిత్వంలో సముచితమైన గుర్తింపు లభించింది. నిజానికి తిలక్ మరణానంతరమే ఆయన "అమృతం కురిసిన రాత్రి" ప్రచురణకు, కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతికి నోచుకున్నది.

అలాగే ఆలూరి బైరాగి కవితా సంపుటి "ఆగమగీతి" ఆయన మరణానంతరమే ప్రచురణ పొందింది. మొన్న కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారం సయితం పొందింది. ఆయన పేరే సూచిస్తున్నట్టు, బైరాగి ఇటువంటి విషయాల్లో

విరాగి కనుక ఈ బహుమతికి సంతోషించే వాడో లేదో కాని, ఆయన కవితాభిమాను లకు మాత్రం ఇది నిజంగా ముదావహ విషయం.

బైరాగి విలక్షణ కవి. ఆయన కవిత ప్రధాన కవితాస్రవంతికి కొంచెం పక్కగా ప్రవహిస్తున్నట్టు వుంటుంది. శ్రీశ్రీ యుగంలోనివాడైనా శ్రీశ్రీ నీడ పడని వాడు. ఆయన గొంతుక అచ్చగా ఆయన సొంతం.

అయితే, ఎవరి ప్రభావం ఏ కొంతో పడకుండా ఏ కవీ వుండడు. టి. ఎస్. ఇలియట్, ఫ్రెంచి సింబలిస్టులు, ఎగ్జిస్టెన్షలిస్టుల ప్రభావాలు బైరాగి కవితా దృక్పథంలో కనిపిస్తాయి. పోలిక తగదేమోకాని, ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం ఇంగ్లీషు కవిత్వంలో ఇలియట్ "వేస్ట్‌ల్యాండ్" కున్న స్థానం ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం తెలుగు కవిత్వంలో బైరాగి "నూతిలో గొంతుకలు"కు ఇవ్వవచ్చు ననిపిస్తుంది.

బైరాగి రాజకీయ దృక్పథంలో రాయిస్తు. కవిత్వంలో ఇజాలను మించిన నిజాలను అనవరతం అన్వేషించిన మానవతా వాది. ఆయన కవితలో నిరాశావాదం ఎక్కువ అనే అంచనాలో చాలవరకు నిజం వుంది. కాని, దాన్ని నిమర్శగా పరిగణించ నక్కరలేదు. ఆయనది ఆధునిక మానవుని అంతరాళ భయంకర ప్రాంతరాలకు అద్దంపట్టిన కవిత.

"కావున ఈ నిరాశామయ లోకంలో" నిలబడి శ్రీశ్రీ వలె కదన శంఖం పూరించలేదు బైరాగి. "తమసోమా జ్యోతిర్గమయ" అని ప్రార్థించిన ఉపనిషత్కవులవలె, "త్రోవ ఎక్కడ సోనియా ?" అని వేదనతో వేడుకున్న రాస్కోల్నికోవ్ వలె, "టు బి ఆర్ నాట్ టు బి" అని సందిగ్ధతాదగ్ధుడైన హామ్లెట్ వలె, జీవిత కురుక్షేత్ర మధ్యంలో కింకర్తవ్యతా విషాదయోగియై నిలబడిన అర్జునుడివలె, "ఎయిదర్/ఆర్" అనే మీమాంసలో పడిన కిర్క్‌గార్డ్ వలె, బైరాగి "అన్నీ వున్నాయి కాని, నమ్మక మొకటే లేదు—నాకొంచెం నమ్మకమివ్వు" అని ఎలుగెత్తి ఆక్రోశించిన సదసత్సంశయవాది అయిన ఉత్తమ కవి.

ఆయన మరణానంతరం లభించినా "ఆగమగీతి"కి జరిగిన పురస్కారం కవిత్వంలో రాజీలేని భావస్వాతంత్ర్యానికి, అవధులెరుగని మానవతావాదానికి జరిగిన గౌరవంగా తెలుగువారు సంతోషిస్తారు.

(జనవరి 9, 1985)

# సుందరయ్యగారు

కమ్యూనిజం, గాంధీయిజం పరిపడని సిద్ధాంతాలు. ఒకటి ఉత్తర ధ్రువం, మరొకటి దక్షిణ ధ్రువం.

మొన్న తన 72వ ఏట కన్నుమూసిన పుచ్చలపల్లి సుందరయ్యగారు కాకలు తీరిన కమ్యూనిస్టు యోధుడు. అయినా, ఆయన్ని పలువురు కమ్యూనిస్టుగాంధీగా పరిగణించేవారు. సిద్ధాంతాలలో ఆయన కరడుకట్టిన సామ్యవాది. వ్యక్తిగా మాత్రం పరమ సౌమ్యవాది.

బ్రతికి వుండగానే ఒక "లెజెండ్"గా—ఒక చారిత్రక మహావ్యక్తిగా—పరిగణన పొందేవారు చాలా అరుదుగా వుంటారు. సుందరయ్యగారు ఇప్పుడు కాదు, నలభై ఏళ్ళకు పైగా ఒక "లెజెండ్"గా ఆంధ్ర ప్రాంతంలో ప్రసిద్ధి పొందారు. ఆయన నిరాడంబరత, త్యాగగరిమ, స్నేహశీలం, దేశభక్తి, సాహస చర్యలు—ఇవన్నీ కథలు కథలుగా చెప్పుకునేవారు.

సుందరయ్యగారు ధనిక కుటుంబంలో జన్మించారు. అయినా, తన సర్వస్వం తన పార్టీకి ధారాదత్తం చేసి ఎంతో నిరాడంబర జీవితం గడిపారు.

రెడ్డి కులానికి చెందిన వారందరికి పేరు చివర కులనామం విధిగా వుంటుంది. కాని, సుందరయ్యగారు కులనామాన్ని తొలగించుకుని, అందరిచేత మొదటి నుంచి సుందరయ్యగానే పిలిపించుకున్నారు.

సంతానం కలిగితే ప్రజా సేవకు అడ్డు రావచ్చునని సుందరయ్యగారు యౌవన ప్రాయంలోనే సంతాన నిరోధక శస్త్ర చికిత్స చేయించుకున్నారు. ఈ అద్భుత త్యాగం సాక్షాత్తు మహాభారతంలోని భీష్మ ప్రతిజ్ఞను జ్ఞాపకం చేస్తుంది.

పార్లమెంటు సభ్యులు సాధారణంగా పార్లమెంటు భవనానికి కార్లలో వచ్చి పోతారు. సుందరయ్యగారు పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్ష నాయక పదవిలో వుండి కూడా పార్లమెంటు సమావేశాలకు సైకిల్‌పై వచ్చేవారట.

ఏ వూరు వెళ్ళి రైలు దిగినా, బస్సు దిగినా సుందరయ్యగారు తన లగేజీ తానే మోసుకునేవారు. తన బట్టలు తానే ఉతుక్కునే వారు. తాను పార్టీ అగ్రనాయకుడైనా, పార్టీ సభ్యులతో, కార్యకర్తలతో, అందరితో ఒకే విధంగా కలిసి మెలిసి, వారిలో ఒకరుగా మెలగేవారు; ఈ విధంగా, ఇంకా ఎన్నో విధాలుగా సుందరయ్యగారిని గురించి ప్రజలు కడచిన నలభై, ఏభై ఏళ్ళుగా చెప్పుకుంటున్న కథలలో ఆయన విశిష్ట, విలక్షణ వ్యక్తిత్వం ప్రస్ఫుటమవుతుంది.

గాంధీజీ వ్యక్తిత్వం,నాయకత్వం సుందరయ్యగారిని చిన్ననాటనే ఆకర్షించాయి. హైస్కూలు చదువుల రోజులలోనే జాతీయోద్యమంలోకి దూకారు. కాంగ్రెసు వాదిగా రాజకీయ జీవితం ప్రారంభించారు. మద్రాసులో సైమన్ కమీషన్ బహిష్కరణ ప్రదర్శనంలోను, ఆనాటి సత్యాగ్రహోద్యమాలలోను పాల్గొని, కారాగార శిక్షలు అనుభవించారు, క్రమంగా కమ్యూనిస్టు సిద్ధాంతాలచే ప్రభావితులయ్యారు. అప్పుడప్పుడే ఇండియాలో వేళ్ళూనుతున్న కమ్యూనిస్టుపార్టీకి ఆంధ్ర శాఖను స్థాపించినది సుందరయ్యగారే. ఆంధ్రలోనే కాదు, దక్షిణ భారతంలోని ఇతర ప్రాంతాలలో కమ్యూనిస్టు పార్టీ శాఖల స్థాపనలో కూడా ఆయన ప్రముఖ పాత్ర వహించారు. కొంతకాలం కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో కూడా ముఖ్య పాత్ర నిర్వహించారు. చివరకు శ్రీ జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వాన గల కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో తెగతెంపులు చేసుకుని ఆంధ్రలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికే ఆయన అంకితులయ్యారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధ ప్రారంభంలో బ్రిటిష్ ప్రభుత్వం కమ్యూనిస్టు పార్టీని నిషేధించి నప్పుడు సుందరయ్యగారు మూడేళ్ళపాటు అజ్ఞాత వాసంలో గడిపారు. ఆ తర్వాత కాలంలో తెలంగాణా సాయుధ విప్లవోద్యమానికి నాయకత్వం నెరపిన సమయంలో మరొకసారి అయిదేళ్ళపాటు అజ్ఞాతవాసం చేశారు.

ఆ తర్వాత కమ్యూనిస్టు పార్టీ పార్లమెంటరీ రాజకీయాలను చేపట్టినప్పుడు సుందరయ్యగారు మొదట రాజ్యసభ సభ్యుడుగానూ, ఆ తర్వాత కాలంలో శాసన సభ్యులుగాను, మంచి పార్లమెంటేరియన్‌గా కూడా రాణకెక్కారు, ప్రజాభిమానం చూరగొన్నారు. కమ్యూనిస్టు పార్టీ విధాన పరమైన విభేదాలవల్ల 1964లో రెండుగా చీలిపోయిన తర్వాత మార్క్సిస్టు పార్టీకి సుందరయ్యగారు ప్రధాన కార్యదర్శిగా పధ్నాలుగేళ్ళపాటు వ్యవహరించారు.

కమ్యూనిస్టు పార్టీ దేశవ్యాప్తంగా వున్నప్పటికీ, అది దేశంలో అన్ని రాష్ట్రాలలోను సమాన బలంతో లేదు. అది రెండుగా చీలిపోవడానికి ముందు కూడా ఏవో కొన్ని రాష్ట్రాలలో మాత్రమే బలంగా వుండేది. అలా బలంగా వున్న ప్రాంతాలలో పూర్వపు ఆంధ్రప్రాంతం ఒకటి. ఈ ప్రాంతంలో ఆ పార్టీకి దిగ్దంతుల వంటి నాయకులు పలువురున్నప్పటికీ, వారిలో ఏ ఒక్కరికైనా పార్టీ పటిష్ఠతకు అధిక ఘనత చెందవలసి వస్తే అది సుందరయ్యగారికే చెందడంలో అతిశయోక్తి లేదు. ఆయన నాయకత్వ విశిష్టత, నిర్మాణ దక్షత, అట్టడుగు వర్గాల ప్రజలలో ఆయన పట్ల అభిమానం అటువంటివి. 1955 నాటి మధ్యంతర ఎన్నికల సమయానికి కమ్యూనిస్టు పార్టీ దాదాపుగా రాష్ట్ర ప్రభుత్వాధికారాన్ని కైవసం చేసుకోవచ్చు నన్నంతవరకు బలపడడానికి సుందరయ్యగారి నాయకత్వం చాలావరకు కారణం.

రాజకీయంగా ఎవరి అభిప్రాయాలు ఎటువంటివైనప్పటికీ, అన్ని పార్టీలవారు సుందరయ్యగారిని గౌరవించేవారు, అమితంగా అభిమానించే వారు. వ్యక్తిగా ఆయన అజాత శత్రుత్వం, నైతికౌన్నత్యం ఇందుకు ప్రధాన కారణాలు. ఆయన మృతితో దేశం వెనుకటి తరానికి చెందిన ఒక గొప్ప ప్రజా నాయకుడిని కోల్పోయింది. కమ్యూనిస్టు ఉద్యమం పేదవడింది. ముఖ్యంగా మార్క్సిస్టు పార్టీకి ఇది తీరని లోటు. ఆయన స్మృతికి మా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము.

(మే 21, 1985)

# ఒక శతజయంతి

ఇరవైయవ శతాబ్దిలోని అగ్రశ్రేణి ఆంగ్ల నవలా రచయితలలో మొదటి అయిదారుగురిని పేర్కొనవలసి వస్తే వారిలో డి. హెచ్. లారెన్స్ పేరు విధిగా వుంటుంది. అలాగే ఈ శతాబ్దిలో అత్యంత వివాదాస్పదుడైన ఆంగ్ల రచయిత ఎవరని ప్రశ్నిస్తే మొదటగా జ్ఞాపకం వచ్చేది డి. హెచ్. లారెన్స్ పేరే.

సరిగా నూరేళ్ళనాడు ఈనాడు (1885 సెప్టెంబర్ 11) డి. హెచ్. లారెన్స్ ఇంగ్లండులోని నాటింగ్‌హామ్‌షైర్‌లో జన్మించాడు. అతని తండ్రి బొగ్గుగని కార్మికుడు. తాను స్వయంకృషితో పెద్ద చదువులు చదువుకున్నాడు. మొదట కొన్నాళ్ళు ఉపాధ్యాయుడుగా పని చేశాడు. తర్వాత పూర్తిగా రచనా వృత్తిని అవలంబించాడు. తనకు చదువు చెప్పిన ప్రొఫెసరు భార్య ఫ్రీడా వీక్లీని లేవదీసుకుపోయి వివాహం చేసుకున్నాడు. ఆమె అతనికి జీవితాంతం తోడు నీడగా నిలిచింది.

లారెన్స్ మొదటి నుంచి ఆరోగ్యరీత్యా అర్భకుడు. అతడు జీవించింది 45 సంవత్సరాలే. ఆ స్వల్ప కాలంలోనే అతడు పుంఖానుపుంఖంగా నవలలు, నవలికలు, కథలు, నాటకాలు, కవితలు, వ్యాసాలు, యాత్రా గ్రంథాలు, విమర్శా గ్రంథాలు, లేఖలు లోకంమీదికి గుప్పించాడు.

లారెన్స్ నవల లన్నింటిలోకి గొప్పవిగా దాదాపు అతని స్వీయ జీవితమే ఇతివృత్తంగా గల సన్స్ అండ్ లవర్స్, రెయిన్‌బో, వుమెన్ ఇన్ లవ్—ఈ మూడింటిని విమర్శకులు పేర్కొంటారు. కాని, వీటితో సరిసమానమైనదిగా పోల్చ దగిన నవల—లారెన్స్ పేరు చెప్పగానే అందరికీ జ్ఞాపకం వచ్చే నవల—"లేడీ చాటర్లీస్ లవర్." ఆయన తొలి రచనలలో ఒకటైన "రెయిన్ బో"కు వలెనే మలి రచనలలో ఒకటైన "లేడీ చాటర్లీస్ లవర్"ను కూడా బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. దాన్ని బ్రిటన్‌లో ప్రచురించడానికి వీలులేక ఇటలీలో 1928లో లారెన్స్ ప్రచురించాడు.

దాని నిండా యథాతథంగా అశ్లీల పదాలు, అశ్లీల సన్నివేశాలు వుండటం ఇందుకు కారణం. చాలాకాలంపాటు ఆ నవల సెన్సార్ చేయబడిన రూపంలో బహిరంగంగాను, యథాతథంగా చాటుగాను మాత్రమే లభించేది. ఆయన చనిపోయిన తర్వాత చాలాకాలానికి 1960లో మాత్రమే దానిపై బ్రిటిష్ ప్రభుత్వం నిషేధం తొలగించింది.

అయితే, డి.హెచ్.లారెన్స్ కేవలం పాఠకులకు గిలిగింతలు పెట్టడం కోసమే అశ్లీలపదాలు వాడలేదు, అశ్లీలసన్నివేశాలు కల్పించలేదు. అతని జీవన వేదాంతంలోనే సెక్సుకు ప్రధాన స్థానం వున్నది. మడి కట్టుకున్నట్టుండే విక్టోరియన్ సాహిత్యంపై తిరుగుబాటుదారు డి. హెచ్. లారెన్స్. అతడిని ఇరవైయవ శతాబ్దపు రూసోగా పరిగణించవచ్చు. ఆధునిక నాగరికతను, దానిలోని కృత్రిమత్వాన్ని, యాంత్రికత్వాన్ని, మర్యాద ముసుగు వేసుకున్న కుళ్ళును, కాపట్యాన్ని బట్టబయలు చేసి, ప్రక్షాళన చేయడానికి ఒక సాధనంగా అతడు తన సాహిత్యాన్ని ఉపయోగించాడు. మానవుడు కృత్రిమమైన సాంఘిక నియమాల శృంఖలాలను ఛేదించుకుని, నిసర్గ, నగ్న మానవత్వంతో పరిపూర్ణ జీవితం గడపాలని, అప్పుడే అతని మానవత్వానికి సాఫల్యమని లారెన్స్ విశ్వాసం.

మన చలంగారికి, లారెన్స్‌కు కొన్ని పోలికలున్నాయనిపిస్తుంది. ముఖ్యంగా సంఘం వ్యక్తులపై విధించే అర్థంలేని కట్టుబాట్లు, వాటి వెనుక వున్న దగా, మోసం, అవినీతి, కుళ్ళును లారెన్సువలె చలం కూడా నిరసించినందువల్ల ఈ పోలిక కొంత వరకు సమర్థనీయం కావచ్చు. చలంగారి రచనలలో అక్కడక్కడ లారెన్సు ప్రసక్తి కూడా వస్తుంది. కాని, తనపై లారెన్సు ప్రభావం లేదని చలంగారు చెప్పినమాట నిజమే కావచ్చు. నిజానికి చలంగారు వ్రాయడం మొదలు పెట్టేనాటికి లారెన్స్ రచనలు తెలుగువారి ప్రచారంలోకి వచ్చాయో, లేదో అనుమానమే. ఏమైనా లారెన్స్ తన కాలపు తన సమాజంమీద తిరుగుబాటు చేసినట్టే చలం తన కాలపు మన సామాజిక పరిస్థితులమీద తిరుగుబాటు చేశారన్నది మాత్రం నిజం.

సుమారు అర్ధ శతాబ్దంనాడు లారెన్స్‌ను పలువురు ఆధునిక ప్రవక్తగా ఆరాధించేవారు. టి.ఎస్.ఇలియట్ తర్వాత ఇంగ్లీషు కవిత్వ స్వరూపం మారిపోయినట్టు లారెన్స్ కారణంగా ఆధునిక ఆంగ్లనవలా సాహిత్యం రూపురేఖలు మారిపోయాయి. ఈ శతజయంతి సంవత్సరంలో అతని రచనలపై తిరిగి ఆసక్తి పెరిగే అవకాశం లేకపోలేదు.

(సెప్టెంబరు 11, 1985)

# భూమికి దూర బంధువు

"దూరబంధువు ఇతడు భూమికి
దారి బోవుచు చూడవచ్చెను
డెబ్బదెనుబది ఏండ్ల కొకపరి
వరుల కన్నుల పండువై"

అది నేటికి 75 సంవత్సరాలనాడు మహాకవి గురజాడ తన "ముత్యాలసరములు"లో వర్ణించిన తోకచుక్క మరొకసారి తన దూరబంధువైన భూమిని పలకరించడానికి హుటాహుటిగా వస్తున్నది.

అది భూమికి దూరబంధువైతే భూమాత పుత్రులమైన మనకు కూడా ఆ తోకచుక్క దూరబంధువే. ప్రస్తుతం ఆ తోకచుక్క భూమికి 43 కోట్ల కిలోమీటర్ల దూరంలో గురు, అంగారక గ్రహాల మధ్య రోదసిలో వున్నది. దాన్ని ఇప్పటికే జపాన్ శాస్త్రవేత్తలు టెలిస్కోపులతో చూశారు. ఇప్పుడు భారతీయ శాస్త్రవేత్తలు కూడా రెండుసార్లు టెలిస్కోపులతో చూసి ఫోటోలు తీశారు.

మరికొన్ని నెలలలో దాన్ని టెలిస్కోపులు లేకుండానే నేరుగా కంటితోనే చూడవచ్చు. వచ్చే జనవరినాటికి అది బాగా ప్రకాశమానంగా కనబడుతుందట. మహాకవి వర్ణించినట్టు "వలువ నేరిమి కంతు యిది యన/నింగి తొడవయి వెలుచున్" — మనకు అది దర్శనమిస్తుంది.

ఆకాశంలోకెల్లా అందమైన, అద్భుతమైన, అరుదైన మహాదృశ్యంగా కవబడ బోయే ఆ తోకచుక్క పేరు "హేలీస్ కామెట్". కొన్ని వందల కోట్ల ఏళ్ళుగా అది భూమిని పలకరించడానికి వస్తూనే వున్నది. మానవ సృష్టి జరిగిన తర్వాత దాన్ని ప్రతి 75—76 సంవత్సరాల కొకసారి ఎవరో ఒకరు చూస్తూనే వుండి వుంటారు. కనీసం క్రీస్తుపూర్వం 240 నాటి నుంచి మానవులు దాన్ని గమనిస్తున్నారనడానికి చారిత్రకమైన దాఖలాలున్నాయి. ముఖ్యంగా చైనీస్ ఖగోళ వేత్తలు నాటి నుంచి వరుసగా చూస్తూ నమోదు చేస్తున్నారు. క్రీస్తు జనన సమయంలో తూర్పున సాక్షాత్కరించిన "స్టార్ ఆఫ్ బెతెల్‌హెమ్" అదేనని ప్రతీతి. క్రీస్తుశకం 1066లో విలియం ది కాంకరర్ ఇంగ్లండును హేస్టింగ్స్ యుద్ధంలో జయించినపుడు ఆ తోకచుక్క కనబడిందని అంటారు. కెప్లర్ 1607లో దాన్ని స్వయంగా తిలకించాడు. ఆ నాటి నుంచి శాస్త్రవేత్తలు దాన్ని తిలకించడమే కాక, పరిశోధనలు చేస్తూనే వున్నారు.

అయితే, అన్ని వందల ఏళ్ళుగా వివిధ దేశాలలో ఎవరో ఒకరు చూసి నమోదు చేస్తున్న తోకచుక్క ఒకటేనని, అది 75—76 ఏళ్ళకొకసారి భూమికీ, సూర్యునికి సమీపంగా వస్తున్నదని 17వ శతాబ్దిలో మొదటిసారిగా కనుగొన్న ఇంగ్లీష్ శాస్త్రవేత్త ఎడ్మండ్ హేలీ. ఆయన పేరు మీదుగానే దానికి హేలీస్ కామెట్ అనే పేరు వచ్చింది.

ఆ తర్వాత అంతకంతకు పదునుదేరుతున్న శాస్త్రీయ పరికరాలతో హేలీ తోకచుక్కను శాస్త్రవేత్తలు పరిశోధిస్తున్నారు. క్రిందటిసారి అది 1910లో దర్శన మిచ్చినప్పుడు దాన్ని అప్పటికి లభ్యమైన శక్తిమంతమైన టెలిస్కోపులలో చూసి ఛాయా చిత్రాలు తీశారు.

ఇప్పుడు మరి 75 సంవత్సరాలు గడిచాయి. ఈ మధ్య కాలంలో అనాటి వారు కనీసం ఊహించనైనా ఊహించలేనంతటి అద్భుతావహమైన అత్యాధునిక శాస్త్రీయ పరికరాలు వచ్చాయి. వీటి సహాయంతో హేలీ కామెట్‌ను దేశ దేశాల శాస్త్రవేత్తలు పరిశోధించబోతున్నారు.

కేవలం భూమిపై గల వేధశాలల నుంచే కాదు, ధూళి ధూసరిత వాతావరణపు పొరల తెరల అవరోధాలేమీలేని రోదసిలో నుంచి కూడా బ్రహ్మాండమైన

టెలిస్కోపులతో దాన్ని చూడబోతున్నారు. అంతే కాదు. భూమికి అత్యంత సమీపానికి వచ్చినప్పుడు, సూర్యుడికి ఒక ప్రదక్షిణం చేసి తిరిగి తన దారిన తాను పోతున్నప్పుడు ఆ తోకచుక్కను కలుసుకొని పరిశోధనా ఫలితాలను రేడియో సంకేతాల ద్వారా భూమికి ప్రసారం చేయడానికిగాను అమెరికా, రష్యా, జపాన్, పశ్చిమ యూరప్ దేశాల అంతరిక్ష సంస్థలు రోదసీ నౌకలను ఇప్పటికే ప్రయోగించాయి కూడా. ఈ నౌకలు వచ్చే మార్చిలో హేలీ తోకచుక్క తోకలో నుంచి దూసుకుపోనున్నాయి.

మామూలుగా కంటికి కనబడే తోకచుక్కలు అరుదైనప్పటికీ, కంటికి కాక టెలిస్కోపులకు మాత్రమే కనబడే తోకచుక్కలు ఎప్పుడూ భూమి సమీప కక్ష్యల లోనికి వస్తూనే వుంటాయి. అయిదారేళ్ళకే తిరిగి వచ్చేవి కొన్ని, అయిదారు వందల ఏళ్ళకు, లేదా అయిదారు వేల ఏళ్ళకు తిరిగి వచ్చేవి కొన్ని, ధగ ధగ మెరిసేవి కొన్ని, మినుకు మినుకు మనేవి కొన్ని, ఒక తోక కలిగినవి కొన్ని, రెండు, మూడు, లేదా ఏడు తోకలు కలిగినవి కొన్ని, పొట్టి తోకలు కలిగినవి కొన్ని, కొన్ని కోట్ల మైళ్ళ పొడుగు తోకలు కలిగినవి కొన్ని—ఇలా ఎన్నో రకరకాల తోకచుక్కలు ఆకాశ వీథులలో అందంగా విహరిస్తూనే వుంటాయి.

అన్నిటిలోకి ప్రకాశమానమైనది, దర్శనీయమైనది హేలీ తోకచుక్క. ఇప్పటికే తోకచుక్కల గురించి ఎంతో సమాచారం శాస్త్రవేత్తలు సేకరించారు. కాని, హేలీ తోకచుక్కను సమీపం నుంచి ఆధునిక పరికరాల ద్వారా పరిశోధిస్తే మరెంతో అమూల్యమయిన సమాచారం తెలియగలదని శాస్త్రవేత్తల విశ్వాసం. తోకచుక్కలు భూమికి నిజంగా బంధువులేనా? అంటే, సూర్యుడు, గ్రహాలు, ఉపగ్రహాలు, యాస్టిరాయిడ్స్ మొదలైన వాటివలె, వాటితో పాటే, వాటి వాయు—ధూళి పదార్థంతోనే ఏర్పడ్డాయా? వాటి తలలోని న్యూక్లియస్‌లో ఏమున్నది? భూమిపై జీవోత్పత్తికి తోకచుక్కల నుంచి జారిపడిన రసాయన పదార్థాలు తోడ్పడ్డాయా? అసలు సౌర గ్రహ వ్యవస్థ ఎప్పుడు, ఎలా ఏర్పడింది?- మొదలైన ప్రశ్నలకు హేలీ తోకచుక్క పరిశోధన దోహదం చేయవచ్చునట.

ఒకప్పుడు తోకచుక్క అంటే మానవులకు ఎంత కలవరపాటు, ఎన్ని మూఢ భయాలు? తోకచుక్క వస్తే యుద్ధాలో, భూకంపాలో, జల ప్రళయాలో, వ్యాధులో, కనీసం ఏ మహావ్యక్తి మరణమో తప్పదని భయపడేవారు. గ్రహ పూజలు, శాంతులు

చేయించేవారు. ఈ మూఢ విశ్వాసాలు అన్ని దేశాలలోను వుండేవి. ఈ మౌఢ్యాన్నే గురజాడ అప్పారావుగారు-

"అరుదుగా మినుచప్పరంబున
చొప్పు తెలియని వింత పొడమగ
చన్నకాలపు చిన్నబుద్ధులు
బెదరి ఎంచిరి కీడుగా"

అని తన "ముత్యాల సరములు" గీతంలో ఈసడించారు.

"తెగులు కిరవని కతల నమ్ముచు
దిగులు చెందుటదేటి కార్యము?
తలతునేనిది నవమ సంస్కార
ఋ ప్రయాణ పతాకగాన్"

అని ఉత్ప్రేక్షించారు.

ఈసారి హేలి తోకచుక్క పునర్దర్శన సందర్భంలో 76 ఏళ్ళనాటి మూఢభయాలు ఎక్కడా పొడచూపబోవనే ఆశించాలి. ఎందుకంటే అనాటికి. ఈనాటికి ప్రపంచం ఎంతో ముందుకు పోయింది. మానవులు ఎన్నో ప్రకృతి రహస్యాలను ఛేదించారు. చంద్రమండలంపై కాలూనడమే కాదు, ఇంకా సుదూర గ్రహాల యాత్రలకు పథకాలు రూపొందిస్తున్నారు. మరొకవైపు "కన్ను కానని వస్తుతత్వము కాంచు నేర్పుతో"— పరమాణు స్వరూపాన్ని, జీవసృష్టి విధానాన్ని అవగతం చేసుకోవడానికి— ప్రయత్నిస్తున్నారు.

శాస్త్ర విజ్ఞానం ఇంతగా పురోగమించినా, ఇప్పటికీ కేతువులనీ, ధూమకేతువులనీ బెదిరిపోయే వారుంటే చేయగలిగిందేమీ లేదు. అయితే, అలా బెదిరిపోయే వారి కంటె, అలా బెదరగొట్టి ప్రజలను అజ్ఞానాంధకారంలోనే మిగిల్చి ప్రయోజనం పొందజూచేవారే ఎక్కువ ఖండనార్హులు. ఈ సందర్భంలో క్రిందటిసారి సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించి నప్పుడు ప్రజలలో కొందరు వ్యాపింపచేసిన భయాందోళనం హాస్యాస్పదత్వాన్ని ఒకసారి జ్ఞాపకం చేసుకోవడం మంచిది.

(సెప్టెంబర్ 15, 1985)

# గురువుకాని గురువు

అది 1948వ సంవత్సరం. జిడ్డు కృష్ణమూర్తి పదేళ్ళ విరామం తర్వాత ఇండియా వచ్చారు. మద్రాసులో నుంగంబాకంలోని ఒక మిత్రుని గృహంలో విడిది చేశారు. ఆవరణలో పెద్ద పందిరి నిండా అభిమానులు, ఎదురుగా ఎత్తయిన వేదిక మీద సిల్కు లాల్చీ, తెల్లని పైజమా ధరించి కృష్ణమూర్తి కూర్చుని వున్నారు.

అప్పటికి ఆయన వయస్సు 52—53 సంవత్సరాలు. వయస్సు ముదిరిన లక్షణాలు గోచరిస్తున్నా వర్చస్సు తగ్గని ఆకర్షణీయమయిన ముఖం, తేజస్సు తగ్గని విశాల విస్ఫారిత నేత్రాలు. స్ఫుటంగా, స్వచ్ఛంగా వినబడే మంద్ర గంభీర కంఠం.

ఆయన తాను చెప్పదలచిన విషయాలు ముందుగా ప్రసంగ రూపంలో చెబుతారు. తర్వాత శ్రోతల నుంచి ప్రశ్నలను ఆహ్వానిస్తారు. కొందరు లేచి నిలబడి అడిగితే, కొందరు చీటీలపై వ్రాసి ప్రశ్నలు పంపిస్తారు. అన్నిటికీ ఓపికగా సమాధానా లిస్తారు. సందేహాలు ఒక స్థాయిలో వుంటే ఆయన సమాధానాలు మరొక స్థాయిలో వుంటాయి. ఆయన సమాధానాలు ఒక్కొక్కసారి తేలికగా అర్థంకావు, సంతృప్తి

వరచవు. మళ్ళీ మళ్ళీ వాటిని మననం చేయాలి. అందుకే అడిగిన ప్రశ్నలే అడుగు తున్నట్టు, చెప్పిన సమాధానాలే వేరే మాటలలో తిరిగి చెబుతున్నట్టు అనిపిస్తుంది. పృచ్ఛకుడు తన ప్రశ్నకు సమాధానాన్ని తానే కనుగొనేటట్టు చేయడానికి కృష్ణ మూర్తి ప్రయత్నిస్తున్నట్టు వుంటుంది. ఏథెన్సు నగర వీధులలో "ఏది సత్యం, ఏదసత్యం, ఏది నిత్యం, ఏదనిత్యం, ఏది సౌందర్యం, ఏది కాదు....ముందు నీ నిర్వచనం చెప్పు...." అంటూ వారిని వీరిని నిలదీసి, సదసత్సంశయాలను లేకెత్తిస్తూ సమకాలిక సమాజ రుగ్మతలను కడిగేస్తూ తిరిగిన సోక్రటీస్ జ్ఞాపకం వస్తారు. మద్రాసులో ఆయన వున్నన్నినాళ్ళు ప్రతిరోజూ అదే దృశ్యం, అదే సన్నివేశం.

ఆ తర్వాత జిడ్డు కృష్ణమూర్తి ఎన్నోసార్లు ఇండియా వచ్చారు. ఎప్పుడు వచ్చినా మద్రాసు రాకుండా, మదనపల్లి వద్ద ఋషీవ్యాలీ వెళ్ళకుండా వుండరు. స్థలం మారవచ్చు, కాలం మారవచ్చు, శ్రోతలు మారవచ్చు. కాని, అవే సమావేశాలు, ప్రసంగాలు. అవే ప్రశ్నలు, సమాధానాలు, సోక్రాటిక్ డయలెక్టికల్ పద్ధతిలో అవే వాగ్వాదాలు. కడచిన నలభై ఏళ్ళుగా ఆస్ట్రేలియా వెళ్ళినా, యూరోపియన్ దేశాలు వెళ్ళినా, అమెరికాలో వున్నా, ఇండియా వచ్చినా కృష్ణమూర్తి దినచర్యలో ఈ విధమైన సమావేశాలు, సన్నివేశాలు ప్రధానమైన భాగం. ఆయన ప్రసంగాలు, ప్రశ్నోత్తరాలు ఏడు వందలకు పైగా పుస్తకాల రూపంలో వెలువడ్డాయి. అంత దీర్ఘకాలం, అంత నిర్విరామంగా ప్రపంచ పర్యటన చేస్తూ దేశ దేశాలలో తన సందేశం వినిపించిన తత్వవేత్త మరొకరు లేరనడం అతిశయోక్తి కాదు.

ఇకపై ఆయన సందేశం ప్రత్యక్షంగా వినే అదృష్టం శ్రోతలకు కలగదు. ఆయన రూపం ప్రత్యక్షంగా దర్శించే అవకాశం కలగదు. ఆయన కంఠం శాశ్వతంగా మూగవోయింది. తొంభై ఏళ్ళుగా లోకాన్ని, లోకం వెనుక దాగిన సత్యాన్ని నిరంతరం అన్వేషించిన ఆయన విశాల నేత్రాలు శాశ్వతంగా మూత పడ్డాయి. ఏ హేలీ తోకచుక్కనో అధిరోహించి ఎన్నటికి తిరిగిరాని ఏ అజ్ఞాత, సుదూర లోకాలకో ఆయన శాశ్వతంగా పయనమై వెళ్ళిపోయారేమో ననిపిస్తుంది.

ఆయన ఎన్ని దేశాలలో, ఎన్ని వేలసార్లు ఎన్ని వేల ప్రసంగాలు చేశారో, ఎన్ని ప్రశ్నలకు సమాధానాలు చెప్పారో లెక్క లేదు. అన్నిటి సారాంశం ఒకటే: ప్రపంచంలోకి మానవుడు ఏకాకిగా వస్తాడు, ఏకాకిగా పోతాడు. ఈ మధ్యలో జాతులు, కులాలు, మతాలు, భాషలు, రకరకాల విశ్వాసాలు పెంచుకుని, తన చుట్టూ

గోడలు కట్టుకుంటాడు. ఆ గోడల వల్ల అతడు అసలు సత్యం చూడలేక పోతాడు. ఎవరి చేయూతనో అర్థిస్తాడు. వేదాలనో, ఉపనిషత్తులనో, భగవద్గీతనో, మరొక మత గ్రంథాన్నో సహాయం అడుగుతాడు. ఏ స్వామీజీనో, బాబానో, మత ప్రవక్తనో, మతాచార్యుడినో గురువుగా ఆశ్రయిస్తాడు.

ఇదంతా వృథా. వృథాయే కాదు. దగా. అంతా మోసం, వంచన, దోపిడీ. సత్యాన్వేషణకు ఇది మార్గం కాదు. ఎవరూ ఎవరినీ ఉద్ధరించలేరు. ఏ మతం, మఠం, పీఠం, విశ్వాసం ఏదీ సత్యదర్శనం చేయించలేదు. వీటిని నమ్ముకోవడం కానని వాడు కానని వాడిని ఊతగొనడం వంటిది. ఎవరికి వారే సత్యాన్ని అన్వేషించాలి. ఎవరికి వారే సత్యాన్ని కనుగొనాలి. ఏ గురువూ ఎవరికీ మార్గదర్శి కాలేడు. ఎప్పుడు, ఎక్కడ, ఎన్నిసార్లు చెప్పినా కృష్ణమూర్తి సందేశ సారాంశం ఇదే.

జిడ్డు కృష్ణమూర్తిని చిన్ననాట దివ్యజ్ఞాన సమాజం నాయకులైన లెడ్ బీటర్, అనీ బిసెంట్ చూసి, ఆ ముఖ వర్చస్సుకు, తేజస్సుకు ముగ్ధులై ఆయనను అపర బుద్ధుడుగా, అభినవ కృష్ణుడుగా, మెసయాగా, మహా ప్రవక్తగా ప్రపంచానికి చాటారు. ఆయనను జగద్గురువుగా చేయడానికి ప్రయత్నించారు. ఆయన నిజంగానే తనలో వారు చెప్పిన అలౌకిక లక్షణాలు, దివ్యజ్ఞాన సమాజంవారు విశ్వసించే "ఆక్కల్ట్" (తాంత్రిక) శక్తులు, సిద్ధులు కలవనే కొంతకాలం విశ్వసించారు.

కాని, చివరికి తాను అప్పటి వరకు చెప్పింది, చేసింది, నమ్మింది అంతా మోసమని ఆయన గ్రహించి, 1928-30 ప్రాంతాలలో దివ్యజ్ఞాన సమాజానికి రాజీనామా ఇచ్చారు. జగద్గురు పీఠాన్ని పరిత్యజించారు. అత్యుచ్ఛ దశలో వుండగా ఆ విధంగా బంగారు పంజరం నుంచి బయట పడడానికి చాలా ధైర్యం కావాలి, సాహసం కావాలి.

బహూశా తనను జగద్గురువుగా ప్రకటించి ప్రపంచాన్ని దగాచేయడానికి జరిగిన ప్రయత్నం వల్ల జుగుప్సా భావంతోనే జిడ్డు కృష్ణమూర్తికి అసలు గురువు అనే భావం వల్లనే వ్యతిరేకత కలిగి వుండాలి. మతాలు, మఠాలు, గురుపీఠాలు, వేదాలు, శాస్త్రాలు, ఇతర ప్రామాణిక గ్రంథాలు అన్నీ బూటకాలని ఆయన తిరస్కరించారు.

ఆయన ప్రసంగాలలో తరుచుగా వినవచ్చేటకమాట "అవేర్‌నెస్"—ఎరుక. బాహ్యంగానూ, అంతరికంగాను అన్నిటిని జాగ్రత్తగా, నిశితంగా కనిపెట్టి వుండు. ఏ

ఒక్క చర్యను, ఆలోచనను, భావాన్ని, అనుభవాన్ని వదిలిపెట్టకు. అన్నిటిని పరిశీలించు. వాటి వెనుక, నీ మనస్సు వెనుక, అన్నిటికి వెనుక ఏమున్నదో అన్వేషించు. నిన్ను నీవు తెలుసుకోవడమే సత్యాన్ని తెలుసుకోవడం. ఒకనాడు డెల్ఫీ ఆలయంలోని దేవత సోక్రటీజ్‌కు చెప్పింది అదే: Know thyself—నిన్ను నీవు తెలుసుకో." కాని అలా తెలుసుకోవడానికి ఒకరు ఒకరికి సహాయం చేయలేరు. ఒకరి అనుభవం మరొకరిది కానేరదు. ఒకరి దృక్కోణం మరొకరిది కాజాలదు. అందు వల్లనే ఒకరి సమస్యను ఒకరు పరిష్కరించలేరు. ఒకరు మరొకరికి మార్గం చూపలేరు. అన్ని మార్గాలను తరచి చూసి, మన మార్గాన్ని మనం ఎంచుకోవాలి. మరొకరి మార్గాన్ని అనుసరించడం వల్ల ప్రయోజనం లేదు. ఎవరి సత్యాన్ని వారు స్వయంగా సందర్శించవలసిందే. ఒక చిక్కు సమస్య ఎదురైనప్పుడు ఎవరి నిర్ణయం వారు చేయవలసిందే. కృష్ణమూర్తి బోధలలో అక్కడక్కడ కీర్క్ గార్డ్, సార్త్రి వంటి అస్తిత్వవాదుల ఛాయలు కనిపించడానికి కారణం ఇటువంటి భావాలే.

ఆయన భావాలు చాలా సందర్భాలలో సులభంగా కొరుకుడు పడవు. అయినా, వాటిలో ఏదో ఆకర్షణ వుంది. "ఏదియొ అపూర్వ మధుర శక్తి స్ఫురియించుగాని, అర్థమ్ము కాని భావ గీతమ్ములవి...." అన్నట్టుగా ఆయన భావాలు మనల్ని వింతగా ఆకర్షించి వశపరచుకుంటాయి.

ముఖ్యంగా — ప్రపంచంలోని ప్రతి విషయం పట్ల ఎరుక పెంపొందించుకుని నీ నిర్ణయం నీవు చేసుకో. ఎవరినీ గుడ్డిగా అనుసరించకు, ఆరాధించకు — అని జిడ్డు కృష్ణమూర్తి చేసిన ప్రబోధం వ్యక్తి స్వాతంత్ర్యానికి ఎత్తిన పీఠాణిమం వంటిది.

ఆయన ఈ శతాబ్దపు భారతీయ మహాపురుషులలో ఒకరు. ఆయన తాను గురువును కాను అంటూనే గురువుగా, దేశికుడను కాను అంటూనే దేశికుడుగా 90 ఏళ్ళ పరిపూర్ణ జీవితం జీవించారు. తమను తాము భగవాన్లుగా, జగద్గురువులుగా, అవతార పురుషులుగా వర్ణించుకునేవారు కోకొల్లలుగా పుట్టుకు వస్తున్న ఈ రోజులలో నేను గురువును కాదు, సామాన్యుడిని, నా మాటలు మీరు విశ్వసించ నక్కరలేదు, మీకు మీరు ఆలోచించి, మీ నిర్ణయాలు మీరు చేయండి, మీ మార్గం మీరు అనుసరించండి అని, వెన్నుతట్టి ధైర్యం చెప్పే మహామనీషి జిడ్డు కృష్ణమూర్తి స్మృతికి జోహార్లు.

(ఫిబ్రవరి 19, 1986)

## ప్రతిభాశాలిని

క్రిందటి సోమవారంనాడు ఒక మహావ్యక్తి 91 ఏళ్ళ పరిపూర్ణ జీవితం గడిపి అస్తమించారు. ఈ సోమవారం నాడు మరొక ధన్యజీవి శాశ్వతంగా కన్ను మూశారు.

మొదటివారు విఖ్యాత తత్వవేత్త జిడ్డు కృష్ణమూర్తి. రెండవ వారు ప్రఖ్యాత నర్తకీమణి రుక్మిణీ అరండేల్.

ఇరువురు ఒకరి నొకరు బాగా ఎరిగిన వారు, సన్నిహితులు, సమకాలికులు, ఒకనాడు థియొసాఫికల్ సొసైటీలో ప్రముఖ సభ్యులు. ఆనీ బిసెంట్, లెడ్‌బీటర్‌ల ప్రభావానికి లోనై జీవితం ప్రారంభించిన వారు. అయితే, జిడ్డు కృష్ణమూర్తి త్వరలోనే థియొసాఫికల్ సొసైటీతో సంబంధాలు త్రెంచుకోగా, రుక్మిణీదేవి చివరి వరకు ఆ సంఘానికి సన్నిహితంగా మెలగినవారు.

అయితే, రుక్మిణీదేవి ప్రఖ్యాతి థియొసాఫికల్ సొసైటీతో ఆమె సంబంధ బాంధవ్యాలపై ఆధార పడినట్టిది కాదు. ఆమె స్వయంగా కళామూర్తి, కళా తపస్విని, ప్రపంచ ప్రఖ్యాత నర్తకి, నాట్యాచార్యురాలు, విద్యావేత్త్రి, సంఘ సేవకురాలు.

మద్రాసు నగరం ఒకప్పుడు సమష్టి మద్రాసు రాష్ట్రానికి, ఇప్పుడు తమిళ నాడుకు రాజకీయ రాజధాని మాత్రమే కాదు, అంతకన్న మిన్నగా సాంస్కృతిక రాజధాని కూడా. రుక్మిణీ అరండేల్ సుమారు ఆరు దశాబ్దాలుగా మద్రాసు నగర సాంస్కృతిక జీవితంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన అగ్రశ్రేణి కళా కోవిదురాలు. ఉదయశంకర్ ఆల్మోరాలో నృత్య, నాటక, సంగీత కళాశాల స్థాపించి పెక్కేళ్ళు విజయవంతంగా నిర్వహించినట్టే, రుక్మిణీదేవి కూడా అడయారులో "కళాక్షేత్ర" స్థాపించి, అవితర సాధ్యమైన రీతిలో నృత్య, నాటక, సంగీత కళా త్రయానికి సేవ చేశారు. ఒకప్పుడు ఉదయశంకర్ రష్యన్ నర్తకి అనా పావ్లోవా

బృందంలో చేరి ఆమె రాధగా, తాను కృష్ణుడుగా ప్రపంచమంతటా నృత్య ప్రదర్శన లిస్తూ సంచరించినట్టు రుక్మిణీదేవి కూడా కొంతకాలం అనా పావ్లోవా అంతే వాసినిగా, ఆమె బృంద సభ్యురాలుగా తిరిగారు.

అగ్రకులాలు అనబడే వాటికి చెందిన స్త్రీలు రంగస్థలంపై నాట్యం చేయడం నిషిద్ధంగా వుండే రోజుల్లో రుక్మిణీదేవి తనవారందరిని ఎదిరించి నృత్య జీవితం ప్రారంభించింది. తన వరహోదరన ఏంటే తన కంటె ఎంతో పెద్దవాడు, విదేశీయుడు అయిన డాక్టర్ జార్జి అరండేల్‌ను పెండ్లాడి మహాకహరి సంఘం కట్టడిని ధిక్కరించింది. ఈ వ్యక్తిగత సాహసంతోనే నరిపుచ్చుకుండా ఆమె ఆ కాలంలో ప్రచారంలో వున్న అనేక నృత్య సంప్రదాయాలలోని మంచి లక్షణాలను మాత్రమే స్వీకరించి, ఎబ్బెట్టుగా తోచే వాటిని తిరస్కరించి, ఎందరు ఛాందసులు ఎంతగా విమర్శించినా భరతనాట్య కళలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకు వచ్చింది; దాన్ని సంప్రదాయ విరుద్ధం చేయకుండానే, ఆధునిక అభిరుచులకు అను గుణంగా తీర్చిదిద్దింది. తన కళాక్షేత్రలో వేలాది శిష్యులకు, శిష్యురాండ్రకు. గత అర్ధ శతాబ్దంలో శిక్షణ ఇచ్చి కళాదానం చేసింది. పావ్లోవా దగ్గర నేర్చుకున్న "బ్యాలే" నృత్య నాటక శైలి ప్రభావంతో ఆమె తమిళం, తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలో ఎన్నో నృత్య నాటికలు రూపొందించింది. కళాక్షేత్ర బృందాలు ప్రదర్శించిన స్వాతి తిరునాళ్ విరచిత అజామిళోపాఖ్యానం, ఆండాళ్ చరితం, బుద్ధ అవతారం, దమయంతీ స్వయంవరం, గీతగోవిందం, కుచేలోపాఖ్యానం, కుమార సంభవం, శాకుంతలం, చూడామణి ప్రదానం, భీష్మ, లైట్ ఆఫ్ ఏషియా, రుక్మిణీ కళ్యాణం, ఉషా పరిణయం—ఒకటేమిటి, ఇంకా ఎన్నో, ఎన్నెన్నో రుక్మిణీ దేవి రూపొందించిన అద్భుత నృత్య నాటకాలు మద్రాసు పౌరులకు కొన్ని దశాబ్దాలుగా సుపరిచితాలు.

మద్రాసు సాంస్కృతిక జీవనంలో రుక్మిణీ అరండేల్ విడదీయరాని [illegible]గం. కళాక్షేత్ర లేని మద్రాసును ఊహించలేము. అలాగే రుక్మిణీదేవి లేని క[illegible] ఊహించడం కూడా కష్టం. అయినా, ఒక సువ్యవస్థితమయిన కళా సంస్థను ఆమె [illegible] వారసత్వంగా మిగిల్చి వెళ్ళారు. ఆమె విస్మరించినా, ఆమె మిగిల్చి వెళ్ళిన సంస్థ అదే స్థాయిలో కొనసాగ గలదని, ఆమె పేరును చిరస్థాయి చేయగలదని ఆశించవచ్చు.

(ఫిబ్రవరి 25, 1986)

# ధన్యజీవి

డాక్టర్ కె. ఎల్. రావుగారిని గురించి ఒకసారి ఎవరో ఛలోక్తిగా అన్నారు: ఎక్కడ కొత్త నీటి మడుగు కనబడితే అక్కడ, ఆఖరికి జోరున వాన కురిసి వీధుల్లో కాల్వలుగా పారుతున్నా సరే, ఆయన అక్కడ తన్మయులై ఆగిపోతారట. చిన్నపిల్లలు కాగితాల పడవలు వదిలినట్టు ఆయన ఊహల పడవలను వాటిలో వదిలి — ఈ నీటిని పొలాలకు ఎలా మళ్ళించవచ్చు, ఎన్ని ఎకరాలు సాగు చేయవచ్చు, ఎంత పంట పండించవచ్చు అని ....ఆలోచనల పారవశ్యంలో తేలిపోతారట.

ఇందులో అతిశయోక్తి లేకపోలేదు కాని, అది చాలా కొంచెం. ఆయన స్వభావతః స్వాప్నికుడు. ఆయనది అదో లోకం. అది జలమయ ప్రపంచం. దానిలో నదులకు, కాల్వలకు, ప్రాజెక్టులకు, ఆనకట్టలకు, ఆయకట్టులకు, పంట పొలాలకు, బంగారం పండే పైర్లకు, కోట్లాది ప్రజల క్షుత్పిపాసా పరితృప్తికి, వారి పెదవులపై విరిసే సంతోష కుసుమాలకు తప్ప, మరొకదానికి తావులేదు. తాను, తన కుటుంబం, కుటుంబ యోగక్షేమాలు అన్నీ ఆ విశాల సుందర స్వప్నాల తర్వాతే.

ఈ స్వప్నాలతోనే డాక్టర్ కానూరు లక్ష్మణరావు 84 సంవత్సరాల పరిపూర్ణ జీవితం గడిపారు. ఆ స్వప్నాలు కంటూనే, నిండు వయస్సులో పండుటాకులా రాలిపోయారు.

అయితే, ఆయన కట్టినవి సముద్రపుటొడ్డున పిచ్చిక గూళ్ళు కావు; లోతైన, దృఢమైన పునాదులపై మహోన్నత సౌధాలు. ఆయన కన్నవి శుష్క స్వప్నాలు కావు. నిజం కావడానికి వీలులేని కలలేవీ ఆయన కనలేదు. ఆ సేతు శీతాచలం పర్యటిస్తే గడచిన నాలుగు దశాబ్దాలలో ఆయన కన్న అందమైన కలలెన్నో పేద్యపు నీటి ప్రాజెక్టుల రూపంలోనో, జలవిద్యుదుత్పత్తి కర్మాగారాల రూపంలోనో దర్శన మిస్తాయి. డాక్టర్ రావును పోల్చవలసింది ఒక సర్ ఆర్థర్ కాటన్‌తో, ఒక మోక్షగుండం విశ్వేశ్వరాయతోనే. వారి వలె ఈయన కూడా తన భగీరథ తపస్సుతో, కృషితో ఎన్నో తన కలలు నిజం చేసుకున్నారు.

ఆయన పుట్టింది కృష్ణాజిల్లా కంకిపాడు గ్రామంలో, పెరిగింది విజయవాడలో, పెద్ద చదువులు చదివింది మద్రాసులో, మొదట పని చేసింది మెట్టూరు వంటి పెద్ద ప్రాజెక్టులలో, ఉన్నత విద్య అభ్యసించింది ఇంగ్లండులో, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం స్వదేశం తిరిగి వచ్చిన తర్వాత ఇంజనీరింగ్ వృత్తిలో ఉన్నతోన్నత శిఖరాలు అందుకున్నది ఢిల్లీలో, చివరకు ఉత్తమోత్తమ భారత పౌరుడుగా ఎదిగింది మంత్రిగా కేంద్ర ప్రభుత్వంలో. ఈ సుదీర్ఘ జీవిత యాత్రలో ఆయన నడిచింది పూలబాట కాదు - ముళ్ళు, రాళ్ళు, అవాంతరాలు అడుగడుగునా ఎదురైన గతుకుల దారిలో. ఆయన మొదటి నుంచి అసాధ్యాలను సాధ్యం చేసి తీరాలన్న పట్టుదల గల మనిషి. అందుచేత సహజంగానే ఆయన మొదటి నుంచి వివాదాస్పద వ్యక్తిగానే వుండేవారు. ఆయన ప్రతిభా విశేషాలకు అసూయతో కొందరు, ఆంధ్రుడైనందున ఆంధ్ర ప్రాంతానికి ఉపయోగపడే ప్రాజెక్టులు తలపెడుతున్నారని మాత్సర్యంతో

కొందరు, ఆంధ్రుడై నందునే ఆయనను వీలైనంత తొందరగా దింపివేయాలన్న ఈర్ష్యతో ఆంధ్రులలోనే ప్రబుద్ధులు కొందరు — ఆయనకు ఎన్ని ఇబ్బందులు, ఎన్ని అవరోధాలు కల్పించాలో అన్నీ కల్పించారు. అయినా, ధీరోదాత్తతతో, చలించని ఆత్మ విశ్వాసంతో అన్నిటినీ ఎదుర్కొని ఆయన ఎన్నో ఘన విజయాలు సాధించారు.

హీరాకుడ్, కోసీ, చంబల్, ఫరక్కా, నాగార్జున సాగర్, శ్రీశైలం, రాజస్థాన్ కాల్వ, ఇంకా ఇటువంటి ప్రాజెక్టు లెన్నిటికో ఆయన రూపకల్పన చేశారు. నాగార్జున సాగర్‌కు 1956లో శంకుస్థాపన చేసిన పండిట్ నెహ్రూ 1963 లో ఆ ప్రాజెక్టును సందర్శించినప్పుడు ఒక రైతు ఆయనతో "ఇవి మీరు వెలిగించిన దీపమే" అన్నాడట. అయితే ఆ దీపానికి రూపశిల్పి డాక్టర్ కె. ఎల్. రావు. పండిట్ నెహ్రూ భాక్రానంగల్, నాగార్జున సాగర్ వంటి భారీ ఇరిగేషన్ ప్రాజెక్టులను ఆధునిక దేవాలయాలుగా అభివర్ణించారు. అయితే, అట్టి అభినవ దేవాలయాల వాస్తుశిల్పి డాక్టర్ కె. ఎల్. రావు.

కేంద్ర జల విద్యుత్సమండలిలో సభ్యుడుగా పదవీ విరమణ చేసిన డాక్టర్ కె. ఎల్. రావు రాజకీయాలలోకి రావడం అనుకోకుండా జరిగింది. విజయవాడ నియోజక వర్గానికి లోక్ సభలో ప్రాతినిధ్యం వహించిన ఆయన మేనకోడలు డాక్టర్ అచ్చమాంబ 1962 ఎన్నికలలో తాను తిరిగి నిలబడడానికి ఇష్టపడక డాక్టర్ రావును ఒప్పించడం, కాంగ్రెస్ అభ్యర్థిగా ఆయన పోటీచేసి గెలుపొందడం యాదృచ్ఛికంగా జరిగింది. అంతే యాదృచ్ఛికంగా 1963లో ఆయనను ప్రధాని నెహ్రూ తన మంత్రి వర్గంలోకి ఇరిగేషన్, పవర్ శాఖ స్టేట్‌మంత్రిగా తీసుకోవడం జరిగింది. ఆ తర్వాత పదేళ్ళపాటు అదే శాఖలో ఆయన కొనసాగారు. నెహ్రూ మంత్రి వర్గంలో ఒకసారి, గుల్జారీలాల్ నందా తాత్కాలిక మంత్రి వర్గంలో రెండుసార్లు, లాల్ బహదూర్ మంత్రివర్గంలో ఒకసారి, ఇందిరాగాంధి మంత్రి వర్గంలో మూడుసార్లు - మంత్రిగా మొత్తం ఏడుసార్లు ప్రమాణ స్వీకారం చేసిన ఘనత దక్కిన కొద్దిమందిలో ఆయనొకరు. తన పదవీ కాలంలో ఆయన దేశవ్యాప్తంగా ఎన్ని ఇరిగేషన్, ఎన్ని విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల నిర్మాణానికి దోహదం చేశారో లెక్కలేదు. ఆధునిక భారతదేశం ఆయనకు ఆ విధంగా ఎంతైనా ఋణపడి వుంది.

ఒక లోటుగా పరిగణించవలసి వస్తే డాక్టర్ రావు పదవిలో వున్న పదేళ్ళ

స్టేట్ మంత్రిగానే వుండిపోయారు. క్యాబినెట్ హోదా ఆయనకు రాలేదు. ఆయన రాజకీయవేత్త కాకపోవడమే బహుశా దానికి కారణమై వుంటాలి. చుట్టూ మంది మార్బలం, వంది మాగధ గణం, పవర్ బ్రోకర్ల బృందం వుండే వారికి అటువంటి పదవులు దక్కుతాయి. డాక్టర్ రావుకు ప్రతిభా వ్యుత్పత్తులు, శక్తి సామర్థ్యాలు, చిత్తశుద్ధి, సంకల్పసిద్ధి తప్ప వేరే అనుచర గణం, రాజకీయ ప్రాబల్యం లేదు. అయినా, ఆయనకు తన మంత్రిత్వ శాఖలో పూర్తి స్వేచ్ఛ వున్నందున క్యాబినెట్ హోదా రాకపోవడం ఒక లోటుగా కనబడలేదు. నెహ్రూ నుంచి ఇందిరాగాంధీ వరకు ప్రతిసారి మంత్రివర్గ పర్మాణ సమయంలో ఆయన ఏ మూల ఎక్కడ వున్నా ఆఘమేఘాల మీద ఢిల్లీ రప్పించుకుని, మంత్రివర్గంలో స్థాన మివ్వడం జరిగింది. అయితే, తుది రోజులలో ఆయన పట్ల అసూయాగ్రస్తులైన వి.పి. నాయక్ వంటి ముఖ్యమంత్రులు, ఎం. ఎస్. పాఠక్ వంటి ప్లానింగ్ కమిషన్ సభ్యులు, కొందరు ఆంధ్ర ఎం.పి.లు ఒత్తిడి తీసుకురావడంతో శ్రీమతి గాంధి కొంత అమర్యాదగానే ఆయనను మంత్రివర్గం నుంచి తప్పించడం ఆయన జీవితంలో ఒక బాధాకర ఘట్టం.

కాగా, ఆయన కన్న కలలలో కొన్నే నిజమైనాయి. మరికొన్ని ఇంకా మిగిలి వున్నాయి. వాటిలో మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు అలనాడు అహోరాత్రాలు శ్రమించి ఆయన రూపకల్పన చేసిన రామపాదసాగర్ ప్రాజెక్టు ఒకటి. మరొక కల పులిచింతల ప్రాజెక్టు. అన్నిటిలోకి బృహత్తరమైనది గంగా-కావేరీ నదుల అనుసంధాన కల్యాణ తోరణం. భావి భారత సౌభాగ్య సౌధ ద్వారానికి ఆ తోరణాన్ని అలంకారంగా సమర్పించాలన్నది ఆయన చిర స్వప్నాలలో ఒకటి. ఎందరో వ్యతిరేకిస్తున్నా, తూష్ణీక రిస్తున్నా ఈ స్వప్నాలను నిజం చేయడం భారత ప్రజలు ఆయనకు అర్పించగల నిజమైన నివాళి. విరుడు కనిష్క విమాన ప్రమాదంలో ఆయన మనుమలైన ఇరువురు చిన్నారులను అట్లాంటిక్ మహాసముద్రం కబళించింది. ఏడాది తిరగకుండానే పాశుపత్తు డాక్టర్ రావునే మృత్యు మహా సముద్రం విలీనం చేసుకున్నది. దెబ్బపై దెబ్బ తిని శోక మహా సముద్రంలో మునిగిన ఆ ధన్యజీవి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి.

(మే 28, 1986)

# తప్పొప్పుల పట్టిక

ఎంత జాగ్రత్తగా ప్రూఫులు చదివినా కొన్ని అచ్చు తప్పులు పడ్డాయి. ముద్రణ పూర్తి అయిన తర్వాత మరొకసారి చదివినప్పుడు కనబడిన కొన్ని తప్పులను, వాటి ఒప్పులను ఈ దిగువ ఇస్తున్నాను.

- రచయిత

| పేజీ | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 21 | 19 | హీంసాత్మకంగా | హింసాత్మకంగా |
| 60 | 7 | అద్భుతావగాహంగా | అద్భుతావహంగా |
| 68 | 12 | కవులతో | కరవులతో |
| 80 | 26 | స్వాతంత్ర్యం | స్వతంత్రం |
| 110 | 5 | వైముఖ్యం ? | వైముఖ్యం. |
| 112 | 8 | తాలూకాతో | తాలూకాలో |
| 121 | 21 | యిస్తున్నట్టు స్వీడిష్ అకాడమీ | యిస్తున్నట్టు ప్రకటించి స్వీడిష్ |
| 123 | 25 | ఫిబ్రవరి 5, 1975 | ఫిబ్రవరి 5, 1974 (అకాడమీ |
| 135 | 23 | దౌర్జన్యాలను | దౌర్బల్యాలను |
| 135 | 24 | అనుభంవిచదగిందిగా | అనుభవించ దగిందిగా |
| 140 | 4 | విధిచేత | విధిచేతి |
| 174 | 1 | ప్రణయవల్లకి | ప్రణయవల్లకి |
| 182 | 1 | ఆంధ్రేలకు | ఆంధ్రులకు |
| 193 | 22 | మార్చి 29, 1981 | మార్చి 29, 1982 |
| 201 | 26 | అక్షర రమ్యమై | అక్షర రమ్యతతో |
| 205 | 21 | సిద్ధాంత పరిణామ వాదానికి | సిద్ధాంతం పరిణామ వాదానికి |
| 208 | 4 | ఔన్నత్యం | ఔన్నత్యమే |
| 208 | 6 | సాధారుణులకు | సాధారణులకు |
| 216 | 17 | ఒంటరి | ఒంటరిగా |

